## న్యూఢిల్లీ లేఖ

డా. జయ్ దుభాషి



# శ్వేత పత్రానికి కూడా ధైర్యం చాలదా?

"వాళ్ళు (పాకిస్తానీలు) ఏమి చేస్తున్నారో మాకు కచ్చితంగా తెలుసు. వాళ్ళు తీవ్రవాదులకు ఏయే ప్రాంతాలలో, ఎక్కడెక్కడ శిక్షణ ఇస్తున్నారో మాకు తెలుసు. చివరికి శిక్షణ ఇచ్చేవారి పేర్లు కూడా మాకు తెలుసు".

లోక్ సభలో శ్రీ షహబుద్దీన్‌తో శ్రీ నట్వర్‌సింగ్ చెప్పిన మాటలివి. పంజాబ్ తీవ్ర వాదులకు పాకిస్తాన్ సహాయం చేస్తున్నదనడానికి నిస్సందేహమైన ఆధారాలున్నాయా అని శ్రీ షహబుద్దీన్ అడిగారు. భగవంతుడు ఆయన ఆత్మకు దీవెనల నొసగుగాక! ఆయన అడిగిన ఆధారాలు సరిగ్గా బోఫోర్స్ వ్యవహారంలో తనకు సంబంధం ఉన్నదనడానికి నిస్సందేహమైన ఆధారాలున్నాయా అని రాజీవ్‌గాంధీ అడిగినటువంటివే. ఐతే ముఖ్యమైన విషయమేమంటే జియాకు వ్యతిరేకంగా ఈ ఆధారాలన్నీ ఉంచుకుని భారతదేశం ఏమిచేస్తున్నది? లేదా ఏమీ చెయ్యకుండా ఎందుకు ఉంటున్నది? కనీసం ఈ విషయం మీద భారత ప్రభుత్వం ఒక శ్వేత పత్రాన్ని అయినా సమర్పించలేదు. దాని వల్ల ఏదో మేలు జరుగుతుందని కాదు. దెబ్బ తీయడానికి మనకు జంకు ఉన్నప్పుడు ప్రపంచంలో ఉన్న శ్వేత పత్రాలన్నీ కలిపి అయినా మన జంకును పోగొట్టలేవు.

మనం ఒక ప్రాంతీయ శక్తి అవునా కాదా? మధ్యధరా సముద్ర తీరాన- బ్రహ్మాండమైన అరబ్ దేశాల మధ్య ఇరుక్కుని ఉన్న ఆ చిన్న దేశం తన వ్యవహారాలను ఎట్లా నడుపుతున్నదో గమనించండి. మొన్నీమధ్యనే ఆదేశం ఒక స్త్రీతో సహా ఓ అరడజనుమంది కమెండోలను టునిస్‌కు పంపింది. యాసర్ అరాఫత్‌కు చెందిన పి. ఎల్. ఓ.లో రెండో స్థాయి నాయకుడయిన అబుజిహాద్‌ను తూటాల వర్షంలో ముంచి చంపేయించింది. ఎన్నెన్నో బాధలు అనుభవించిన పాలస్తీనియన్ అరబ్బులపట్ల నాకు పూర్తి సానుభూతి ఉన్నది. కాని ఆ బాధలకు ఇజ్రాయెలీలు బాధ్యులు కారు. సరిగ్గా పఠాన్‌ల పట్ల, సింధీల పట్ల జియాలకు, జునేజోలకు ఎటువంటి అయిష్టం ఉన్నదో, పాలస్తీనియన్‌ల పట్ల అరబ్బులకు కూడా అటువంటి అయిష్టమే ఉన్నది. పాలస్తీనియన్లు సాధ్యమైనంత ఎక్కువ కాలం అసహాయులుగానే ఉండాలని అరబ్బులు కోరుకుంటారు. కొన్ని సార్లు ఇజ్రాయెలీలు అతిగా ప్రవర్తిస్తుంటారు. గత కొద్ది నెలలుగా పాలస్తీనియన్లతో ఇజ్రాయెల్ సైన్యం దాదాపు యుద్ధం చేస్తున్నట్లుగా ఉన్న గాజా ప్రాంతంలో వాళ్ళ చర్యలు ఇందుకు ఉదాహరణలు. కాని వాళ్ళు చేస్తున్న పనులకు నేను వాళ్ళను తప్పుపట్టను. ఆ రెండు దేశాలు పరస్పరం యుద్ధంలో మునిగి ఉన్నాయి. ఈ శత్రుత్వం కొనసాగినంత కాలం ఇజ్రాయెల్ చేసే పనులన్నీ పూర్తిగా సమర్థించదగినవే.

ఒకటి రెండు సంవత్సరాల కింద అధ్యక్షుడు రీగన్ గడ్డాఫీతో ఎట్లా వ్యవహరించారో, ఆయనను ఎట్లా శాశ్వతంగా నోరు మూయించారో గమనించండి. గడ్డాఫీ అప్పటివరకూ చాలా ఎక్కువగా మాట్లాడుతుండేవారు. ఉత్తర ఆఫ్రికా మొత్తం తన స్వంత సామ్రాజ్యం అన్నట్టుగా ప్రవర్తిస్తుండేవారు. ఆయనను ఆయన ఇంట్లోనే దెబ్బతీశారు. అప్పటి నుంచి ఆయన గొంతే వినబడడం లేదు. ఇటువంటి మనుషులు అల్పమైన నియంతలు. రెండో ప్రపంచ యుద్ధానికి ముందు తూర్పు యూరప్ లోని చిన్న చిన్న దేశాలలో ప్రాబల్యం వహించిన నియంతలలాంటి వాళ్ళే వీళ్ళు. వాళ్ళకు అర్థమయ్యేవిషయం బలప్రయోగం ఒక్కటే. అమెరికన్లు ఇరానియన్లకు కూడా బుద్ధిగా ఉండమని హెచ్చరిక చేశారు. లేకపోతే, ఖొమేనీ కూడా గడ్డాఫీ మార్గం లోనే ఉండి ఉంటే వాడంటే నాకు ఆశ్చర్యం లేదు. అమెరికన్లు ఇరాన్ లోకి వెళ్ళి ఖొమేనీ చమురు రిగ్గులకు నిప్పంటించి వచ్చారు. వాళ్ళు చేసిన పని ఇటువంటి విషయాలలో అంతర్జాతీయంగా అంగీకరించే మర్యాదలకు కచ్చితంగా లోబడి ఉండకపోవచ్చును. కాని యుద్ధమంటే యుద్ధమే. బలప్రయోగమంటే బలప్రయోగమే. అది ఏకైక మార్గమని మీరు నిర్ణయించుకున్న తర్వాత ఇక విరుచుకు పడి పూర్తిగా దాన్ని ఉపయోగించుకోవాలి. మర్యాదలు ఏమైపోయినా ఫర్వాలేదు.




ఇరాకీలు సరిహద్దుకు సమీపంలోనే అణువిద్యుత్ కర్మాగారాన్ని నిర్మిస్తున్నారని గుర్తించగానే ఇజ్రాయెలీలు ఏం చేశారు? కాశ్మీర్ మీద దురాక్రమణ జరుగుతున్నప్పుడు జవహర్‌లాల్ నెహ్రూ చేసినట్టుగా వాళ్ళు భద్రతా సమితి దగ్గరికి వెళ్ళి తీర్మానం ప్రవేశ పెట్టలేదు. వాళ్ళు ఆమాటా ఈ మాటా చెప్పి హామీలు ఇవ్వలేదు. వాళ్ళు సరాసరిగా ఇరాక్ లోకి వెళ్ళిపోయి ఆ మొత్తం ప్రాంతం మీద బాంబులు వేశారు. ఆటం బాంబులు తయారు చేసే వ్యవహారంలో దిగవద్దని ఇరాకీలకు గుర్తు చేసేందుకు నోరు తెరుచుకుని చూసే బాంబును వదిలేసి పోయారు. ఇజ్రాయిలీలు నిజంగా చెప్పదలచుకున్న దేమిటంటే, పశ్చిమ ఆసియాలో తమ అనుమతి లేకుండా ఏ దేశమూ అణుబాంబులు తయారుచేయడానికి వీలులేదు. అంతే. పాకిస్తానీ అణుబాంబు విషయంలో కూడా ఇజ్రాయెలీలు అదేవిధంగా వ్యవహరించనున్నారనిపిస్తుంది. ఏదో ఒక రోజువాళ్ళు ఆపని చేసి తీరుతారు. అప్పటిదాకా పదవిలోనే ఉన్నట్లయితే శ్రీ నట్వర్‌సింగ్ పార్లమెంటులో లేచి ఇజ్రాయెల్ వంటి దేశం ఇటువంటి పనికి ఒడిగట్టడం దారుణమని ప్రకటిస్తాడు. బహుశా ఇజ్రాయెల్‌ని ఐక్యరాజ్య సమితి నుంచి బహిష్కరించాలని భద్రతా సమితిని

కోరుతారు.

ఐతే శ్రీ నట్వర్‌సింగ్‌కు సంబంధించి ఒక అంశం ఉంది. ఆయన ప్రభుత్వం పాకిస్తాన్ లోని తీవ్రవాదుల గురించి ఏమీ చెయ్యజాలదు. ఎందుకంటే, స్వయంగా మన చేతులు ఏమంత శుభ్రంగా లేవు. శ్రీలంకలో మనం చేసిన గందరగోళం చూడండి. తమిళ తీవ్రవాదులకు మన నేల మీద మన మనుషులే ఆయుధాలందించారు. శిక్షణ ఇచ్చారు. ఇప్పుడు మళ్ళీ మన బలగాలే వాళ్ళను చంపేస్తున్నాయి. వాస్తవానికి ఎల్. టి. టి. ఇ తదితరులు భారత శాంతి పరిరక్షక దళాలకు వ్యతిరేకంగా వాడుతున్న ఆయుధాలలో దాదాపు కచ్చితంగా మన ఆయుధాలు ఉండి ఉంటాయి. శ్రీలంకలో ప్రస్తుతం ఉన్న శాంతి దళాల్లో కొందరు ఒకప్పుడు ఎల్. టి. టి.ఇ గెరిల్లాలకు శిక్షణ ఇచ్చిన వాళ్ళే కూడా అయి ఉంటారు. ఎవరు ఎవరిమీద ఎందుకు పోరాడుతున్నారో ఏమీ స్పష్టంగా తెల్లియరావడం లేదు. కాని పంజాబ్ లోని తీవ్రవాదులకు జియామనుషులు సహాయం చేస్తున్నట్టుగానే తమిళ గెరిల్లాలకు భారతదేశం సహాయం చేసిందనడంలో సందేహం లేదు. జియా ఆలోచిస్తున్నది కూడా ఇదే అయి ఉంటుంది. ఎందుకంటే శ్రీలంకలో అదేపని చేసినప్పుడు మనది ఒప్పు అయితే శ్రీ నట్వర్‌సింగ్ తదితరులు జియా తప్పు చేస్తున్నట్టుగా ఆరోపిస్తూ వేలెత్తి ఎట్లా చూపగలుగుతారో నాకు అర్థం కావడం లేదు.

కాని నేను చెప్పదలచుకున్న విషయం ఇదికాదు. శ్రీలంకలో మనం ఏమి చేశామో పట్టించుకోకుండా, సరాసరిగా పాకిస్తాన్ లోకి వెళ్ళి అక్కడి తీవ్రవాదుల స్థావరాలను ధ్వంసం చేయడం పూర్తిగా సమర్థించ దగినదే అని నేను అనుకుంటాను. ఇటువంటి విషయాలలో ఉన్నతమైన నీతి ఒకటి ఉంది. అది కేవలం స్వార్థం అనేనీతి. ఇరాకీలు తమ అణువిద్యుత్ కర్మాగారాన్ని తమ సరిహద్దుల లోపలే నిర్మించుకుంటున్నారు గనుక ఇజ్రాయెలీలు దాని మీద దాడి చేసి ధ్వంసం చేయవలసిన అవసరమే లేదు. కాని ఉన్నతమైన నీతి ప్రకారం ఆ కర్మాగారాన్ని ధ్వంసం చేయవలసి వచ్చింది. ఎందుకంటే అది ఇజ్రాయెల్ ఉనికికి ప్రమాదకరంగా మారబోతున్నది. పంజాబ్ విషయంలో ఒక దేశంగా మన ఉనికి, సమగ్రత ప్రమాదంలో పడుతున్నాయి. కనుక అక్కడికి వెళ్ళి ఆ స్థావరాలను నామ రూపాలు లేకుండా నాశనం చేయడం పూర్తిగా సరైన చర్యే అవుతుంది. నిజానికి రాబోయే రోజుల్లో కచ్చితంగా మనం చేయబోయే పని ఇదేననడంలో నాకు ఎటువంటి సందేహం లేదు. మనం ఈ పని చేస్తామని పాకిస్తాన్ కూడా ఎదురు చూస్తున్నది. తూర్పు బెంగాల్‌లోని ఉద్రిక్త పరిస్థితి వల్ల మనదేశంలోకి కాందిశీకుల వరద పెరిగిందనే కారణం మీద మనం అక్కడికి వెళ్ళగలిగినప్పుడు పాకిస్తాన్ లోకి వెళ్ళకుండా ఉండడానికి నాకు ఏ కారణమూ కనబడడం లేదు. అది పూర్తి స్థాయి యుద్ధం కాదు. కేవలం ఇరాక్‌లో ఇజ్రాయెలీలు చేసినటువంటి దాడి మాత్రమే. జియా ఆడుతున్న నాటకానికి తద్వారా ముగింపు పలకవచ్చు.

సందర్భ వశాత్తూ, ఇజ్రాయెల్ ఎంత చిన్నదేశమో మీకు తెలుసా? దాని జనాభా 45 లక్షలు. అంటే బొంబాయి లేదా కలకత్తా నగరాల జనాభాలో సగం. దాని వైశాల్యం 21 వేల చదరపు కిలో మీటర్లు. అది ఇరాక్ వైశాల్యంలో ఇరవయో వంతు. ఇరాన్ వైశాల్యంతో, లిబియా వైశాల్యంతో పోలిస్తే వందో వంతు. కాని ఇజ్రాయెల్ వీటిని పట్టించుకోకుండా పోరాడుతూనే ఉంటుంది. అమెరికాలోనూ, ఇతరచోట్ల ఉన్న యూదుల సహాయం ఉందనడంలో సందేహం లేదు. వాళ్ళు ఎందుకు సహాయం చెయ్యగూడదు? అది వాళ్ళ మాతృదేశం కదా. సరిగ్గా ఎక్కడ నివసించే వారయినా, సాంకేతికంగా ఏదేశ పౌరులయినా హిందువులందరికీ మాతృదేశం హిందూస్తాన్ కావలసి ఉన్నట్టుగానే యూదులకు మాతృదేశం ఇజ్రాయెల్. కాని మన దుస్థితి చూడండి. మన ప్రభుత్వానికి పాకిస్తాన్ గురించి ఒక శ్వేత పత్రం విడుదల చేయడానికి కూడా ధైర్యం చాలడంలేదు" □

## రచయితలకి సూచనలు

ఆంధ్ర సచిత్రవారపత్రికకి పరిశీలనార్థం తమ రచనలని పంపే వారు ఈ కింది సూచనలని గమనించ కోరుతున్నాము.

రచనలు కాగితానికి ఒక వైపే సిరాతో లేదా బాల్ పెన్‌తో రాయాలి. కాగితానికి రెండు వైపులా రాసి ఉన్న రచనలని పరిశీలించటం జరగదు.

పరిశీలనకి పంపే రచనలు కథలైతే 10 అరఠావు పేజీలకి మించకుండా ఉంటే మంచిది. వ్యాసాలు 3 అరఠావు పేజీలు మించరాదు. వ్యాసాలు పంపేవారు వాటికి సంబంధించిన బొమ్మలు లేదా ఫొటోలు జతపరిచి పంపటం అవసరం.

రచనలు స్వంత రచనలై ఉండాలి. అనువాదాలు, అనుసరణలు, కాపీ రచనలు పంపరాదు. ఆ మేరకి రచయిత(త్రి) హామీ పత్రం రాసి సంతకం చేసి రచనతో పాటే పంపాలి.

రచనలు పూర్తిగా తెలుగు లిపిలోనే రాసి ఉండాలి. వ్రాత ప్రతి మీద రచయిత(త్రి) పూర్తి చిరునామా స్పష్టంగా పిన్‌కోడ్‌తో సహా రాయాలి.

కథల పరిశీలనకి 1–2 నెలలు, నవలల పరిశీలనకి కనీసం 6 నెలలు పట్టవచ్చును. పరిశీలన అయిన తర్వాత ఏ విషయం ఆయా రచయిత(త్రు)లకి తెలియచేయటం జరుగుతుంది. ప్రచురణకి స్వీకరించని రచనలని తిప్పి పంపకోరేవారు తమ రచనతో పాటే స్వంత చిరునామా కల, తగినన్ని తపాలా బిళ్ళలు అతికించిన కవరు జత పరచి పంపాలి. లేకపోతే వాటిని తిప్పి పంపటం సాధ్యం కాదు. రచనలు తిప్పి పంపే విషయంలో తగిన జాగ్రత్త తీసుకోటం జరుగుతుంది కానీ పోస్టులో పోయే వాటి విషయంలో మేము బాధ్యతని స్వీకరించలేము. వాటిపై ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలకీ అవకాశం లేదు.

రచనలు పంపిన వారు తమ చిరునామా మారిన సందర్భంలో వెంటనే ఆ విషయాన్ని మా కార్యాలయానికి తెలియ చేస్తూ ఒక కార్డు రాయటం అవసరం.

ఉత్తరాలు, తదితర పాఠకుల శీర్షికలకి రాసే వారు కూడా తమ పేరు, పూర్తి చిరునామా ఇవ్వాలి. రచనలు పూర్తిగా తెలుగు లిపిలోనే ఉండాలి. లేకపోతే వాటిని పరిశీలించటం జరగదు.

పరిశీలనకి పంపే రచనలని "సంపాదకుడు, ఆంధ్ర సచిత్రవారపత్రిక, గాంధీనగరం, విజయవాడ – 520003" అనే చిరునామాకి పంపాలి. కవరు పైభాగంలో శీర్షిక పేరు రాయటం మంచిది.

– సంపాదకుడు

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :

**దేశోద్ధారక కాశీనాథుని**

**నాగేశ్వరరావు పంతులుగారు**

స్థాపితం : 1908

**శివలెంక శంభుప్రసాద్**

సంపాదకుడు : (1938-1972)

15.7.88; 22.7.88

శ్రీ విభవ నామ సం. ఆషాఢ శు. విదియ; అష్టమి

**సంపుటము 80 : సంచికలు 47; 48**

ముఖ్య సంపాదకుడు :

**శివలెంక రాధాకృష్ణ**

కార్యవాహక(యాక్టింగ్) సంపాదకుడు :

**మతుకుమల్లి మాధవరావు**

| | |
|---|---|
| విడి ప్రతి వెల | రు. 3.00 |
| పోస్టులో 6 నెలల చందా | రు. 87.10 |
| పోస్టులో 12 నెలల చందా | రు. 174.20 |

**ఆంధ్రపత్రిక కార్యాలయము,**

గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

ముఖచిత్రం :

నటి : ఖుష్బూ

ఫొటో : కేశవన్





## ఉత్తరాలు

### ముఖచిత్రం

ఆంధ్ర సచిత్ర వార పత్రిక ముఖ చిత్రం చిరంజీవి, భానుప్రియ అత్యంత రమణీయంగా ఉన్నది. ముఖ చిత్రం ఇన్నాళ్ళకు జంటగా వేసినందుకు సంతోషముగా ఉంది. —ఎస్. గిరిబాబు, పలాస

### సీరియల్స్

చల్లా సుబ్రమణ్యం సూపర్బ్ సీరియల్ "పవిత్రపాపి" వెరి ఫెంటాస్టిక్. "రాకా" పాత్ర చాల బాగుంది. —ప్రియాంక, మహబూబాబాద్

★ ★ ★

చల్లా సుబ్రహ్మణ్యంగారి "పవిత్రపాపి" నవల ఎంతో సస్పెన్స్‌గా సాగుతుంది.

—చిత్రాడ విజయ్‌కుమార్, సోంపేట

★ ★ ★

పవిత్రపాపి సీరియల్ చాలా థ్రిలింగ్‌గా సాగుతుంది. మరో మలుపు చాలా ఇంటరెస్టింగ్గా సాగుతుంది.

—ఎల్. వి. సుబ్బయ్య, పద్మావతి, గూడూరు

★ ★ ★

'పవిత్రపాపి' సీరియల్ ప్రతి వారం సరికొత్త మలుపులతో సస్పెన్స్‌ను మేళవించుకుని మిస్టరీగా కొనసాగుతూంది.

—బి. రాజేశ్వర్, కొరటికల్

★ ★ ★

చల్లా సుబ్రహ్మణ్యంగారి సీరియల్ 'పవిత్రపాపి' చదువుతుంటే భలే థ్రిల్లింగ్‌గా ఉంది. రచయిత చక్కని రచనా శైలితో, ఎంచుకొన్న సబ్జక్ట్ ఇతివృత్తం కథ నడిపిస్తున్న తీరు హర్షణీయంగా ఉన్నాయి. ముఖ్యంగా రాకా పాత్రను మలచిన తీరు అద్భుతంగా ఉంది. మల్లాదిగారి వినాయకరావు పెళ్ళి సీరియల్ చాలా ఆసక్తికరముగా సాగుతున్నది.

—చిక్కా వెంకటేశ్వర్‌రావు, పొన్నెకల్

★ ★ ★

"పవిత్రపాపి" సీరియల్ ప్రారంభం నుంచి మమ్ములను ఆకట్టుకొన్నది. చల్లా గారికి మా అభినందనలు. "వినాయకరావు పెళ్ళి" సీరియల్ సింప్లీ సూపర్బ్. మల్లాదిగారికి మా ధన్యవాదాలు.

కసుపాటి రవిశంకర్, కర్నూలు

★ ★ ★

"పవిత్రపాపి", "మరో మలుపు" ఈ వారం ఒక ఊపు ఊపాయి. నాటి పెళ్ళి ముచ్చట్లు శీర్షికలో కొందరి అభిప్రాయాలు ఆసక్తికరంగాను, ఆశ్చర్యంగాను వుంటున్నాయి. డిటెక్టివ్ నవలని మించిన హత్య కేసు సస్పెన్స్‌గా ముగించారు.

—చోడవరపు నాగేశ్వరరావు, కుటుంబ సభ్యులు, హైదరాబాద్

### కథలు

'ఆడదికాదు అమ్మ' కథ వాస్తవికతకు దగ్గరగా హృదయాన్ని హత్తుకొనేలా ఉంది. ప్రస్తుత కాలంలో తల్లీ కొడుకుల అనురాగం ఎలా ఉండాలో చెబుతూ పరోక్షంగా యువకులకు వారి తల్లి తండ్రులపట్ల బాధ్యతను తెలియజేసారు రచయిత.

—కె. వి. మధుసూదనరావు, కాకినాడ

★ ★ ★

'విష ఫలం' కథ చదువుతుంటే గుండె బరువెక్కిపోయింది.... వృద్ధాప్యంలో పిల్లల అనురాగం కోసం పరితపించే తల్లి దండ్రుల దీనస్థితిని కళ్ళకు కట్టినట్టుగా చిత్రీకరించిన రచయితకు ధన్యవాదములు.

——సి. వి. నరసింహదాసు, విజయనగరం

### శీర్షికలు

"అర్జున్ అవార్డు గ్రహీతల దుస్థితి" అను శీర్షికలో వ్రాసిన వ్యాసము చదువుతుంటే నా మనస్సు ద్రవించింది. జీవితంలో కాకపోయినా కనీసం కలలో నైన అర్జున్ అవార్డు అందుకోవాలనే కోరిక వుండేది నాకు. అయితే పై వ్యాసాన్ని చదివిన తరువాత ఆ కోరిక చచ్చిపోయింది నాలో. పైగా అర్జున్ అవార్డుకు, దానిని అందుకున్నవారికి వున్న విలువ ఏమిటో స్పష్టంగా అర్థమైంది. అటువంటివారికి నా సానుభూతిని తప్ప మరేమి అందివ్వగలను? —యం. విశ్వశ్రీ, ఆదోని

★ ★ ★

"ఈకాలం పిల్లలు" కె. నాగేశ్వరిగారు ఎంతో చక్కగా వ్రాస్తున్నారు. "వినాయకరావు పెళ్ళి" సీరియల్ చాలా బావుంటున్నది. ఇంత చక్కటి పత్రికను అందిస్తున్న మీకు మా కృతజ్ఞతలు.

—నేలపూడి స్టాలిన్ బాబు, అంబాజీపేట

★ ★ ★

చిరంజీవి, భానుప్రియల ముఖ చిత్రంతో వెలువడిన సంచికలో 'అర్జున్ అవార్డు గ్రహీతల దుస్థితి'ని కళ్ళకు కట్టినట్టు చూపింది 'ముకరమ్' గారి వ్యాసం. వారికి మా కృతజ్ఞతలు

'ఈకాలం పిల్లలు' శీర్షికన 'కలం స్నేహాలు' అన్న వ్యాసం వెర్రితలలు వేసిన ఈ నాటి కలం స్నేహపు పోకడల్ని విశ్లేషించింది.

—పాటిబండి చక్రరావు, విశాఖపట్నం

★ ★ ★

"ఈ కాలం పిల్లలు" కె. నాగేశ్వరిగారి వ్యాసాలు చాలా ఉపయుక్తకరంగా ఉన్నాయి.

జి. సుబ్రహ్మణ్యశాస్త్రి, జక్కరసకుప్పం

### న్యూఢిల్లీ లేఖ

డా. జయదుబాషీగారి వ్యాసం 'రైతుల దుస్థితి' చాలా బావుంది. రైతుల కడగండ్లను కళ్ళకు కట్టినట్టుగా వివరించారు.

—అచ్యుత రామారావు, బూరుగపల్లి, వేలివెన్ను

సీరియల్

# వినాయకరావు పెళ్ళి





మల్లాది వెంకటకృష్ణమూర్తి

(గత సంచిక తరువాయి)

మర్నాడు సాయంత్రం ఎల్. ఐ. సి. నించి బయల్దేరుతుండగా అడిగాడు శాస్త్రి.

"ఇవాళ రాత్రి కూడా నీకు మంచి ఐడియా చెప్తాను."

"నీతో బార్‌కి ఛస్తే రాను" చెప్పాడు వినాయకరావు.

"తృతీయ విఘ్నం పనికి రాదు. రెండు రోజులుగా వెళ్తున్నాంగా."

"నా కిప్పుడూ చాలా అర్జెంట్ పనుంది" "కావాలంటే నీవు వెళ్ళు"

"మరి నన్నింటికి మోసుకెళ్ళేందుకు మనుషులుండరుగా నీవు లేకపోతే" చెప్పాడు శాస్త్రి.

* * *

టేంక్ బండ్ మీదున్న వేమన విగ్రహం దగ్గిరకి చేరుకున్నాడు వినాయకరావు. అతను వచ్చిన అయిదు నిమిషాలకి ఆటో దిగింది ఆదిలక్ష్మి. ఇద్దరు పచ్చటి పచ్చిక మీద కూర్చున్నారు.

"ఇవాళ వుత్తరం వచ్చింది. ఎల్లుండి వస్తున్నాడు బావ."

"వెరీగుడ్. వస్తే మన ప్లేన్‌ని అమలు పర్చు."

"విజయం మనదవుతుందో లేదోనని భయంగా వుంది."

**జరిగిన కథ- 14:** సుబ్బలక్ష్మి ఈశ్వరరావును ప్రేమించినట్టు కథ అల్లుతాడు వినాయకరావు. పెళ్ళి చెడగొట్టడానికి చేసిన ఈ ప్రయత్నం బెడిసి కొడుతుంది. అసలు విషయం తెలిసి వినాయకరావును పిలిపిస్తారు. ఆదిలక్ష్మి తల్లిదండ్రులు అంగీకరిస్తే తనకు అభ్యంతరం లేదంటాడు డాంబికేశ్వరరావు. నిశ్చితార్థాన్ని తప్పించుకున్న ఆదిలక్ష్మి తల్లితో కలిసి వినాయకరావుతో మాట్లాడడానికి వస్తుంది. తన మీద అభాండం వేసినందుకు కక్ష తీర్చుకుంటానని సుబ్బలక్ష్మి వినాయకరావుకు ఉత్తరం రాస్తుంది. ఆదిలక్ష్మి పెళ్ళి చెడగొట్టడానికి శాస్త్రి ఆలోచనలు చెపుతుంటాడు. కామేశానికి ఎయిడ్స్ ఉందని చెప్పాలనుకుంటారు.





ఇద్దరి మధ్యా కాసేపు మౌనం. అది పెరిగి ఇద్దరు భరించలేనంతగా అయాక చెప్పాడు వినాయకరావు–

"ఏదయినా మాట్లాడండి."

"మాట్లాడండి– కాదు. మాట్లాడు" చెప్పింది ఆదిలక్ష్మి.

"మాట్లాడు."

"మీరే ఏదయినా చెప్పండి."

వినాయకరావు కాసేపు ఆలోచించి చెప్పాడు–

"వాయిల్, సిల్కు, ఆర్గండి లాంటి పల్చటి చీరలు కుట్టేప్పుడు, బట్ట కింద ఓ కాయితాన్నుంచి కుడితే కుట్లు సమానంగా, చక్కగా పడ్తాయి. తర్వాత. కాగితాన్ని చింపేయచ్చు."

చిన్నగా నవ్వింది ఆదిలక్ష్మి "

"ఇల్లాలికో సలహా" చెప్పింది.

"రెఫ్రిజిరేటర్‌లో రకరకాల పదార్థాలుంచుతుంటాము కదా. ఆ వాసన రెఫ్రిజిరేటర్ లోపలి భాగంలో అంటకుండా వుండాలంటే ఒకటే చిట్కా. ఓ చిన్న పళ్ళెం నిండా బొగ్గులు పోసి వుంచితే సరి. వాసన వుండదు."

"మా ఇంట్లో ఫ్రిజ్ లేదు" చెప్పింది ఆదిలక్ష్మి.

"మన పెళ్ళయ్యాక కొనుక్కుందాం" చెప్పాడు.

వారిద్దరి మధ్యా మరి కాసేపు మౌనం.

ఆదిలక్ష్మి చటుక్కున గుర్తొచ్చినట్లుగా చెప్పింది.

"కాలేజ్ డేస్‌లో ఓ ఆట ఆడేవాళ్ళం. దాని పేరు ట్రిపిల్ స్ట్రయిక్. మీకా ఆట తెలుసా?"



# నాటి పెళ్లి ముచ్చట్లు




## ఊహ తారుమారు!

నా వివాహం గత సంవత్సరం జూన్ నెలలో జరిగింది. వివాహ కార్యక్రమం పూర్తయ్యాక చదివింపుల కార్యక్రమం ప్రారంభమైనది. మా శ్రీవారికి బహుమతులు వస్తున్నాయి. నాకు ఒక్క బహుమతి రాలేదు. అంతలో మా మరిది కాగితాలు చుట్టిన అట్ట పెట్టె తీసుకు వచ్చి నా పేర చదివించి నన్ను కాగితాలు విప్పమన్నారు. నేను ఆ పెట్టెలో ఏవో ఉంటాయని ఊహించుకొని చాలా సేపటి వరకు ఆ పెట్టె ఇప్పలేదు. చివరకు ఆ పెట్టె ఇప్పి చూస్తే అందులో అందమైన హ్యాండ్ బ్యాగు ఉంది. ఆ బ్యాగును నేను ఇప్పటికి జాగ్రత్త చేసుకున్నాను. ఆ రోజు నేనూహించుకున్న వస్తువులు తలచుకొంటే ఇంకా నవ్వొస్తుంది.

-సి. హెచ్. శ్రీరేఖ, రాజమండ్రి

★ ★ ★

## తిండి-కాలక్షేపం-కథలు!

నాడు 33 సం. క్రితం "మే" 3వ తారీఖు- 4వ తారీకున జరిగిన "పెళ్ళి". మేనెల మూడవ తారీకు. రంగు రంగుల బల్బులతో, తోరణాలతో వెలిగిపోతోంది పెళ్ళిపందిరి. చుట్టాల కబుర్లు ఆడవాళ్ళు పట్టు చీరల రెపరెపలు, వియ్యంకులు ఇద్దరూ పెళ్ళిపందిరి గేటు దగ్గర నిల్చున్నారు. ముఖంలో కంగారు, ఖాళీ గుబ్బుం బంద్లు వచ్చాయి. అసలే వేసవి. చమటతో తడిశారు. ఇద్దరూ వకీళ్ళు. మొహంలో ఆందోళన, ఆరాటం. వచ్చిన చుట్టాలు "పైన పటారం, పెళ్ళికొడుకు రాలేదు"-(పెళ్ళికొడుకు మెడిసన్ ఆఖరు సంవత్సరం. పరీక్షలు అంతకు మునుపు రోజే అయిపోయాయి) అంటూ రహస్యంగా చెవులు కొరుక్కోవడాలూ. అమ్మలక్కలు అసలే డాక్టర్ చదువు, ఏ నర్సును పెళ్ళి చేసుకున్నాడో అంటూ వ్యంగ్య విమర్శలు. "కట్నం లేదు" అంటూ రహస్య మంతనాలు. నాన్నగారి గుమాస్తా "అయ్యగారు మీ పేరన టెలిగ్రామ్" అంటూ తెచ్చిచ్చారు. నాన్నగారు ఆందోళనతో టెలిగ్రామ్ తెరిచి చదివారు. సంతోషంగా నాకు ఇచ్చారు. అందులో "సాయంత్రం రైలులో బయలుదేరుతున్నాను" అని ఉంది. పెళ్ళికొడుకు- విశాఖ నుంచి కర్నూలు రావాలి. మధ్య విజయవాడలో రైలు మారాలి. ఆ రైలు తప్పిపోయింది. సాయంకాలం రావలసిన పెళ్ళికొడుకు ప్రొద్దున వచ్చాడు. అంతలో వచ్చిన వారికి, తిండి, కాలక్షేపం-కథలు-వార్తలు. ఇది 1955 మే 3న జరిగిన సంఘటన.



-కె. వసంతాప్రకాష్, కడప

## వినాయకరావు పెళ్ళి

"ట్రిపెల్ ట్రస్టయికా? ఊహు. ఎప్పుడూ ఆ పేరే వినలేదు" చెప్పాడు వినాయకరావు.

"పెళ్ళయ్యాక వివాహం ఎలా వుంటుంది అన్న అంశాన్ని తెలియచేసే ఆట అది."

"ఎలా ఆడతారది?" అడిగాడు.

"ఓ కాగితం, పెన్ను వుంటే చూపిస్తాను."

వినాయకరావు రోజూ తనతో పాటు ఆఫీసుకు తీసుకెళ్ళే డైరీని, జేబులోంచి పెన్నుని తీసి అందించాడు.




ఆదిలక్ష్మి డైరీ తెరచి ఓ ఖాళీ పేజీలో ఈ విధంగా రాసింది.

000 ఇద్దరిదీ నిజమయిన ప్రేమ.
001 ఎక్కువ కాలం దూరం దూరంగా వుంటారు.
002 నీ గురించి ఆలోచించడు.
010 ఎప్పుడూ పోట్లాటలే.
011 బంధువుల తాకిడి ఎక్కువ.
012 ఆడపడుచులతో సదా బాధ.
020 ఆయనకి భార్య కన్నా ఫ్రండ్సే ముఖ్యం.
021 సిగరెట్ అలవాటుంటుంది.
022 విడాకులకి దారి తీస్తుంది.
100 మరుదులతో గొడవ.
101 ఆఫీసు నించి హోమ్ వర్క్ ఇంటికి తెచ్చుకుంటాడు.
102 అధిక సంతానం.
111 భార్యకి చీర కొనాలంటే మనసొప్పదు.
110 ప్రతీ రాత్రి సెక్స్.
112 పరాయి స్త్రీతో ఆయన గారికి సంబంధం వుంటుంది.
120 పొరపచ్చాలు లేని సంసారం.
121 అనుమానం మొగుడు.
220 వంట చేసే మొగుడు.
122 జాయింట్ ఫేమిలీ.
201 అత్తగారితో ఇబ్బంది.

# ఆశ వదులుకున్న మరదలు!

బావగార్లను ఆట పట్టించడం మరదళ్ళకు వో సరదా. కాకతాళీయంగా తప్పించుకున్నా మా అల్లుడు తెలివైన వాడని మురిసి పోయింది మా అత్తగారు. అసలేం జరిగిందంటేః అల్లుడొచ్చిన మొదటి పండగ గదాని ముప్పొద్దులా విందులూ, మధ్య మధ్యలో వుపాహారాలు. ఓ రోజున ఓ ప్లేటుడు బజ్జీలు పెట్టి తినమన్నారు. మధ్యాహ్నం చేసిన భోజనం కడుపులో ఇంకా అలాగే వుంది. పైగా నోరంతా పూసి తినడం కష్టంగా వుంది. అంచేత ఏదో తిన్నాననిపించడానికి రెండు బజ్జీలు తిని యిక వద్దన్నాను. నాపెద్ద మరదలు కనీసం యీ రెండు బజ్జీలు తినమంటూ రెండు ఎంచి తీసింది. నావల్ల కాదన్నా తిని తీరాలంది. వాటిని నెమ్మదిగా శ్రీమతికి యిచ్చి తినమన్నాను. మరదలు అక్కడ లేక పోవడం చూసి, ఆ రెండూ శ్రీమతీ, ఆఖరి రెండేళ్ళ చెల్లెలూ తిన్నారు. అంతే పచ్చి మిరపకాయ మాత్రం వుందేమో కారం నసాళానికి అంటుకుంది. శ్రీమతి కళ్ళమ్మట నీళ్ళు ధారాపాతం. వాళ్ళ చెల్లెలు ఆరునొక్క రాగం. అయితే సమయానికి ఇంట్లో గులాబ్‌జామ్ వుంది గాబట్టి, ఆ పాకం వాళ్ళని రక్షించింది. అయినా మరోసారి ప్రయత్నిద్దా మనుకుంది మరదలు. ఆ రాత్రి సినిమానించి వచ్చి భోజనానికి కూర్చుంటే, అత్తగారు మంచినీళ్ళు పెట్టమన్నారు. ఓ గ్లాసుతో తెచ్చి పెట్టి వెళ్ళిపోయింది. అలవాటు లేకపోయినా, యధాలాపంగా ఆ నీళ్ళ వైపు చూస్తే ఏదో తెట్టులా తేలినట్టుంది. అత్తగారికి చూపించేను. ఆవిడ 'అవి పారబోస్తూంటే, అడుగున బారెడు వుప్పు కన్పించింది. నేను సినిమాకు వెళ్ళగానే, వో గ్లాసుడు నీళ్ళలో బారెడు వుప్పు వేసింది. అయితే చేసిన పొరపాటు మట్టికలసిన వుప్పు కావడంవల్ల, అది తెట్టులా తేలింది. అలా నాకు తెలీకుండా రెండుసార్లు తప్పించుకున్నా, అత్తగారు వాళ్ళు ఆహా మా అల్లుడెంత తెలివైనవాడోనని మురిసి పోయారు. ఇంక లాభంలేదని మా మరదలూ ఏడిపించే ఆశ వదలుకుంది.




రామడుగుల వేంకట సోమయాజులు, తిరుచిరాపల్లి, (తమిళనాడు)

★ ★ ★



# కుంటికాలుతో పెళ్ళిపందిరికి!

మా పెళ్లి రోజు తమషా తలంచుకుంటే ఇంకా నవ్వు ఆగదు. 1985 మే 17 ముహూర్తం 2 గం. 10 ని.కు. నన్ను ఉదయం 10 గం.కు ముస్తాబు చేసినారు. నన్ను ఫుల్ బాండ్‌తో ఊరంతా ఊరేగించి పెళ్లి పందిట్లోకి తీసుకు వెళ్లటానికి సిద్ధం చేసారు. మా మావగారు నన్ను గుర్రం ఎక్కమన్నారు. నేను జంకుతూ గుర్రం ఎక్కాను. బ్యాండ్‌వాళ్ళు పెద్దశబ్దంతో డిస్కో డాన్సర్ చిత్రంలోని పాటను ప్రారంభించారు. ఆ శబ్దమునకు గుర్రం ఒక్క దూకు దూకింది. ఆ అదురుకు నేను తలక్రిందులుగా పడినాను. దానితో కాలు బెణికినది. కుంటి కాలుతో ఊరేగింపు విరమించి పెళ్లి పందిరికి చేర్చినారు. ఆ సంఘటన తల్చుకుంటే ఇప్పటికి నాకు భలే నవ్వు వస్తుంది.

దేవగురు గణేష్, సామర్లకోట

---

202 ప్రవాసాంధ్రలో కాపురం.

210 జీతం సరిపోదు.

211 భార్యంటే తగని అనురాగం.

212 ఘందు మాస్టర్.

200 హృదయాన్నే ఇచ్చేస్తాడు.

221 నెల నెల జీతం భార్య చేతిలో పోస్తాడు.

222 ఐడి ఫేమిలీ.

ఆమె రాస్తుండగా వాటిని చదివిన వినాయకరావు అడిగాడు.

"ఏవిటిదంతా?"

"సంఖ్యా శాస్త్రం ప్రకారం పెళ్ళయ్యాక భార్య భవిష్యత్‌ని సూచించే విధానం."

"ఎలా తెలుస్తుంది మనకేది అన్వయిస్తుందో?" అడిగాడు వినాయకరావు వుత్సాహంగా.

నేను నిలువుగా మూడు గీతలు రాస్తూ పోతాను. అంటే నూట పదకొండు అన్న మాట. మీరు ఏదో ఓ చోట 'స్టాప్' అనాలి. అప్పుడు నేను ఎన్ని గీతలలో ఆపానో అది రాసుకోవాలి. రెండోసారి మళ్ళీ నూట పదకొండు రాసుకుంటూ వెళ్తాను. మీరు స్టాప్ అనగానే ఆపేస్తాను. మళ్లీ ఎన్ని గీతలు గీసి ఆపానో ఆ నంబర్ రాసుకోవాలి. మూడో సారి కూడా ఇదే విధంగా చేసాక మీరు స్టాప్ అనగానే వచ్చిన మూడు సంఖ్యలు....."

"ఒక్క క్షణం, అర్థం కాలేదు చేసి చూపించు" అడిగాడు వినాయకరావు ఇంకా వుత్సాహంగా.

"చూడండి."

ఆదిలక్ష్మి నూట పదకొండు రాసుకుంటూ వెళ్ళసాగింది 111 111 111 111 1...

"స్టాప్" చెప్పాడు వినాయకరావు.

"చూసారా? నాలుగు సార్లు నూట పదకొండు రాసాక అయిదోసారి ఒకటే ఒక్కటి వేయగానే 'స్టాప్' అన్నారు."

ఒకటి ఓ పక్కన వేసి మళ్ళీ నూట పదకొండు రాయసాగింది.

111 111 111 11 ......



"స్టాప్" చెప్పాడు వినాయకరావు.

"ఈ సారి నూట పదకొండు తర్వాత కనీసం ఒక్క ఒకటన్నా రాయకుండానే స్టాప్ చెప్పారు. అంటే ఈ సారి సున్నా వచ్చింది" చెప్పింది ఆదిలక్ష్మి.

ఇందాకటి ఒకటి పక్కన సున్న చేర్చి చెప్పింది "ఇప్పటికి పదయింది, ఆఖరి సారి మళ్ళీ స్టాప్ చెప్పండి."

111 111 111 111 111 11 ....

"స్టాప్" చెప్పాడు వినాయకరావు.

"ఈ సారి రెండు ఒకట్లు రాసాక స్టాప్ అన్నారు కాబట్టి రెండన్న మాట."

ఆదిలక్ష్మి పది పక్కన రెండు వేసి నూట రెండు చేసింది.

ఇందాక రాసిన జాబితాలో ఒకటి సున్న రెండు ఎదురుగా వున్న వాక్యాన్ని చూసి బయటకి చదివింది.

"అధిక సంతానం."

వెంటనే సిగ్గు పడింది.

చిన్నగా నవ్వాడు వినాయకరావు.

"తమాషాగా వుందే ఈ సంఖ్యా శాస్త్రం ఆట" చెప్పాడు.

"కాలేజీలో లెక్చరర్ పాఠం బోర్ కొట్టినపుడల్లా ఇదే పని మాకు" చెప్పింది ఆదిలక్ష్మి.

"ఈ సారి నేను ఆడతాను. నువు స్టాప్ చెప్పు" చెప్పాడు వినాయకరావు.

"భర్త అన్న చోట 'భార్య'గా భావించుకుని ఆడాలి మొగాళ్ళయితే" చెప్పింది ఆదిలక్ష్మి.

పెన్ను, డైరీ అందుకుని చెప్పాడు.

"రెడీ."

"రెడీ" చెప్పింది ఆదిలక్ష్మి.

వినాయకరావు మూడు ఒకట్లు వేసుకుంటూ వెళ్ళాడు ఆదిలక్ష్మికి తను రాసేది కనపడకుండా జాగ్రత్త పడుతూ. మూడు సార్లు స్టాప్ చెప్పింది ఆమె. ఆ మూడిటి సంఖ్య 212.

212 ఎదురుగా మందు మాస్టర్ అని రాసి వుంది.

"నీవు మన పెళ్ళయ్యాక మందు కొడతావన్న మాట" నవ్వాడు.

ఆదిలక్ష్మి కూడా చిన్నగా నవ్వింది.

వినాయకరావు అటు, ఇటు చేసి తమకి కొద్ది దూరంలో కూర్చుని వున్న జంటని చూసి చెప్పాడు.

"స్టాప్ చెప్పు. ఈ సారి వచ్చే రిజల్ట్ వాళ్ళది."



అమలాపురం సమీపంలోని పేరూరులో కోనసీమ సైన్సు పరిషత్ 48వ మహాసభ ఇటీవల జరిగిన సందర్భంగా పరిషత్ అధ్యక్షుడు శ్రీ సి. వి. సర్వేశ్వర శర్మను అభినందించి మెమెంటోను ఇస్తున్న శాసనసభ ప్రతిపక్ష ఉపనాయకుడు కుడుపూడి ప్రభాకరరావు, పేరూరు గ్రామ సర్పంచ్ శ్రీ జిత్తెళ్ళ వెంకట శ్రీనివాస రామయ్య బొంబే హోమ్ కంఫర్ట్స్ అధినేత శ్రీ జంపన సుబ్రహ్మణ్య వర్మలను కూడా చిత్రంలో చూడవచ్చు.

వినాయకరావుకి మూడు సార్లు స్టాప్ చెప్పింది ఆదిలక్ష్మి.

110 వచ్చింది.

దానికి ఎదురుగా వున్న వాక్యం 'ప్రతీరాత్రి సెక్స్' ఈ సారి ఇద్దరూ గట్టిగా నవ్వుకున్నారు వాళ్ళ వంక చూసి.

వినాయకరావు ఆ తర్వాత తన తలితండ్రులు, షణ్ముగరావు మామయ్య, సుబ్బలక్ష్మి అని వుద్దేశించి ఆ ఆట ఆడాడు. అతని తలితండ్రులకి '111' – భార్యకి చీర కొనాలంటే మనసొప్పదు వచ్చింది. షణ్ముగరావు మామయ్యకి '022' విడాకులకి దారి తీస్తుంది వచ్చింది. సుబ్బలక్ష్మికి 000 ఇద్దరిదీ నిజమయిన ప్రేమ వచ్చింది.

"మీ నాన్న విషయంలో కరెక్టే" చెప్పాడు వినాయకరావు."

ఆ తర్వాత శాస్త్రి, ఆదిలక్ష్మి తలితండ్రులు, పూజారి శతభిషం, చిట్‌ఫండ్ కంపెనీలో పని చేసే ఆయన, బట్టల కొట్టాయనల జాతకాలు కూడా చూసారు. వాటిని తలచుకుని ఇద్దరూ నవ్వుకున్నారు.

రాత్రి ఏడున్నరకి చేతి గడియారం వంక చూసుకుని చెప్పింది ఆదిలక్ష్మి కంగారుగా.

"అయ్యో! ఏడున్నరయింది. వెళ్ళాలి. టైం తెలీనే లేదు మీతో ఈ ఆట ఆడుతుంటే."

వినాయకరావు కూడా ఆమెతో పాటు లేచాడు.

"త్వరగా వెళ్ళాలన్నావ్ కాబట్టి నా సైకిల్ మీద వెళదాం. సందు చివర దిగచ్చు నీవు."

"వద్దు. ఎవరయినా చూస్తే?"

"చూసే వాళ్ళు ఇక్కడే చూసి వుంటారు. ఫర్వాలేదు."

ఆదిలక్ష్మి సైకిల్ ముందు రాడ్ మీద కూర్చుంటే వినాయకరావు సైకిల్‌ని కొద్ది దూరం ముందుకు తోసుకెళ్ళి ఎక్కాడు. మనుషులు అడ్డు వచ్చినప్పుడల్లా ఆదిలక్ష్మి సైకిల్ బెల్‌ని కొట్ట సాగింది. చిన్నగా ఈల వేస్తూ గబగబ సైకిల్‌ని తొక్క సాగాడు వినాయకరావు.

వారిద్దరి మనసులు ఎంతో ఆనందంగా వున్నాయి. సందు చివర సైకిల్ ఆపి, ఆదిలక్ష్మి, దిగాక చెప్పాడు వినాయకరావు.

"థాంక్ యూ. చాలా సరదాగా గడిచిందీ సాయంత్రం.

"మళ్ళీ వీలున్నపుడు చెప్తాను. అక్కడే కలుద్దాం" చెప్పింది ఆదిలక్ష్మి.

★ ★ ★ ★

షణ్ముగరావు మంచి సంబంధం కోసం ప్రయత్నిస్తున్నాడు. ఆ రోజు వుదయం తమ జిల్లా హెడ్ క్వార్టర్స్, ట్రాక్టర్ స్పేర్ పార్ట్స్ కొనడానికి బయలుదేరినపుడు చెప్పింది ఆయన భార్య కామేశ్వరమ్మ.

"ఎలాగూ పట్నం వెళ్తున్నారు కదా. పనిలో పనిగా సుబ్బరాయశాస్త్రిని కలిసి అమ్మాయికి మంచి సంబంధాలున్నాయేమో అడిగి చూడండి."

"అలాగే" చెప్పాడాయన.

"నాన్నగారు పైలట్ వున్నాడేమో అడగండి" చెప్పింది సుబ్బలక్ష్మి.

"అలాగే తల్లీ. నీకి పైలట్ కావాలంటే పైలట్‌ని తెస్తాను. డాక్టర్ కావాలంటే డాక్టర్‌ని తెస్తాను" వాత్సల్యంగా చెప్పాడాయన.

చిన్నప్పటి నుంచీ అనుకున్న వినాయకరావు సంబంధం చెడిపోవడంవల్ల కూతురు మనసు గాయపడి వుంటుందన్న భావనతో ఆయన పెళ్ళికొడుకు విషయంలో ఎంత కష్టం అయినా సరే రాజీపడకూడదనుకున్నాడు.

ట్రాక్టర్‌కి కావలసిన సామాను కొన్నాక ఆయన సుబ్బారాయశాస్త్రి ఇంటికి వెళ్ళాడు. ప్రశ్నలయ్యాక తనుచ్చిన పని వివరించాడు.

"అదేమిటి? మీకు మేనరికంలాంటిదేదో వుండాలిగా?" అడిగాడాయన ఆశ్చర్యంగా.

"ఒకప్పుడు వుండేది. వాడు చేసుకోనని మొండికేసాడు."

"ఈ కాలం పిల్లలు ఇంతే. అమ్మాయికి ఎలాంటి మొగుడు కావాలని వుందిట?" అడిగాడాయన.

# ఎరువు విలువ

## బస్తా బరువులో కాదు, ధరలో కాదు

### దానిలోని

# పోషక పదార్థాల్లోనే వుంది

గోదావరి డి.ఎ.పిలో 46శాతం భాస్వరం, 18శాతం నత్రజని అవసరమైన పాళ్లలో ఉన్నాయి. మీ పైర్లకు కావలసిన పూర్తి పోషకాలను సరియైన సమయంలో అందిస్తుంది గోదావరి డి.ఎ.పి. అంతేకాదు, అందించే పోషకాల విలువను బట్టి చూస్తే, ఇతర కాంప్లెక్స్ ఎరువుల కన్నా గోదావరి డి.ఎ.పి ధర చాలా తక్కువ. గోదావరి డి.ఎ.పి పైర్లకు మేలైన, కాంప్లెక్స్ ఎరువులలో మేలైన, రైతులకు లాభదాయకమైన ఎరువు.

భాస్వర పరిమాణం వల్ల వేరుకు బలం, రైతుకు అధిక ఫలసాయం లభిస్తుంది. కాంప్లెక్స్ ఎరువులైన 20 : 20లో కన్నా 26 శాతం మరియు 28 : 28లో కన్నా 18 శాతం ఎక్కువ భాస్వరం గల గోదావరి డి.ఎ.పి. నిజంగా ఉత్తమమైన ఎరువు.

అత్యధిక పోషకాలు గల గోదావరి డి.ఎ.పి. మీరు ఖర్చుపెట్టే ప్రతి రూపాయకు ప్రతిరూపంగా ఎన్నో రెట్లు లాభాలు సమకూరుస్తుంది. అందుకే, ఎరువు విలువ బస్తా బరువులో కాదు, ధరలో కాదు, బస్తాలోని పోషక పరిమాణంలో, అధిక దిగుబడినిచ్చే గుణంలో ఉంది.

అందుకే ముందు చూపుగల రైతులు మొదటిగా ఎన్నుకునే ఎరువు గోదావరి డి.ఎ.పి.



**గోదావరి ఫెర్టిలైజర్స్ అండ్ కెమికల్స్ లిమిటెడ్**

**46% భాస్వరం**




**18% నత్రజని**









# గోదావరి డి.ఎ.పి.

Priyadarshini/GFCL/8871

"పైలట్ అవుతే బావుంటుందిట"

"విమానాల పైలట్లెవరూ ప్రస్తుతం లేరు. కాకపోతే ముఖ్యమంత్రి హెలికాప్టర్ నడిపే పైలట్ కొడుకొకతను వుండాలి."

"హెలికాప్టర్ పైలట్ కొడుకా? ఒద్దులెండి."

"శుభ్రంగా బాంక్‌లో నో, ఐ. సి.ఎల్. లో నో షని చేసే వాళ్ళని చూడండి. మన మధ్య తరగతి వాళ్ళకి పైలట్లు, కలెక్టర్లకన్నా వీళ్ళే మంచిది." చెప్పాడాయన.

"అలాంటి వాళ్ళెవరయినా ఉన్నారా?" అడిగాడు షణ్ముగరావు

"బో లెడు మంది..."

ఓ పుస్తకం తీసి అందులోని ఒక అడ్రస్ తీసిరాసిచ్చాడు సుబ్బరాయశాస్త్రి.

"అబ్బాయి హైదరాబాద్‌లో వుద్యోగంలో వున్నాడు. తలి దండ్రులు ఈ వూరే. ఇవాళ తిథి, నక్షత్రం బావున్నాయి. వర్జ్యంలేదు ఇప్పుడెళ్ళి మాట్లాడండి.

షణ్ముగరావు రిక్షాలో సరాసరి ఆ పెళ్ళికొడుకు తండ్రి ఇంటికి వెళ్ళాడు. తనని తాను పరిచయం చేసుకుని, తను వచ్చిన పని వివరించాడు.

"అలాగా? మేము మా అబ్బాయి పెళ్ళి త్వరగా చేయాలనే తొందరలో వున్నాము. హైదరాబాద్‌లో హోటల్ భోజనంతో అవస్థ పడుతున్నాడు" చెప్పాడాయన.

షణ్ముగరావు స్థితిగతుల గురించి, బంధు మిత్రుల గురించి అనేక ప్రశ్నలువేసి తృప్తిపడ్డాక చెప్పాడు ఆయన.

"పిల్ల బావుంటే చాలండి. కట్నం అక్కర్లేదు పిల్ల వంటిమీద ఓ పన్నెండు కాసులతో పంపితే చాలు."

"అబ్బాయి ఏం చేస్తున్నాడు?" అడిగాడు షణ్ముగరావు.

"ఎల్. ఐ. సి.లో"

"జీతం ఎంతొస్తుంది?"

"మూడువేల పైచిలుకు వస్తుంది. ఇద్దరు హాయిగా బ్రతకగలిగే సంపాదన అది"

"మా అమ్మాయి ఎత్తు అయిదడుగుల అయిదంగుళాలు"

"మా అబ్బాయి ఎత్తు అయిదు ఎనిమిదిన్నర. సరిపోతాయి" చెప్పాడు పెళ్ళికొడుకు తండ్రి.

"కాఫీ తాగాక అడిగాడు షణ్ముగరావు"

"మంచి రోజు చూసుకొని మీరు వచ్చి అమ్మాయిని ముందు చూసి వెళ్ళండి. మీకు నచ్చితే అబ్బాయిని పిలిపించచ్చు."

"అలాగే...."

కేలండర్ చూసి చెప్పాడాయన.

"ఎల్లుండి ఉదయం వస్తాం పదకొండు తర్వాత."




"అబ్బాయి ఫోటో వుంది కదండి. చూపించండి."

పెళ్ళికొడుకుతల్లి ఆయనతో చెప్పింది.

"అవును కదా మర్చేపోయాను"

ఆయన గోడమీద వేలాడుతున్న ఓ ఫోటో ఫ్రేమ్‌ని మేకు నించి తీసి, తుడిచి షణ్ముగరావుకిచ్చి చెప్పాడు.

"మగాళ్ళలో అందగాడు."

ఆ ఫోటో చూడగానే షణ్ముగరావు వులిక్కిపడ్డారు

"ఇతను శాస్త్రి కదూ?" అడిగాడు వెంటనే.

"అవును మీకు తెలుసా?" అడిగాడు శాస్త్రి తండ్రి.

"బాగా తెలుసు. ఇతను, నా మేనల్లుడు కలిసి ఒకే ఇల్లు అద్దెకు తీసుకున్నారు" చెప్పాడు షణ్ముగరావు.

"అయితే ఇకనేం. అబ్బాయిని చూసారన్నమాట."

"మాకీ సంబంధం వద్దు" కటువుగా చెప్పి లేచాడు షణ్ముగరావు.

"ఎందుకు?" తెల్లబోతూ అడిగాడాయన.

"ఎందుకేమిటి? మీ అబ్బాయి చేసిన ఘనకార్యం గురించి చెప్తా వినండి"

"ఏం చేసాడు!" కంగారుగా అడిగింది శాస్త్రి తల్లి.

"వినాయకరావుకి సుబ్బలక్ష్మిని పెళ్ళి చేసుకోకుండా ఇచ్చిన సలహాలు ప్రహసనం వివరించాడు షణ్ముగరావు.

శాస్త్రి తల్లి, తండ్రి ముసి ముసిగా నవ్వుతూ చెప్పారు ఒకరి మొహాలు మరొకరు చూసుకుని.

"ఎలాగయినా వాడు గట్టివాడు."

"అంతటి గట్టివాణ్ని నా కూతురు భరించలేదు.

బయటకి వచ్చేడాయన. మరోసారి వినాయకరావు మీద కోపం రేగింది. దారిలో అంతా ఆయన వినాయకరావుని మనసులో తిట్టుకుంటూనే వున్నాడు.

★ ★ ★ ★ ★ ★ ★

ఆ సాయంత్రం డాంబికేశ్వరరావుకి టిఫిన్ ప్లేట్‌ని అందించి చెప్పింది చాముండేశ్వరి.

"నేను పెసరట్లు, వూతప్పం రెండూ బాగా చేస్తా కదండి?"

ఆయన ఆ ప్రశ్నకి సమాధానం చెప్పకుండా ప్లేట్‌లోని పదార్థాన్ని తుంచి కొద్దిగా నోట్లో వేసుకుని రుచి చూసి అడిగాడు.

"ఇంతకీ ఆ రెండిట్లో ఏది ఇది?"

"మీరు మరీ చోద్యంగా మాట్లాడతారు. ఆ మాత్రం తెలీదటండీ?"

"తెలిసిన నీవు చెప్పొచ్చుకదటండీ?"

"పెళ్ళయినప్పటినించీ మీకు నన్ను వుడికించడం వేడుక. అది సరేగాని మనవాడికి ఒ వుత్తరం రాయండి" చెప్పింది చాముండేశ్వరి.

"ఏమని?' అడిగాడాయన.

"పెళ్ళెప్పుడని? పెళ్ళి వయసు దాటాకా పెళ్ళి చేసుకునేది? వాడి పెళ్ళి చూడాలని నాకెంతో ఆశగా వుంది."

"నాకూ వుంది"

"అయితే అదేదో సినిమాలో లాగా, ఫలానా తేదీలోగా నీవు ఆ అమ్మాయి తలి దండ్రులచేత వప్పించి ప్రధానానికి మమ్మల్ని పిలిచావా సరి. లేదా మేం చెప్పిన పిల్లని చేసుకో అని రాయండి."

"మరీ అంత కటువుగా రాస్తే బావుండదు కాని వాడి ప్రయత్నం ఎంతదాకా వచ్చిందో చెప్పమని రాస్తాను"

"ఏదో ఒకటి ముందర వుత్తరం ముక్కంటూ ఒకటి రాసి పడేయండి"

"అలాగే ఇంతకీ ఇది పెసరట్టా లేక వూతప్పమా? చెప్పనేలేదు" అడిగాడు డాంబికేశ్వరరావు.

"మీది మరీ చోద్యం. రవ్వదోశండి" చెప్పింది చాముండేశ్వరి.

★ ★ ★ ★ ★ ★ ★

"రేపేకదండి కామేశ్వరరావు వచ్చేది?" అడిగింది కనకమహాలక్ష్మి తన భర్తకి అన్నం వడ్డించి.

"అవును"

"అమ్మాయితో పెళ్ళి గురించి గట్టిగా మాట్లాడకండి. చెట్టులా ఎదిగింది. ఇంకెంత కాలం ఇంట్లో వుంచుకుంటాం"

"అలాగే. నేనూ అదే అనుకున్నాను"

"దాన్ని అడిగాను. కామేశాన్ని చేసుకోడానికి దానికెలాంటి అభ్యంతరం లేదుట"

"ఎందు కడిగావు? దానికభ్యంతరం ఏమిటి నా బొంద?" విసుకున్నాడాయన.

ఆయనకి కాస్త కూర వడ్డించి అడిగింది

"అమ్మాయిని టి. వి.లో పాటపాడమని అడుగుతున్నారట. మిమ్మల్ని అడిగి చెప్తానందిట."

"ఎవరా అడిగింది? అందరి తాటవలుస్తాను అన్నానని చెప్పు. ఇంటిపట్టున వుండాలి పెళ్ళి కావలసిన పిల్ల. టి. వి.లు, రేడియోలంటే చర్మం వలుస్తానన్నానని చెప్పు."

"అలాగేలెండి" చెప్పింది కనకమహాలక్ష్మి.

మర్నాడు వుదయం వచ్చాడు కామేశ్వరరావు. కనకమహాలక్ష్మి పిండిమరకి వెళ్తున్నానన్న వంకతో ఇద్దరికీ ఏకాంతం కల్పించి బయటకి వెళ్ళిపోయింది.

"షూటింగ్ అయిందా బావా?" అడిగింది ఆదిలక్ష్మి.

"ఆహా సినిమా బాగా వచ్చింది. షూట్ చేస్తున్నప్పుడే తెలిసిపోతుంది ఒకోసారి ఇది వందరోజుల సినిమా అవుతుంది."

ఇద్దరి మధ్యా కాసేపు మౌనం.

"నాన్నగారు మన పెళ్ళికి నిశ్చితార్థం చేసుకునే మద్రాస్ వెళ్తా నన్నారు" చెప్పాడు అతను.

"నాకీ పెళ్ళి ఇష్టంలేదు బావా" చెప్పింది ఆదిలక్ష్మి నెమ్మదిగా."

"వేరే వుద్యోగం కోసం ప్రయత్నం చేస్తున్నానని చెప్పాగా."

"ఉద్యోగం అని కాదు. ఆనాడది కేవలం ఒంకగా చెప్పానంతే. నాకు ఈ పెళ్ళి ఇష్టంలేదు."

"ఎందుకని?"

"నేనిదివరకే ఇంకొకరికి నా మనసిచ్చేసాను."

"కాని నేను నా మనసు నీకిచ్చేసాను" చెప్పాడు కామేశ్వరరావు.

"నాకెప్పుడిచ్చావు?" అడిగింది ఆదిలక్ష్మి.

"ఇవ్వడం అంటే చేతికివ్వడం కాదు" చెప్పాడు కామేశ్వరరావు విసుగ్గా.

"మన పెళ్ళయినా నువ్వు సుఖపడలేవు బావా. నాకీ పెళ్ళి ఇష్టంలేదని నీవే మా నాన్నతో చెప్పు. నేనే వద్దన్నా వినడు.

"ఊహు ఐలవ్‌యూ కనక."

చిన్నగా నిట్టూర్చింది ఆదిలక్ష్మి. ఆమెకి తెలుసు కామేశ్వరరావు సరిగ్గా అలాగే అంటాడని.

"నేను మనసిచ్చిన వ్యక్తితో వివాహం కాకపోతే నా జీవితమే వృధా నావల్ల నీవు సుఖపడలేవు" చెప్పింది.

"రెండు మూడేళ్ళు కాపరం చేస్తే ఈ ప్రేమ మనసు ఇవ్వడాలన్నీ పోతాయి. కూతురో, కొడుకో పుట్టాక, సంసారంలో పడ్డాక ప్రేమలు ఎంతో చిన్నవిగా, వేస్ట్‌గా కనిపిస్తాయి. ఇది నేను నమ్మే థియరీ, ప్రాక్టీస్.

ఆదిలక్ష్మి కోపంగా బయటికి వెళ్ళిపోయింది.

కనకమహాలక్ష్మి పిండి మర నించి వచ్చాక రహస్యంగా అడిగింది కూతుర్ని.

"చెప్పావా?"

"ఆహ"

"ఏమన్నాడు?"

"మొండి. మనం అనుకున్నట్లే అన్నాడు".

"సరే అయితే".

ఆవిడ చపాతీలు చేస్తుంటే పక్కనే కూర్చున్నాడు కామేశ్వరరావు.

చపాతీల పిండి వత్తిస్తూ ఆదిలక్ష్మి అడిగింది.

"నా ఫ్రెండ్ కమల నీకు గుర్తుందామ్మా?"

"ఆ రెండు జెళ్ళమ్మాయే?"

"అవును."

"పెళ్ళయిందిగా?"

"రెండు నెలలయింది పెళ్ళయి. నిన్న రాత్రి కాల్చుకు చచ్చిపోయిందిట"

"అయ్యో! ఏమొచ్చిందే?"

"భార్యాభర్తల మధ్య ఏం గొడవలున్నాయో ఎవరికీ తెలుసు. హాస్పిటల్‌కి తీసుకెళ్తుండగా స్పృహలేదట. దారిలో నే పోయిందిట".

"బంగారపు బొమ్మ. అయ్యో! ఎంత పిచ్చి పని చేసింది".

"భర్తని పోలీసులు ఇందాక అరెస్ట్ చేసారట".

"దేనికి?"

"చట్టం ఇదివరకటిలా లేదమ్మా. భార్య ఆత్మహత్య చేసుకుని మరణిస్తే ముందుగా భర్తని, అత్తమామల్ని అరెస్ట్ చేస్తారు. దాంతో వుద్యోగంలోంచి సస్పెండ్ అవుతాడు. భార్యాభర్తల మధ్య పొరపొచ్చాలున్నాయని వాళ్ళ




ఎంక్వయిరీలో తేలితే చాలు. ఏడేళ్ళు జైలు శిక్ష వేస్తారు.

"అవునట". చెప్పింది కనకమహాలక్ష్మి.

కామేశ్వరరావు వాళ్ళ సంభాషణని ఆసక్తిగా వింటున్నాడు.

"భార్యా భర్తలన్నాక పొరపొచ్చాలు, పోట్లాటలు, అలిగి పుట్టింటికి వెళ్ళటాలు తప్పవుగా. మంచి చెప్పదీ లోకం. అలాంటప్పుడు పోలీసులకి భర్త సాధించేవాడని, కొట్టేవాడని, తిట్టేవాడని చెప్తారు ఇరుగు పొరుగు". చెప్పింది కనకమహాలక్ష్మి.

"మరణించిన ఆడదాని మీదే అందరికీ సానుభూతి వుంది. భర్త ఓ రాక్షసుడుగా భావిస్తారు. అతనికి జైలు శిక్ష తప్పదు. భార్య ఆత్మహత్య చేసుకుందని తెలియగానే భర్తని పట్టుకెళ్తారు పోలీసులు" చెప్పింది ఆదిలక్ష్మి.

"ఇప్పుడు కమల మొగుడుకి శిక్ష తప్పదంటావా?"

"తప్పదు" నీ కూతురు అలా మరణించిందనుకో. నీవు పోలీసులకి 'అల్లుడు మంచివాడు కాదు- కాబట్టే పోయింది' అని చెప్పవూ?"

"ఎందుకు చెప్పనే? కడుపు శోకంతో. అల్లుడు నా కూతుర్ని పొట్టన పెట్టుకున్నాడని చెప్పి తీరతాను. మీ నాన్నగారయితే కలెక్టర్‌కి పిటిషన్ కూడా పెడతారు". చెప్పింది కనకమహాలక్ష్మి.

"కమల నాన్నగారు కూడా కలెక్టర్‌కి పిటిషన్ పెట్టాడట అల్లుడు వల్లే తన

## విజ్ఞానం –వినోదం

బాచ్ బ్రౌన్



### సమస్య

మేకు దిగటం అసాధ్యం.

### అవసరం

ఒక మేకు, ఒక సుత్తి, ఒక స్పాంజి లేదా మడత పెట్టిన తువ్వాలు.

### ఈ విధంగా చేయండి

మెత్తటి వస్తువుపై బల్లను ఉంచి మేకును బల్లలోకి కొట్టడానికి ప్రయత్నించండి. మేకు దిగటం అసాధ్యమని మీరు కనుగొంటారు.

### ఇక్కడ ఇలా ఎందుకని?

మేకును సుత్తితో కొట్టగానే క్రింద మెత్తటి వస్తువు ఉన్న మూలంగా మేకుతో పాటు బల్ల కదులుతుంది. సుత్తి యొక్క శక్తి బల్లను కదల్చడానికే ఎక్కువ వినియోగింపబడుతుంది. అదే ఇంచుమించు సుత్తి శక్తి అంతా కూడా మేకును దించడానికే వినియోగింపబడుతుంది.

## వినాయకరావు పెళ్ళి

కూతురు మరణించిందని, తగిన న్యాయం జరిపించమని".

"ఇదన్యాయం. భార్య ఆత్మహత్య చేసుకుంటే అందుకు బాధ్యుడు భర్తంటే నేను వప్పుకోను" చెప్పాడు కామేశ్వరరావు.

"నేను చట్టాన్ని వప్పుకోను అనటం కూడా నేరమే" ఊరుకో నాయనా. గట్టిగా అనక" చెప్పింది కనకమహాలక్ష్మి.

అతనికి వేడి వేడి చపాతీలు, బంగాళాదుంపల కూర వడ్డించింది.

ఆ విషయం అంతటితో ఆగిపోయింది. కామేశ్వరరావుకి మధ్యాహ్నం పడుక్కోవడం అలవాటు. మంచం వేసుకుని పడుకున్నాడు ఆ గదిలో మరో మూల చాప పరచుకొని పడుకున్నారు తల్లీ కూతుళ్ళిద్దరూ.

కామేశ్వరరావుకి నిద్రపడుతుండగా తల్లీ కూతుళ్ళ సంభాషణ వినిపించడంతో నిద్ర తేలిపోయింది.

"పాపం. కమల మొగుణ్ణి వురితీసే బావుణ్ను" చెప్పింది కనకమహాలక్ష్మి.

"రేపు నా మొగుణ్ణి వురితీస్తారు" చెప్పింది ఆదిలక్ష్మి".

"అదేం మాటే శుక్రవారం పూట" నొచ్చుకుంది కనకమహాలక్ష్మి.

'అవునమ్మా. నిశ్చయంగా అదే జరిగి తీరుతుంది".

"ష్. కామేశం వింటాడు".

"లేదులే. నిద్రపోతున్నాడు".

"రేపు పెళ్ళయ్యాక నీవూ కాల్చుకు ఛస్తావన్న మాట" నిష్ఠూరంగా అడిగింది కనకమహాలక్ష్మి.

"శుభ్రంగా కిరసనాయిలుతో బాత్‌రూమ్‌లో స్నానం చేసి అగ్గిపుల్ల గీసి వంటికి నిప్పంటించుకుంటాను".

"ఏం అఘాయిత్యం మాటలే తల్లీ అవి".

కామేశ్వరరావుకి బాగా ఆశ్చర్యం, కొంచెం భయం కలిగాయి ఆ మాటలకి.

"ఇదంతా నువ్వతన్ని ప్రేమిస్తున్నందుకేగా?" అడిగింది కనకమహాలక్ష్మి.

"అవునమ్మా. అవుతే నా వివాహం అతనితో నే అవాలి. కామేశంతో అయితే నే చేయదలచుకున్న పని అది. నాకసలు ఇపుడే బ్రతకాలనిలేదు. నాన్నగారికి కన్యాదాన ఫలం దక్కాలని ఆగాను.... నా చావుకి కారణం నా భర్తే అని రాసి, పోలీసులకి పోస్ట్ చేసి ఆ తర్వాత కాల్చుకు చస్తాను".

"అమ్మ నా తల్లో, అలాంటి ఆలోచనలు మానవే".

"మానను గాక మానను. నన్ను, నా ప్రియుణ్ణి ఈ పెళ్ళి ద్వారా దూరం చేసి నన్ను క్షోభకి గురి చేసిన కామేశం బావకి శిక్షపడాల్సిందే".

"కామేశం ఏడేళ్ళు జైల్లో ఎలా వుండగలడే నాకు తెలీకడుగుతాను. డ్రింకి కాఫీ- టిఫిన్స్, భోజనం లేకపోతే వుండలేడు. రోజుకో పది సిగరెట్లు లేకపోతే వుండలేడు. ఇవన్నీ జైల్లో దొరకవు కదే అతడికి".

"అవన్నీ నాకు తెలీవు. నా పెళ్ళయిన మూడోనాడు "కట్నం తెమ్మని బాధిస్తున్నాడని పోలీసులకి వుత్తరం రాసి చచ్చిపోతాను. కిరసనాయిలయిపోయింది బావా అంటే డబ్బాడు తెస్తాడు. ఆ తర్వాత పోలీసులు పట్టుకుపోతారు బావని".

కామేశ్వరరావుకి ఆశ్చర్యం తగ్గి, భయం అధికమయింది.

"నీకసలు బొత్తిగా చావు భయమే పెట్టలేదు దేముడు. పరీక్షల్లో తప్పావని రెండేళ్ళ క్రితం వురేసుకోబోయావు. సమయానికి తలుపులు పగలగొట్టి కొనవూపిరితో వున్న నిన్ను రక్షించుకోగలిగాం".

"అది పేపర్‌లో అచ్చు తప్పయిపోయింది కాబట్టి వూరుకున్నాను. కాని లేకపోతే మర్నాడు హుస్సేనుసాగర్‌లోకి దూకేదాన్ని".

"నీకు చిన్నప్పటి నుంచి పట్టుదల ఎక్కువే".

"జీవితంలో ఓటమి కంటే అసలు జీవితం లేకపోవడమే నాకు తృప్తిగా వుంటుందమ్మా: నేను అతన్ని చేసుకోలేకపోతే, ఎవర్ని చేసుకుంటే వాళ్ళని జైలుకి పంపి తీరుతాను. చచ్చి సాధిస్తాను. ఆ తర్వాత నీవు, నాన్న నా గురించి ఒకేదుపు ఏడ్చి వూరుకోండి. వాడు జైల్లో ఏడేళ్ళు ఏడు వూచలు లెక్కపెడుతూ ఏడుస్తాడు".

"పోనీ నేను కామేశంతో మాట్లాడనా ఈ విషయాలన్నీ".

"వద్దు. నేను చెప్పాను నాకీ పెళ్ళి ఇష్టం లేదని. అయినా వినలేదు. ముందే చస్తానని చెప్తే అది బెదిరింపు అనుకుంటాడు కాని నిజంగా చస్తాననుకోడు ఏ మగాడు. ఒకేసారి చేసి చూపిస్తే చాలు".

"చూస్తున్నాగా. నీకు చిన్నప్పటి నుంచీ ధైర్యం ఎక్కువ. ఓ పట్టాన నీ మనస్సులోని మాటని బయటకు చెప్పవు. చెప్పావా అది అయ్యేదాకా నిద్రపోవు" చెప్పింది కనకమహాలక్ష్మి.

"కన్నతల్లివి కాబట్టి నీకొక్కదానికే చెప్తున్నాను".

"నా మాట విని పిచ్చి పిచ్చి ఆలోచనలు మాను".

"నా మెళ్ళో కామేశం బావ కట్టేది మంగళసూత్రం కాదు. తనంతట తానుగా అతను తన మెడకి వేసుకునే ఉరితాడవుతుంది అది. ఆ తర్వాత కలెక్టర్‌కి పిటిషన్ పెట్టమని నాన్నగారికి చెప్పి"

"....."

"ఏం? సరేనా?"

"....."

"అమ్మా. ఈ జీవితంలో ఇది నేను నిన్ను కోరే ఆఖరి కోరిక. సరే అనమ్మా".

"సరేనే"

"ఏది? చేతిలో చెయ్యి వెయ్యి. కామేశం. బావ మీద కలెక్టర్‌కి పిటిషన్ నాన్నగారి చేత పెటిస్తానని"

కామేశం కనురెప్పలని కొద్దిగా తెరచి చూసాడు. కనకమహాలక్ష్మి తన చేతిని కూతురి చేతిలో వేయడం.

"సరేనే" చెప్పింది.

"ఇంక పడుకోమ్మా. నాకు నిద్రొస్తోంది" చెప్పింది ఆదిలక్ష్మి. ఆ మధ్యాహ్నం కామేశానికి నిద్రపట్టలేదు. బదులుగా గుండె దడ పట్టుకుంది.

(ఇంకా వుంది)




# నాగార్జున ఫైనాన్స్ లిమిటెడ్

నాగార్జునహిల్స్, పంజగుట్ట, హైదరాబాద్-500482 ఫోన్: 227145/ 37389/224445

## డిపాజిట్ల స్వీకరణ/పునరుద్ధరణ

### స్కీము 111 కుమ్యులేటివ్ డిపాజిట్ల పథకం

| కాలవ్యవధి | కనీస డిపాజిట్లు | మెట్యూరిటీ సమయం నందు చెల్లింపబడు మొత్తము | వార్షిక ఆదాయము★ |
|---|---|---|---|
| 6 నెలలు | రూ. 25,000 | రూ. 26,735 | 14 % |
| 1 సంవత్సరం | రూ. 2,000 | రూ. 2,300 | 15 % |
| 2 సంవత్సరాలు | రూ. 2,000 | రూ. 2,640 | 16 % |
| 3 సంవత్సరాలు | రూ. 2,000 | రూ. 3,036 | 17.26% |

● అదనపు సొమ్ము రూ. 1000/- గుణిజాలలో ఉండాలి. వడ్డీ ప్రతి నెలా కలువబడుతుంది.

★ రీ – ఇన్వెస్ట్‌మెంట్ మీద. సంవత్సరానికి 14% వడ్డీ ఉద్దేశించ బడినది.

● ఇదేకాక ఇంకా నెలసరి ఆదాయ పథకం, మరియు త్రైమాసిక ఆదాయ పథకం కూడా కలవు.

**అన్ని స్కీములకు వర్తించు అంశాలు** ★ కంప్యూటరైజ్డ్ ఎంబిసిఆర్ వడ్డీ వారెంట్లు, ఇండియాలో 7,000 పైగా ఉన్న స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా యొక్క అన్ని శాఖలలో ఒకే సారి చెల్లించబడతాయి. ★ ఏ ఆర్థిక సంవత్సరంలోనైనా రూ 2,500/– దాటని వడ్డీ మీద పన్ను లేదు. ★ డిపాజిటరు ఫారం 15 హెచ్/15 ఎ నందు డిక్లరేషను దాఖలు చేసినట్లయితే ఏ ఆర్థిక సంవత్సరంలోనైనా రూ. 2,500/-- దాటిని వడ్డీ మీద కూడా పన్ను ఉండదు. ★ అన్ని స్కీముల విషయంలో కూడా మెట్యూరిటీ సమయమునందు డిమాండ్ డ్రాఫ్టుల ద్వారా సకాలంలో ఖచ్చితమైన చెల్లింపులు జరుపబడతాయి

నాన్ బ్యాంకింగ్ ఫైనాన్షియల్ కంపెనీలు మరియు మిస్లేనియస్ నాన్ – బ్యాంకింగ్ కంపెనీల (ప్రకటనలు) సవరించబడిన 1977 నిబంధనల ప్రకారం వివరాలు

ఎ కంపెనీ పేరు — నాగార్జున ఫైనాన్స్ లిమిటెడ్

బి ఏర్పాటు చేసిన తేది — 24-3-1982

సి కంపెనీ ద్వారా నిర్వహించిన వ్యాపారం మరియు శాఖల యొక్క వివరాలతో పాటు దీని యొక్క సబ్సిడరీలు — హైర్ పర్చేజ్ ఫైనాన్సింగ్, ఎక్విప్‌మెంట్ లీజికిచ్చుట, పెట్టుబడులు మరియు పారిశ్రామిక ఆర్థిక సహాయం ఈ కంపెనీ ఎటువంటి సబ్సిడరీలు కలిగి లేదు ఈ కంపెనీ యొక్క శాఖలు/కార్యాలయాలు, బొంబాయి, మద్రాసు, మదురై, తిరుచ్చి, వైజాగ్, విజయవాడ మరియు కోయంబత్తూరుల్లో ఉన్నవి

డి కంపెనీ నిర్వహణ యొక్క సంక్షిప్త వివరాలు — అర్హత మరియు అనుభవం కలిగిన ప్రొఫెషనల్స్ యొక్క టీమ్ చేత సపోర్టు చేయబడిన డైరెక్టర్ల బోర్డుచే ఈ కంపెనీ నిర్వహించబడుచున్నది

ఇ **డైరెక్టర్ల పేర్లు, చిరునామాలు, మరియు వృత్తులు :**

| పేరు | చిరునామ | వృత్తి |
|---|---|---|
| శ్రీ ఆర్. కె. తల్వార్ చైర్మన్ | తిరువినయ్, 2వ అంతస్థు, 13, పెరుమాళ్ కోవిల్ స్ట్రీట్ పాండిచ్చేరి – 605 001 | బ్యాంకర్ |
| శ్రీ మినూ ఆర్ ష్రాఫ్ | జె కె బిల్డింగ్, ఎన్ ముఖర్జీ మార్గ్ బల్లార్డ్ ఎస్టేట్, బొంబాయి – 400 038 | ఫైనాన్షియల్ కన్సల్టెంట్ |
| శ్రీ నిమేష్ ఎన్ కంపాని | 51, పెర్సిపోలిస్ అపార్ట్‌మెంట్స్ 100 కుఫే పరేడ్ కొలబా, బొంబాయి – 400 005 | ఫైనాన్షియల్ కన్సల్టెంట్ |
| శ్రీ కె. ఎస్ రాజు | నెం. 6, నాగార్జున హిల్స్, హైదరాబాద్ – 500 482 | ఇండస్ట్రియలిస్ట్ |

ఎఫ్ లాభాలు మరియు లాభాంశాలు (డివిడెండ్లు)

| గడువు | పన్నుకు పూర్వం లాభం (రూ లక్షలలో) | పన్ను తర్వాత లాభం (రూ లక్షలలో) | ఈక్విటీ డివిడెండ్ సొమ్ము (రూ. లక్షలలో) | రేటు |
|---|---|---|---|---|
| 30-9-87 | 159 42 | 134 27 | 56.06 | 23 % |
| 30-9-86 | 143 07 | 133 72 | 56 06 | 23 % |
| 30 9-85 | 109.55 | 109 55 | 30.00 | 20 % |

జి. **ఆడిట్ చేయబడిన గత రెండు బ్యాలెన్స్ షీట్ల ప్రకారం సంగ్రహపరచబడిన కంపెనీ ఆర్థిక స్థితి**

| అప్పులు | 30-9-87 నాటికి (రూ. లక్షలలో) | 30-9-86 నాటికి (రూ. లక్షలలో) |
|---|---|---|
| వాటా మూలధనము | 241.80 | 241 07 |
| రిజర్వులు మరియు మిగులు | 269.88 | 191 67 |
| సెక్యూర్డ్ లోన్లు | 2322.71 | 1508 93 |
| అన్ సెక్యూర్డ్ లోన్లు | 956 27 | 815 12 |
| సప్లయర్స్ నుండి క్రెడిట్ చేయబడిన డిఫర్డ్ పేమెంట్ | 40.84 | —— |
| ప్రస్తుత అప్పులు మరియు ప్రొవిజన్లు | 1820.97 | 1543 69 |
| మొత్తం | 5652.47 | 4300 48 |

| ఆస్తులు | 30-9-87 నాటికి (రూ. లక్షలలో) | 30-9-86 నాటికి (రూ. లక్షలలో) |
|---|---|---|
| స్థిరాస్తులు | 824.65 | 598 94 |
| పెట్టుబడులు | 37.75 | 37.50 |
| ప్రస్తుత ఆస్తులు ఋణాలు మరియు బయానాలు (అడ్వాన్సులు) | 4731.70 | 3593.84 |
| మిస్లేనియస్ ఎక్స్‌పెండీచర్ | 58.37 | 70 20 |
| మొత్తం | 5652.47 | 4300 48 |

| తాత్కాలిక (కంటిజెంట్ అప్పులు) | 30-9-87 నాటికి (రూ లక్షలలో) | 30 9-86 నాటికి (రూ లక్షలలో) |
|---|---|---|
| ఎ) బ్యాంకు గ్యారంటీలు సంబంధించి కౌంటరు గ్యారంటీలు | 48 25 | 1 49 |
| బి) డిస్కౌంట్ చేయబడిన బిల్లులు | 219.40 | 450 43 |
| సి) నిర్వహించ వలసిన కాంట్రాక్టుల అంచనా చేయబడిన సొమ్ము | లేదు | 5.42 |

హెచ్ సవరించబడిన మిగిలిన నాన్ బ్యాంకింగ్ ఫైనాన్షియల్ కంపెనీల (రిజర్వు బ్యాంక్ సూచనలు) 1977 నిబంధనల క్రింద డిపాజిట్ల ద్వారా కంపెనీ పెంచగల మొత్తం రూ 4 533 లక్షలు,30-9-1987 నాటికి నిర్వహించబడిన మొత్తం డిపాజిట్లు రూ 862 44 లక్షలు

ఐ. ఈ ప్రకటన తేదీ నాటికి, అన్‌క్లెయిమ్డ్ డిపాజిట్లు మినహా కంపెనీ ఎటువంటి ఓవర్‌డ్యూ డిపాజిట్లను కలిగిలేదు.

జె. కంపెనీ ఇందుమూలంగా ప్రకటించుచున్నది (డిక్లరేషన్).

ఎ) సూచనల ప్రకారం వర్తించునటువంటి అన్నినిబంధనలను ఈ కంపెనీ పాటిస్తుంది

బి) సూచనల ప్రకారం నిబంధనలను పాటించినంత మాత్రాన డిపాజిట్లు తిరిగి చెల్లింపునకు రిజర్వు బ్యాంకు ఎటువంటి గ్యారంటీ ఇవ్వదు

సి) ఈ కంపెనీల చేత అంగీకరించబడిన డిపాజిట్లు అన్ సెక్యూర్డ్ డిపాజిట్లు మరియు ఇతర అన్ సెక్యూర్డ్ లయబిలిటీస్‌తో సమానమవుతాయి.

ఈ ప్రకటన కంపెనీ డైరెక్టర్ల బోర్డు యొక్క అధికారంతో మరియు వారి పేరున జారీ చేయబడుచున్నది 30-11-87 నాడు నిర్వహించబడిన సమావేశమునందు, ఈ ప్రకటన ఆమోదించబడి రిజర్వుబ్యాంకు ఆఫ్ ఇండియా, బెంగుళూర్‌లో ఫైలు చేయబడినది

బోర్డు వారి ఆజ్ఞానుసారము
నాగార్జున ఫైనాన్స్ లిమిటెడ్ తరఫున
ఎస్. ఎ. కృష్ణన్
ప్రెసిడెంట్

స్థలము . బొంబాయి
తేదీ : 30-11-1987.

వివరాలకు ఈ దిగువ కూపన్ మాకు పంపండి.

పేరు : ......................................................
చిరునామా : ......................................................
......................................................
వృత్తి : ......................................................

**కొత్త పద్ధతుల్లో పెరుగుదల**

**విజయవాడ, ప్లాట్ నెం. 6, రైల్వే ఆఫీసర్స్ కాలనీ, వెంకటేశ్వరపురం. ఫోన్: 65440 విశాఖపట్నం : 48-8-11, ద్వారకనగర్, ఫోన్ : 61994.**

Imageads/88

# నైజం

## పిన్నకోట సుశీలాదేవి

ఉదయం ఏడు గంటల సమయం!

కాఫీ త్రాగి- పేపరు చదువుకుంటున్నాను!

"అయ్యగారూ", అన్న పిలుపు విని- తలెత్తి చూశాను!

ఎదురుగా సింహాచలం!

చేతులు నులుముకుంటూ దీనంగా నా వేపు చూస్తున్నాడు! అతన్నా స్థితిలో చూడగానే- అతడు నా దగ్గరకెందుకు వచ్చాడో అర్థమైపోయింది. అయినా- ఏం తెలీనట్లు-

"ఏమిటి సింహాచలం...." అనడిగాను!

అతడు మరింత దిగులుగా ముఖం పెట్టాడు!

"మా అమ్మాయి ఒంట్లో బాగా లేదయ్యా! హాస్పిటల్‌కి తీసుకెళ్ళాలి. చేతిలో పైసా లేదు. మీరొక పాతిక సర్దితే జీతాలు రాగానే ఇచ్చేస్తాను". అన్నాడు!

మరొకప్పుడైతే ఆ మాటలకు కరిగిపోయి నా జేబులో వున్నదంతా అతని చేతిలో పెట్టేవాడిని!. కానీ ఈ రోజు నా మనస్సుని కఠినంగా చేసుకున్నాను.

సింహాచలం మా ఆఫీసులో ప్యూను. త్రాగనిదే వుండలేడు.

ఆ త్రాగుడు కోసం అందరి దగ్గరా అప్పులు చేస్తుంటాడు! అందులో ఏ కొద్ది మొత్తమో తిరిగి ఇస్తాడు. అతడికి ఇంకెప్పుడూ అప్పు ఇవ్వకూడదని అనుకున్న వాళ్ళు కూడా అతని మాటలకు కరిగిపోయి అప్పులిచ్చేస్తారు!

అందరి దగ్గరకూ వెళ్ళి- దీనంగా- "బాబూ! నా భార్యకు ప్రాణం మీదికి వచ్చిందనో... నా కొడుకు స్పృహ లేకుండా పడుకున్నాడనో" అబద్ధం చెప్తాడు!

వినేవాళ్ళు- నిజంగా అతడు ఇబ్బందుల్లో వున్నాడేమో అనుకుంటారు! వెంటనే అతనికి తమ దగ్గర వున్నదంతా ఇచ్చేస్తారు! అతడా డబ్బుని తీసుకెళ్ళి సారా కొట్టుకు సమర్పిస్తాడు!

ఆ తర్వాత- ఆ విషయం తెలుసుకుని, అతనికి అప్పిచ్చిన వాళ్ళు ఎంతో బాధపడేవాళ్ళు! మోసపోయామని విచారించేవాళ్ళు! ఇంకెప్పుడూ అతనికి అప్పు ఇవ్వకూడదని నిర్ణయించుకునేవారు! కానీ- అతడొచ్చి అడగ్గానే మళ్ళా కథ మామూలే!

నేను కూడా అతని మాటలు విని మోసపోయి.... ఎన్నోసార్లు అప్పిచ్చాను!

నాల్గు రోజుల క్రితం.

అతని భార్య మా ఆఫీసుకొచ్చి గోల పెట్టింది!

"అయ్యగారూ! మా ఆయనకీ మధ్య తాగుడు బాగా ఎక్కువైందండీ! మీరంతా చెప్పి... మానిపించదయ్యా! ఎక్కడ లేని డబ్బూ ఆ తాగుడికే చాలడంలేదు. ఇంట్లో జరగడం చాలా కష్టంగా వుంది! మీరు నా సంసారాన్ని కాపాడాలయ్యా". అంటూ వేడుకుంది.

ఆ క్షణమే మేమందరమూ 'ఇక ఎప్పుడూ సింహాచలానికి డబ్బు అప్పు ఇవ్వకూడదని" నిర్ణయించుకున్నాం!

"మనం అప్పు ఇవ్వడం వలనే అతడు మరింత ఎక్కువగా తిరుగుతున్నాడు! మనం ఇవ్వకపోతే తాగుడుకు డబ్బు దొరకదు! ఇక క్రమేపీ మానేస్తాడు! ఇక మనమెవ్వరం అతడు చెప్పే కట్టు కథలకు లొంగిపోయి అతనికి 'డబ్బు అప్పు ఇవ్వరాదు...." అని చెప్పాను!

అందరూ అంగీకరించారు!

ఇప్పుడు సింహాచలం డబ్బు అడగ్గానే అదంతా గుర్తుకొచ్చి మరింత కఠినంగా వ్యవహరించాను!

"సింహాచలం... నా దగ్గర డబ్బు లేదయ్యా" అన్నాను.

సింహాచలం తెల్లబోయాడు!

"అయ్యా! మీరు కూడా లేదంటున్నారా! అందరూ అదే మాట అన్నారు! ఇవాళ లేచి ఎవరి ముఖం చూశానో గానీ- దిగులుగా అన్నాడు! అయితే అందరి దగ్గరకూ వెళ్ళాడన్న మాట. ఫర్వాలేదు. అందరూ మాట మీద నిలబడ్డారు! ఇలా కొన్నాళ్ళు జరిగితే సింహాచలానికి బుద్ధి వస్తుంది...." అనుకున్నాను.

"బాబూ! కనీసం పదైనా ఇవ్వండి...." బ్రతిమిలాడాడు!

"ప్చ్! లేదు సింహాచలం.... వుంటే ఇవ్వనూ...."

"మా అమ్మాయికి బొత్తిగా బాగా లేదయ్యా!" విచారంగా అన్నాడు!

అది అబద్ధం..... ఈ మాట ఇదివరకెన్నోసార్లు చెప్పి డబ్బు పట్టుకు పోయాడు. ఈసారి మోసగింపబడకూడదు! కానీ పైకి- ఎంత కష్టం వచ్చింది సింహాచలం! కానీ నా దగ్గర ప్రస్తుతం డబ్బు లేదు.... ఏమనుకోకు....." అంటూ కుర్చీలో నుండి లేచాను.

ఇంకాస్సేపు వుంటే నా మనస్సెక్కడ కరిగిపోతుందోనని భయపడి... గబగబా లోపలికొచ్చాను!

మా ఆవిడ కల్పించుకుని "అదేమిటండీ.... అతనితో అలా అనేశారు! పాపం అతడెంత బాధపడుతూ వెడుతున్నాడో చూడండి.... ఆ డబ్బేదో ఇవ్వకపోయారూ" అంది.

"నీకు తెలీదులే.... అతన్ని బాగు చేయాలనే.... ఈ ప్లాన్"

"ఏమిటో మీ ప్లాన్లు నాకేం నచ్చలేదు" అందావిడ.

నేను నవ్వి వూరుకున్నాను.

ఆఫీసుకెళ్ళాక మా కొలీగ్స్‌తో సింహాచలం వచ్చి వెళ్ళిన విషయం చెప్పాను!

"మా దగ్గరికీ వచ్చాడు! మేమూ డబ్బివ్వలేదు." అన్నారంతా.

"ఇక సింహాచలం మారొచ్చు" అన్పించింది.

"ఇలాగే ఇక ముందు కూడా సింహాచలం మాటలకు లొంగిపోకుండా వుంటే క్రమంగా అతను త్రాగుడు మానేస్తాడు.... డబ్బివ్వకపోతే ఏం చేస్తాడిక... కాబట్టి మనం గట్టిగా నిలబడాలి...." అన్నాను!

అందరూ అంగీకరించారు.

సాయంత్రం ఇంటికి రాగానే మా ఆవిడ ఎప్పుడూ లేనిది గుమ్మంలో ఎదురు చూస్తూ నిలబడింది!

---

### అన్నీ నా కోసమే

పొలం మీ కోసమే
పంట మీ కోసమే
నీరు మీ కోసమే
గాలి మీ కోసమే
అడవి మీ కోసమే
కడలి మీ కోసమే!
మరివాడు
దోపిడీదారుడు
"మీ"ను దో చేసి
"నా"ను చేర్చాడు
అనుభవిస్తున్నాడు
అందలం ఎక్కాడు!

– అడిగోపుల వెంకటరత్నమ్

"ఏమిటో విశేషం?" నవ్వబోయాను!

ఆవిడ ముఖం మరింత సీరియస్‌గా పెట్టి "మీ ప్లాను ఫలితం ఏమయిందో చూశారా". అంది!

నేను తెల్లబోయాను!

"దేన్ని గూర్చి నువ్వు మాట్లాడేది?"

"మధ్యాహ్నం సింహాచలం కూతురు చచ్చిపోయింది. దానిక్కారణం మీరే! మీరు డబ్బిచ్చి వుంటే... ఆ పిల్ల బ్రతికేది కదా!" అంది.

ఆ మాట విని షాక్ తిన్నట్టయిపోయాను!

"నిజంగానా!"

"అవును.... కావాలంటే వెళ్ళి చూసి రండి...." అంటూ నన్నొక హంతకుడిలా చూసి లోపలకు వెళ్ళిపోయింది.

నా కాళ్ళూ చేతులూ చల్లబడిపోయాయి! నిలబడలేక-కూర్చుండిపోయాను.

"ఎంత ఘోరం జరిగింది! మా ఆవిడ అన్నట్టు మేం డబ్బిచ్చి వుంటే ఆ పిల్లకు సరైన వైద్యం జరిగి బ్రతికేది. ఆ పిల్ల చనిపోవడానికి కారణం మేమే! మేం ఆ పిల్లని హత్య చేశాం....."

నా కళ్ళమ్మట నీళ్ళు తిరిగాయి!

"పాపం ఆ పిల్లను దహనం చేయడానికయినా సింహాచలం దగ్గర డబ్బు వున్నదో! లేదో" అనుకుంటూ - మా అబ్బాయిని పిలిచాను.

'బాబూ! ఈ యాభై తీసుకెళ్ళి సింహాచలానికి ఇచ్చిరా! ఆ పిల్ల కర్మకాండకు ఖర్చు పెట్టమను" అని చెప్పాను!

వాడు వెళ్ళిపోయాడు!

చాలాసేపటి వరకూ అలా బాధపడుతూ కూర్చుండి పోయాను.

మరో గంట తర్వాత లేచి స్నానం చేసి వచ్చాను! కాఫీ త్రాగి-సింహాచలం ఇంటికి బయలుదేరాను!

"నేను చేసిన, పనికి.... అతనిని క్షమాపణ వేడుకోవాలి. అతనికింకేమైనా డబ్బు అవసరమైతే ఇవ్వాలి" అనుకున్నాను.

నేను వెళ్ళేసరికి సింహాచలం ఇంటి ముందు జనం వున్నారు. క్రింద పిల్లను పడుకోబెట్టారు. సింహాచలం భార్య గుండెలు బ్రద్దలయ్యేలా ఏడుస్తోంది. ఆ ఏడుపు చూడలేకపోయాను. దోషిలా సిగ్గుపడిపోయాను!

సింహాచలం ఆ గుంపులో కనబడలేదు!

అక్కడున్న వాళ్ళని అడిగాను ఎక్కడికెళ్ళాడో తెలీదన్నారు. బహుశ మిగతా ఏర్పాట్లు చూడడానికి వెళ్ళాడేమో.... అనుకుంటూ ఇక అక్కడ వుండలేక నెమ్మదిగా నడుస్తూ బజార్లోకి వచ్చాను.

కొద్ది దూరం వచ్చానో లేదో.... నా ఎదురుగా కనబడిన దృశ్యం చూసి ఆగిపోయాను.

"అక్కడ రోడ్డు ప్రక్కగా వున్న సారా కొట్లో కూర్చుని సింహాచలం మధ్య మధ్య బజ్జీలు తింటూ- చాలా తాపీగా గ్లాసుపై గ్లాసు పట్టిస్తున్నాడు"

ఆ స్థితిలో అతనిని చూడగానే కోపం- అసహ్యం.... కలగ్గా... విసురుగా వెనుదిరిగాను! □



# ప్రశ్నావళి

## కె. రామలక్ష్మి



**జి. వి. ఆర్. చేబ్రోలు**

★ ఇప్పటివరకూ వచ్చిన తెలుగు పాటల్లో మీకు నచ్చిన పాట ఏది?

● నాకు చాలా పాటలు యిష్టం. నేను తరచూ మూడేమూడు పాటలు వింటూంటాను – ఇంకా తెలవారదేమి? సి. నా. రె.ది. వద్దురా కన్నయ్యా ఆత్రేయది. నీలిమేఘాలలో – ఆరుద్రది.....

**ఎం. వి. విజయవాడ**

★ మనకి సహాయంకోసం ఎవరిని అర్థిస్తే బాగుంటుంది కె. రా. గారూ?

● వినలేదా – సలహాకి స్నేహితులని, దయకి ఆడవారిని, ధర్మానికి ముక్కూ ముఖం తెలియని వాళ్ళని. ఏమి అక్కర్లేనప్పుడు – చుట్టాలని చూడాలి!

**ఐ. ఆర్. కుంచనపల్లి**

★ సినిమాలలో చివరకు అత్తలకు బుద్ధి వచ్చినట్టు, నిజ జీవితంలో కూడా అత్తలలో మార్పు వస్తుందా?

● ఒక్క అత్తలలోనే – సినిమాలలో 'శుభం' ధీముకి బుద్ధివచ్చేది! నిజ జీవితం మూడు గంటల్లో ముగియనిదికనుక – మార్పు చాలామంది గుర్తించరు. అంతే.

**బి. బి. హైదరాబాదు**

★ కట్నం పుచ్చుకునే ప్రతి యువకుడూ తనకీ ఆడపిల్లలు పుడితే కట్నం యివ్వాలని ఆలోచించడా?

● ఇది మరీ బాగుంది – పెళ్ళిమాటలకి వెళ్ళి ఎవరేనా మనోవర్తి బేరాలు చేస్తారా?

**జి. ఎ. కె. ఆర్. విజయనగం**

★ స్నేహితుడే శత్రువుగా మారితే?

● ఫరవాలేదు – కాని ఇన్స్టెంట్ స్నేహితులనీ – స్లో శత్రువులనే మనం కనిపెట్టి చూడాలి.

★ రచయిత అచ్చులో పేరు చూసుకు మురిసిపోవడం దేనికి?

● అచ్చులో పేరు కొత్తగా వున్నట్టుంటుందికద! పుస్తకం పుస్తకమేకద – దాంట్లో సత్తా వున్నా లేకున్నా!

★ అనురాగం అంటే?

● 'ఎఫెక్షన్! ఈ ప్రపంచంలో దీన్ని మించిన నియంతలు వుండగలరు.... మనలని బానిసలను చేసేది యిదే కద.

**ఐ. ఆర్. విజయవాడ**

★ కె. ఆర్. గారూ, దొంగ ధనికులను దోచుకోడు. అలాగే పేదవారినీ దోచుకోడు: మధ్యతరగతి వారినే దోచుకుంటాడు ఎందుచేత?

● వాళ్ళే భేషజాలకిపోయి – తమకున్న సర్వం ప్రదర్శనకి పెట్టుకుంటారు. గొప్పవాళ్ళకి ఉన్న ధైర్యం, పేదవారికి – లేని ధైర్యం – మధ్యతరగతికి కద – వున్నట్టూ కాదు – లేనట్టూ కాదు!

**ఏ. వి. ఆర్. హైదరాబాదు**

★ వయస్సు పెరిగాక... మనిషి ఎలా ఉండాలి??

● వయస్సు పండి అందరూ గౌరవించడం మొదలు పెట్టాక– కనీసం తెలివిగా వుండాలి కద!!

★ ముసలితనం అంటే భయపడతా రెందుకు చాలామంది??

● ఒంటరిగా బ్రతకాలని భయం వయస్సు అనే నియంత ఎప్పుడూ– కుర్రతనపు కుతూహలాలు కూడదని శాసిస్తూ వుంటుంది కద!! □




(గత సంచిక తరువాయి)

"ఎవడో వూరూపేరూ లేని హార్డ్‌కోర్ క్రిమినల్‌ని కాల్చిపారేసి వాడే రాకా అని ప్రకటన యివ్వండి. దాంతో కొద్దిరోజులయినా ప్రజలు, పత్రికలు శాంతిస్తాయి. ఒకవేళ ఆ తర్వాత తెలిసినా అయ్యో పొరపడ్డాం అని మళ్ళీ ప్రకటన యిస్తే సరి! ఇవన్నీ మీ పోలీసులకి అలవాటేగా!" అన్న ముఖ్యమంత్రి మాటలకు మనసు చివుక్కుమంది కళ్యాణ్‌రాంకి.

ఒక్కక్షణం తను చేస్తున్న ఉద్యోగంమీద విరక్తి కలిగింది.

అందరూ తమ డిపార్ట్‌మెంట్‌ని వాడుకునేవాళ్ళే! కానీ సమయం వచ్చినప్పుడు అందరూ తమని కరివేపాకులా తీసిపారేస్తారు! పరిస్థితులు బాగాలేనపుడు – తమకి అనుకూలంగా మార్చుకోవడంకోసం రాజకీయవాదులు తమని యిలా వాడుకోవడం మామూలే!

జరిగిన కథ- 8: బ్యాంక్ విషయంలో ఇచ్చిన సలహాకు థాంక్స్ చెప్పడానికి వచ్చినరాకా దేదీప్యతో తాను ప్రేమకు అతీతుణ్ణని చెప్తాడు. రాకా పేరుతో శంభుదాదా నేరాలు మొదలుపెడతాడు. రాకా మానసిక ప్రశాంతత కోసం తాతయ్య దగ్గరికి వెళ్తాడు. డి జి పి పుట్టిన రోజు కానుకగా రాకా జోగి శవాన్ని పంపుతాడు. ప్రముఖ ఇంజినీర్లను బంధించి, వాళ్ళ నేరాలు వినిపించి చంపేస్తారు. ఆ పని చేసింది రాకాయేనని తెలుస్తుంది. సీతాదేవి భర్త విడుదలై రాబోతున్నాడన్న వార్త ఆమెకు ఎన్నో జ్ఞాపకాల్ని గుర్తు చేస్తుంది. రాకాను ఎదుర్కోవడానికి ముఖ్యమంత్రి ఒక పథకం ఆలోచిస్తాడు.

"ఆ అవసరం యింకా రాలేదుసర్! కొద్దిరోజుల్లోనే మేం రాకాని పట్టుకుంటాం" అని లేచాడు డి. జి. పి.

"దూయిట్! దూ సంథింగ్ యిమ్మీడియట్లీ!"

బయటకు నడిచివెళుతోన్న డి. జి. పి. వేపు సాలోచనగా చూసి – దగ్గర్లోవున్న ఫోన్‌ఎత్తి నెమ్మదిగా నంబర్ డయల్ చెయ్యసాగాడు ఏకాంబరం.

* * * *

"హలో !"

అన్న మాటతోపాటు సన్నగా.....విన్పించిన తియ్యటి నవ్వుకి గుండె ఝల్లుమంది దేదీప్యకి!

"హలో ...... మీరేనా?" అన్నకంఠం విని –

"ఊ....." అంటూ మధురంగా పలికింది దేదీప్యగొంతు.

"గుడ్..... హౌ ఆర్ యూ"

"ఫైన్...... ఎక్కడ్నుంచి?" అడిగింది.

మళ్ళీ అదేనవ్వు......

"స్వర్గం నుంచి. సారీ..... నాలాంటివాళ్ళు స్వర్గంలో వుండరుగా! నరకం నుంచి!"

కిలకిలా నవ్వేసింది దేదీప్య! ఎందుకో ఆమె గుండెలు వేగంగా కొట్టుకుంటున్నాయి!

"ఇంజనీర్స్ మాస్ కిల్లింగ్స్...... మీరు..... మీరేనా చేసింది?"

"అఫ్‌కోర్స్! వాళ్ళు విషాహారం తినేలా చేసింది నేనే! ఏం?"

"ఏం లేదు! వాళ్ళు గతంలో చేసిన ప్రజాద్రోహాలు తల్చుకుంటే వాళ్ళకిపడ్డ శిక్ష చాలా చిన్నదనిపిస్తోంది! రియల్లీ..... యు ఆర్ గ్రేట్ మిస్టర్ రాకా! కానీ..... ప్రభుత్వం, పోలీసులూ తమ చేతగానితనాన్ని ఒప్పుకోవడం యిష్టంలేక, విమర్శలు భరించలేక ఆ కోపమంతా మీ మీద చూపిస్తున్నారు! మిమ్మల్ని ఎలాగయినా పట్టుకోవాలని....."

ఈసారి పకపకానవ్వేశాడు రాకా.

"నో ఛాన్స్! ఈ రాకాని వాళ్ళు బతికుండగా పట్టుకోలేరు! నేను యిప్పుడప్పుడే చావను!" అన్నాడు.

"అబ్బా.... ఏం మాటలవి? సరేగానీ మీ దర్శనం ఎప్పుడు?" అడిగింది. అతన్ని కలుసుకోవాలని ఆమె మనసు ఉవ్విళ్ళూరుతోంది.

"ఎప్పుడంటే అప్పుడే! ఎప్పుడో హఠాత్తుగా నీ వెనగ్గావచ్చి 'హలో' అంటాను!" అన్నాడు.

అతనిమాటలు ఆమెలో ఒకవిధమైన మత్తును కలిగిస్తున్నాయి. అంతలోనే ఏదో అనుమానం.... ఆ వెనుక నిరాశ..... ఎప్పుడు – ఎక్కడ కలుస్తాడు అనే. విషయాలు అతను చెప్పడని ఆమెకి తెలుసు. అయినా అడక్కుండా వుండలేక –

"త్వరలో నే కలుస్తారుగా?" అనడిగింది.

"అలాగే...... ఏదైనా పనుందా?" అడిగాడు రాకా.

"అఫ్‌కోర్స్...... ఓ ముఖ్య విషయం చెప్పాలి!" అంది.

"ఫోన్లో చెప్పకూడనిదా?"

"అలాగనేంలేదు! మా నాన్నగారు త్వరలో యింటికివస్తున్నారు!" మెల్లగా చెప్పింది దేదీప్య.

"ఇంటికా? ఎక్కడినుంచి?"

"జైలునుంచి!" ఆమె కంఠం వణికింది!

రెండు క్షణాలు నిశ్శబ్దం!

"ఓకే! వెల్‌కం టు యువర్ డాడ్!" అన్నాడు.

అతను అడక్కపోయినా తండ్రి జైలు కెళ్ళిన విషయం క్లుప్తంగా చెప్పి –

"రాకా! మా డాడీ అన్యాయంగా శిక్షననుభవించారు. ఆయన్ని జైలుకి పంపడంలో మా అమ్మ పాత్ర కూడా వుంది! అదే నా కో పెద్ద పజిల్. ఎనీవే! మీరు మా నాన్నగార్ని తప్పకుండా కలుసుకోవాలి! ఆయన్ని మీరు లైక్‌చేస్తారు!" అంది దేదీప్య.

"తప్పకుండా కలుసుకుంటాను మిస్ దేదీప్యా! ఆయన అన్యాయంగా జైలుకి ఎందుకు వెళ్ళవలసివచ్చిందో కనుక్కోవాలనుంది నాకు!"

అతని మాటలతో దేదీప్య మనసు తేలికపడింది!

"అయితే త్వరలో మిమ్మల్ని కలుసుకోగలనన్న మాట!"

"ష్యూర్! త్వరలో కలుద్దాం!" అన్నాడు. మరుక్షణం ఫోన్ క్లిక్‌మంది!

* * * *

మోహన అపార్ట్‌మెంట్స్!

గేటుముందు ఆటో దిగిన దేదీప్య ఒకసారి తలెత్తి చూసింది. పన్నెండంతస్తుల భవనం అది! కొత్తగా కట్టారు. లిఫ్ట్ ఎక్కి పన్నెండో అంతస్తులో దిగింది దేదీప్య. చుట్టూ ఒకసారి కలియచూసి ఫ్లాట్ నంబర్ నాలుగు దగ్గరకి నడిచి బెల్ నొక్కింది.

ఆ ఫ్లాట్ దేదీప్య స్నేహితురాలు విమలది. ఈమధ్యే విమలకి పెళ్ళయింది. పెళ్ళికానుకగా విమల తండ్రి ఆమె కా ఫ్లాట్ కొనిచ్చాడు. నిన్న బజార్‌లో కన్పించి తప్పకుండా రమ్మని ఆహ్వానించింది విమల. ఆమె ఆహ్వానాన్ని కాదనలేక కాలేజీలో ఫస్ట్ అవర్ లీజర్ కావడంతో తిన్నగా యిక్కడికొచ్చింది.

రెండునిముషాలయినా తలుపు తెరుచుకోకపోవడంతో మళ్ళీ నొక్కింది కాలింగ్‌బెల్. మరో నిముషం తర్వాత తలుపు తెరుచుకుంది. ఎదురుగా విమల భర్త శేషగిరి!



# 'పవిత్ర పాపి' సీరియల్ పాఠకులకు ఆహ్వానం

వారం వారం పాఠకులు చెప్పే కథలకు విలువైన

## బహుమతులు

## నేరం... నేరం... నేరం... నేరం జరగని చోటు భూస్థలమంతా వెదికినా దొరకదు!

మానవజాతి పుట్టింది మొదలు ఈ భూమండలమ్మీద ఎన్నెన్నో నేరాలు... ఘోరాలు... రక్తపాతాలు జరిగాయ్. జరుగుతున్నాయ్!

అయితే– ఆధునిక సమాజంలో వాటి సంఖ్య పెరిగి, పెరిగి "నేరం జరగని చోటు భూస్థలమంతా వెదికినా దొరకదు" అన్న మాట సామాన్య సూక్తిగా మారిపోయింది.

ఈ అంశాల మీద ఈ తరం పరిశోధనాత్మక రచయిత చల్లా సుబ్రహ్మణ్యం సంధిస్తున్న నవ్య సమ్మోహనాస్త్రమే 'పవిత్ర పాపి' సీరియల్. ఇదొక పరిశోధనాత్మక 'మహాయజ్ఞం.'

అయితే – ఈ రోజు సమాజంలో క్షణ క్షణం జరుగుతున్న కోట్లాది నేరాలను ఏ ఒక్కరూ సంపూర్ణంగా రాయలేరు. అందుకే అభిమాన పాఠకులందరికీ 'ఆంధ్ర సచిత్ర వారపత్రిక' ఓ అపూర్వ అవకాశాన్ని కల్పిస్తోంది.

ప్రతిరోజూ మీ చుట్టూ అనేక నేరాలు, ఘోరాలు అనేకం జరుగుతుంటాయ్. మీరు విన్నవి, చదివినవి, మిమ్మల్ని కదిలించినవి ఏవైనా సరే... నేర సంఘటనల గురించి మీకు వచ్చిన భాషలో రెండు అరఠావులపై కాగితానికి ఒక వైపే రాసి మీ ఫొటోతో సహా పంపండి. ప్రతీ వారం వచ్చిన వాటిలో ప్రచురణ యోగ్యంగా వున్న రెండు వాస్తవ గాథల్ని ప్రచురిస్తాం.

అచ్చయిన ప్రతి రచనకూ ఈ సీరియల్‌ను సమర్పిస్తున్న 'హెల్త్ హోం ప్రొడక్ట్స్ ప్రైవేట్ లిమిటెడ్' వారు 50/– రూపాయిల విలువైన బహుమతిని అందజేస్తారు. అంతేకాదు– పాఠకులు చెప్పే చక్కటి కథలకు 'పవిత్ర పాపి' నవల కాపీని రచయిత ఆటోగ్రాఫ్‌తో పోస్ట్ ద్వారా పంపిస్తారు.

మనకి తెలిసిన నేరం అందరికీ చెబితే సమాజంలో నేర ప్రవృత్తిని తగ్గించిన వాళ్ళమవుతాం. ఒక సామాజిక ప్రయోజనాన్ని ఆశించి చేస్తున్న ఈ ప్రయోగంలో మీరూ భాగస్వాములు కావాలన్నది మా ఆకాంక్ష.

మీకు తెలిసిన నేరాన్ని గురించి వెంటనే రాసి పరిశీలనకి పంపండి.

రచనలు పంపవలసిన చిరునామా :

'నాకు తెలిసిన నేరం'
('పవిత్ర పాపి' సీరియల్)
ఆంధ్ర సచిత్ర వారపత్రిక
గాంధీనగరం, విజయవాడ–520003

"హలో..... రండి..... రండి...." నవ్వుతూ ఆహ్వానించాడు లోపలికి.

"విమల లేదా?" లోపలికి నడుస్తూ అడిగింది.

"లేకేం? విమ్మీ! ఎవరొచ్చారో చూడు!" అంటూ కేకేసాడు.

"హాయ్!" అంటూ సుడిగాలిలా వచ్చి దేదీప్యని చుట్టేసింది విమల.

చెరిగిన తల, కందిన బుగ్గలు...... విమల వాలకం చూసిన దేదీప్యకి వాళ్ళు తలుపు ఎందుకంత ఆలస్యంగా తెరిచిందీ అర్థమైపోయింది! పాపం..... మంచి రొమాంటిక్ మూడ్‌లో వుండగా వచ్చి డిస్టర్బ్‌చేసినట్టున్నాను అనుకుని, విమలని ఆటపట్టిద్దామని –

"ఏమే..... బెల్‌కొట్టిన ఐదు నిముషాలకా తలుపు తియ్యడం?" అనడిగింది.

"అదీ....... ఆయనేమో బాత్రూంలో వున్నారు. నేను కిచెన్‌లో పులుసుపోపు పెడుతున్నాను. పోపు మాడిపోతుందనీ...." అంటూ భర్తకేసి చూసి అర్థవంతంగా నవ్వింది విమల.

అతను నవ్వు దాచుకుంటూ –

"అవునవును! దేదీప్యగారూ!" అన్నాడు.

విమల హడావుడిపడిపోతూ స్వీట్స్ తెచ్చిపెట్టింది.

"ఏవిటే! ఉత్త స్వీట్స్‌తోనే సరిపెట్టేద్దామనుకున్నావా? గ్రాండ్‌గా డిన్నర్ కావాలి!" అంది దేదీప్య ఫ్లాటంతా కలియతిరిగి చూస్తూ.

"ఓ ఎస్! గృహప్రవేశం చాలా హడావుడిగా జరిగిపోయిందే! లేకపోతే ఫ్రెండ్సందర్నీ పిలిచేదాన్నే!" అంది విమల.

"సరేగానీ, మీవారికి ఆఫీస్ లేదా యివాళ?" అడిగింది దేదీప్య.

"లేకేం? వెళ్ళబుద్ధి కావడం లేదట! ఈ నెలలో యిది నాలుగో లీవ్!" అంది విమల నవ్వేస్తూ.

"పది రోజుల్లో నాలుగు రోజులు లీవ్ పెట్టారంటే..... మీరు చాలా హాపీగానే ఉన్నారన్నమాట!"

"ఆహా! ఈ ఫ్లాట్ కొచ్చేసరికి ఎక్కడలేని ఫ్రీడం వచ్చేసిందిగా! వాళ్ళింట్లో మేం కాక పదిమందయ్యే! ఎంతైనా ప్రైవసీవుండేదికాదు. ఈ నెల పదిహేడో తారీఖున మావారి పుట్టినరోజు! అంటే సరిగ్గా వారం రోజులుంది! ఆ రోజు మన ఫ్రెండ్సందరికీ మా యింట్లోనే డిన్నర్! నేను అందరికీ ఫోన్లుచేసి చెప్తానుగానీ, అందర్నీ కూడగట్టుకుని రావాల్సిన బాధ్యతమాత్రం నీది!" అంది విమల.

"అలాగే! మరి నేను వెళ్తానే!"

"అప్పుడేనా?"

"నీకేం తల్లీ! కాలేజీ మానేసి హాయిగా పెళ్ళిచేసుకుని యింట్లో కూర్చున్నావు! అవతల నాకు క్లాసుకి టైమయిపోతోంది!" అంది దేదీప్య.

"ఒక్కనిముషం! వక్కపొడి తెస్తా!" అంటూ బెడ్‌రూంలోకి వెళ్ళింది విమల.

దేదీప్య ఎదురుగా టీపాయ్‌మీదున్న వీక్లీ తిరగేస్తూ కూర్చుంది.

"అబ్బ...... ఉండండి! ఏవిటా తొందర?"

విమల గొంతు మెల్లగా పలికినప్పటికీ స్పష్టంగా విన్పించిన దేదీప్య సన్నగా నవ్వుకుంది.

"అయ్యో...... నా చీర..... ఛీ..... బుద్ధిలేకపోతేసరి! ఈ రోజంతా మీరు యింట్లోనేగా?" కొద్దిసేపు నిశ్శబ్దం.

దేదీప్యకి హఠాత్తుగా రాకా గుర్తొచ్చాడు! ప్చ్! ఎక్కడున్నాడో...... ఏం చేస్తున్నాడో...... ఒక్కసారి...... ఒక్కసారి..... అతని గుండెల్లో గువ్వలా ఒదిగిపోతే....

"ఇదుగోనే వక్కపొడి!" అన్న విమల మాటలకి ఉలికిపాటుగా తలెత్తిచూసింది దేదీప్య.

విమల ఎర్రటి పెదవులు మరింత ఎర్రగా మెరుస్తున్నాయ్ – భర్త వేసిన ముద్దు ముద్రతో. అసలు యిలాంటివన్నీ తను యింతకుముందు పట్టించుకునేదికాదు! రాకాతో పరిచయం అయ్యాకే తన కీ రొమాంటిక్ ఆలోచనలు ఎక్కువయ్యాయి.... అనుకుంటూ విమల చేతిలోంచి వక్కపొడి

తీసుకుని –

"మరి నేను వస్తానే!" అంటూ లేచింది దేదీప్య.

"ఏవండోయ్! మా ఫ్రెండ్ వెళ్ళిపోతోంది." బెడ్‌రూంలోకి చూస్తూ పిల్చింది.

శేషగిరి నవ్వుతూ బయటికొచ్చి –

"అప్పుడప్పుడూ వస్తుండండి!" అన్నాడు.

"తప్పకుండా! మీరు టీవీపెట్టినప్పుడుమాత్రం రాన్లెండి!" అన్న దేదీప్య మాటలకి ముగ్గురూ నవ్వుకున్నారు.

దేదీప్య వాళ్ళదగ్గర సెలవుతీసుకుని బయటికి నడిచింది.

లిఫ్ట్‌లో కిందకొచ్చి తలెత్తి పైకి చూసింది. పన్నెండో అంతస్తు బాల్కనీలో నిలబడ్డ విమల, శేషగిరి దేదీప్యకి చెయ్యి వూపారు.

దూరంగా ఆటో రావడం చూసిన దేదీప్య ఆగమన్నట్టుగా ఆటోకి చెయ్యివూపి, మళ్ళీ తల పైకెత్తి చూసింది.

అప్పటికే శేషగిరి, విమల నడుంచుట్టూ చెయ్యేసి లోపలికి తీసుకెళ్తున్నాడు. ఆ దృశ్యం చూసిన దేదీప్య పెదవులమీద సన్నటి నవ్వు విరిసింది!

ఆటో వచ్చి దేదీప్యముందు ఆగింది.

అంతలో ......

"కిర్..... ర్.... ర్.... క్..... క్..... క్...... !!" అన్న శబ్దం వినిపించి తల వెనక్కితిప్పి చూసింది. నిశ్శబ్దంగా వుందక్కడి వాతావరణం. రెండడుగులు ముందుకువేసి ఆటో వాడితో ఏదో చెప్పబోయింది దేదీప్య.

"క్రిక్..... క్రీ....క్రీ..... క్రీక్......."

తిరిగి పెద్దశబ్దం...... ఈసారి ఆ శబ్దాన్ని రోడ్డుమీద అందరూ విన్నట్టుగా వున్నారు. ఆ అపార్ట్‌మెంట్స్‌లోని జనమంతా బాల్కనీలోకి పరుగెత్తుకొచ్చారు.

"బిల్డింగ్ కూలిపోతోంది...... పరుగెత్తండి!" అని అరిచారెవరో.

అంతే!

పెద్దగా అరుపులు, కోలాహలం..... రోడ్డుమీద నిలబడి చూస్తున్న జనంతో కలిసి అప్రయత్నంగా దూరంగా పరుగెత్తింది దేదీప్య.

బెడ్‌రూంలో భర్త కౌగిలిలో నలిగిపోతున్న విమల ఉలిక్కిపడింది. అసంకల్పితంగా అతన్ని విడిపించుకుని బాల్కనీలోకి పరుగెత్తుకు వచ్చింది.

"బిల్డింగ్ కూలిపోతోంది...... కరెంట్ ఆఫ్‌చెయ్యండి...... షార్ట్‌సర్క్యూట్ అవుతుంది....." అనే మాటలు వినబడ్డాయి. కెవ్వున అరిచి భర్తదగ్గరకి పరుగెత్తింది. అతనికి విషయం చెప్పే వ్యవధికూడా లేదు. చెయ్యిపట్టుకుని లాగి గుమ్మందగ్గరకి పరుగెత్తింది.

అప్పటికే ఆలస్యమైపోయింది.

ధన్.... ధన్..... ధన్....

పై అంతస్తు ఐరన్ గర్డర్స్ కూలిపోసాగాయి. భయంతో భర్తని కౌగలించుకుంది విమల. ఐరన్ గర్డర్స్ అదురుకు భవనం మొత్తం పేకమేడలా కూలిపోతోంది.

"అమ్మో! అమ్మో!"

"అమ్మా! నేను లేవలేకపోతున్నాను."

"అబ్బా..... నాన్నా! ఎక్కడున్నావ్?"

స్త్రీలు గోలగోలగా ఏడుస్తున్నారు. చిన్నపిల్లలు హృదయవిదారకంగా రోదిస్తున్నారు.

అరుపులు! కేకలు! హాహాకారాలు!!

లిఫ్ట్‌దగ్గర త్రొక్కిసలాట......లిఫ్టులు పనిచెయ్యడంలేదు!

మొదటిసారిగా కదిలిన ఓ లిఫ్ట్ సగం దిగి గొలుసులూడడంతో అంత ఎత్తునుంచి క్రిందికి కూలిపోయింది.... అందులో వున్నవాళ్ళు నుగ్గునుగ్గు అయిపోయారు. ఎక్కడో షార్ట్‌సర్క్యూట్ అయినట్టుంది. బిల్డింగ్‌లో ఒవేపు మంటలు మొదలయ్యాయి.

ప్రాణభయంతో పరుగులుతీసే సమయంలో ఆలోచనా జ్ఞానం వుండదు. సమయానికి ఏం చెయ్యాలో తోచదు. దిక్కుతోచనిస్థితిలో మెట్లు

ఎక్కడున్నాయో కూడా తెలీడంలేదు. కారణం – పెద్దపెద్ద యినుప దూలాలు మెట్లు కడ్డంగా పడిపోయాయి.

దారులన్నీ మూసుకుపోయినయ్!

బయట రోడ్డుమీద జనం నిశ్చేష్టులై – కుప్పకూలుతున్న భవనాన్ని చూస్తున్నారు.

అప్పటికే పోలీస్‌వ్యాన్లు, ఫైరింజన్లు అక్కడికి చేరుకున్నాయ్! చచ్చిపోయినవాళ్ళు పోగా, కొనప్రాణాల్తో వున్నవాళ్ళని ఎలా బయటికి తేవాలా అని బుర్రలు బద్దలుకొట్టుకుంటున్నారు అధికారులు.

ఎవరో ఆ అపార్ట్‌మెంట్స్ కట్టిన కాంట్రాక్టర్‌కి ఫోన్‌చేశారు – ఆయన ఊళ్ళోలేడని సమాధానమొచ్చింది. బిల్డింగ్ కట్టి సొమ్ముచేసుకోవడం వరకే అతనికి సంబంధం! తర్వాత కొనుక్కున్నవాడి ఖర్మ. కంట్రాక్టర్ ఊళ్ళో లేకపోవడంతో కనీసం బిల్డింగ్ ప్లాన్ కూడా తెలుసుకునే అవకాశం లేకపోయింది పోలీసులకి.

బిల్డింగ్ మొత్తం కూలిపోవడానికి పన్నెండు నిముషాలు పట్టింది. గోడలమధ్య, ఇనుప గడ్డర్ల అడుగున వున్నవాళ్ళని బయటికి తీసే ప్రయత్నాలు మొదలయ్యేసరికి మధ్యాహ్నమైంది. గంటలు గడుస్తున్నా కన్నీళ్ళతో శిలలా నిలబడి చూస్తోంది దేదీప్య.

తలలు నజ్జయినవాళ్ళు–

శరీరం చిన్నాభిన్నం అయి గుర్తుపట్టడానికి వీల్లేని శవాలు! తలలూ, మొండెం వేరయిన చిన్నపిల్లలు!

కాళ్ళూ చేతులూ విరిగిన వృద్ధులు!

ఒకరినొకరు పెనవేసుకుని అలాగే ప్రాణాలు వదిలిన కొత్తదంపతులు!

జనం తండోపతండాలుగా వచ్చారు ఈ ఘోరం చూడ్డానికి! కట్టిన మూడు నెలలకే కూలిపోయిన ఆ బిల్డింగ్ మొత్తం ముప్ఫయ్యొనిమిది మందిని బలితీసుకుందని అధికారులు ప్రకటించారు. కాని ఆ సంఖ్య యింకా చాలా ఎక్కువవుంటుందని అందరికీ తెలుసు.

అంబులెన్స్‌లు సైరన్‌లు మోగించుకుంటూ వచ్చి, కొన ప్రాణాలతో వున్నవాళ్ళని హాస్పిటల్స్‌కి చేరుస్తున్నాయ్.

క్షతగాత్రులతో –

మరణించినవాళ్ళ బంధుమిత్రుల హృదయవిదారకమైన ఏడ్పులతో ఆ ప్రదేశమంతా అల్లకల్లోలంగావుంది!

పెద్దల శవాలు ఒకచోట –

పిల్లల మృత కళేబరాలు మరోచోట పేర్చిపెడుతున్నారు.

పోలీసులు జనాన్ని చెదరగొడుతున్నా రక్కడనుంచి. ఉన్నతాధికారులు, ప్రభుత్వ పెద్దలు అక్కడికి చేరుకుంటున్నారు.

ఆ జనసముద్రంలో రెండు కళ్ళు మాత్రం చిన్నపిల్లల మృతకళేబరాల్ని గంటసేపటినుంచీ దీక్షగా చూస్తున్నాయ్. ఆ కళ్ళలోంచి అగ్నికణాలు వర్షిస్తున్నాయ్.

చిన్నపిల్లల శవాలపైనుంచి దృష్టిమరల్చి ఆ యువకుడు అక్కడేవుండి బందోబస్తు చేస్తున్న ఓ పోలీస్ అధికారి దగ్గరకి విసురుగా వెళ్ళాడు.

"ఈ బిల్డింగ్ కంట్రాక్టర్ ఎవడు?" అనడిగాడు.

అనాలోచితంగా కంట్రాక్టర్ పేరుచెప్పిన ఆ అధికారికి ఆ యువకుడడిగిన ప్రశ్న వింతగా అన్పించింది.

వెంటనే అతనికోసం చూశాడు. కానీ అప్పటికే ఆ యువకుడు జనంలో కలిసిపోయాడు.

* * *

ఆ రాత్రి –

ఆ ఆశ్రమంలో తాతయ్య వళ్ళో తలపెట్టుకుని పడుకునివున్నాడు రాకా. అతని కళ్ళు అగ్నికణాల్లా వున్నాయ్.

"అంతమందిని – అందులోనూ పసిపిల్లల్ని పొట్టనపెట్టుకున్న ఆ కాంట్రాక్టర్ని ఎవరూ ఏం చెయ్యలేరా తాతయ్యా?" అన్నాడు ఆవేదన నిండిన కంఠంతో.

తాతయ్య జవాబేం చెప్పలేదు. రాకా తల నిమురుతూ వుండిపోయాడు.

"కొత్తగా గృహప్రవేశం చేసుకున్న దంపతులు – ప్రశాంతజీవనంకోసం తమ పెన్షనంతా వెచ్చించి ఫ్లాట్స్ కొనుక్కున్న వృద్ధులూ – అమాయకులైన వీళ్ళందరి ప్రాణాలూ తీసే హక్కు ఆ కాంట్రాక్టర్‌కి ఎక్కడిది తాతయ్యా? ఈ అన్యాయాలకు ఆనకట్టవేసేవాళ్ళేలేరా?" ఆ మాటలు, రాకా అడిగిన తీరు ఆ వృద్ధుణ్ణి చలింపజేసింది.

"ఎందుకులేరుబాబూ......"

"ఎవరు తాతయ్యా! నిజంగా అలాంటివాళ్ళుంటే, స్వార్థపరుడైన ఆ కాంట్రాక్టర్ యింకా ప్రాణాలతో వుండేవాడా? ఇలాంటి అరాచకపు సంఘటనలు మళ్ళీమళ్ళీ జరిగేవా?" ఆవేశంగా అడిగాడు రాకా.

"నువ్వు చెప్పింది నిజమేబాబూ....... ఒక్క కాంట్రాక్టర్ ప్రాణాలు తీసినంతమాత్రాన మిగిలిన కాంట్రాక్టర్లంతా మారిపోరు. అందుకే..... సిమెంట్‌తో సంబంధమున్న ప్రతి వ్యక్తికీ, యిప్పుడు జరగబోయే సంఘటన వెన్నులోంచి చలిపుట్టించేదిగా వుండాలి! గుప్పెడు ఇసుక ఎక్కువ కలిసినా – సిమెంట్ బస్తా దరిదాపులకి బూడిద వచ్చినా తాము బూడిదైపోతామనే భయం కలిగించాలి! ఆపనికి నువ్వు ఒక్కడివే సమర్థుడివి!" అన్నాడాయన గంభీరంగా.

"తాతయ్యా......!"

* * *

సాయంత్రం అయిదున్నర గంటలుకావొస్తోంది!

ప్రాక్టికల్స్ ముగించుకుని కాలేజీగేటుబయటకొచ్చి, అక్కడే వున్న బస్‌స్టాప్‌లో నిల్చుంది దేదీప్య.

ఆమె ఆలోచనలనిండా రాకా! అతన్తో మాట్లాడి ఎన్నోరోజులు కాకపోయినా ఏదో తెలియని దిగులు మనసుని చుట్టుముడుతోంది. ఎత్తుగా, బలంగా కన్పించిన ప్రతి వ్యక్తినిచూసి రాకానేమో అనుకుంటోంది. దేనిమీదా మనసునిలవడంలేదు. అతన్నిగురించి ఆలోచించేపని తప్ప – మిగిలినవన్నీ యాంత్రికంగా చేస్తోంది.

తన తండ్రి త్వరగా వచ్చేస్తే – ఆయన్ని రాకాకి పరిచయంచేయవచ్చు. అంటే..... కనీసం యింకా మూడు రోజులు ఆగాలి! "అబ్బా.... ఎలా గడుస్తాయి ఈ మూడు రోజులు?" అనుకున్న దేదీప్యకి నీరసం ముంచుకొచ్చింది. ఇక బస్‌స్టాప్‌లో నిలబడే ఓపికలేక అప్పుడే తన ప్రక్కకి వచ్చి ఆగిన ఆటో ఎక్కేసి అడ్రస్ చెప్పింది.



వెనక్కివాలి కూర్చున్న దేదీప్య మళ్ళీ తన ఆలోచనల్లోకి తాను వెళ్ళిపోయింది. తన తండ్రిని జైలుకి పంపినవాళ్ళంతా బహుశా ఎక్కడో సుఖంగా వుండివుంటారు. తన తండ్రి సాత్వికుడు కనుకనే న్యాయం జరగలేదు. అదే ఆయన రాకాలాంటి వాడయ్యుంటే....? ఆ దుర్మార్గుల్ని చీల్చి చెండాడేవాడు.

ఇప్పటికయినా మించిపోయిందిలేదు. నాన్నకు జరిగిన అన్యాయానికి రాకా తప్పకుండా న్యాయంచేసితీర్తాడు!

చెప్పింది చేసితీరతాడు! అతనెవరికీ భయపడడు. ప్రతి విషయాన్నీ ఛాలెంజ్‌గా తీసుకుంటాడు. లోకంలో దేనికీ భయపడే మనస్తత్వం కాదతనిది!

అలాంటివాడు తన జీవిత భాగస్వామి అయితే......?

ఆ ఆలోచనకే దేదీప్య గుండె ఝల్లుమంది.

అయినా అతను ఒప్పుకుంటాడా?

అతనిధైర్యానికి, తెలివితేటలకి తను సరిజోడీ కాదనుకుంటాడా?

ఇలాంటి ఆలోచనలు తన మనసులో వున్నాయని తెలిస్తే 'అమ్మ' ఏమవుతుంది? అమ్మో! తలుచుకోడానికే భయంగా వుంది!

అయినా రాకా మనసేమిటో తెలుసుకోకుండా తను చాలా దూరం ఆలోచిస్తోంది..... ఆటో కుదుపుకి ఈ లోకంలోకి వచ్చింది దేదీప్య.

ఆటో యింటివైపు దారిలో కాకుండా లవర్స్ పార్క్ వేపు వెళ్తున్నట్టు గమనించి ఉలిక్కిపడింది దేదీప్య.

"ఏయ్ మిస్టర్! ఏమిటిది? ఎక్కడికి తీసుకెళుతున్నావ్?" కోపంగా, [illegible] ఆటో డ్రైవర్ని.

ఆమె మాటలు లెక్క చేయకుండా ఆటో వేగం పెంచాడు డ్రైవర్.

"ఏయ్... నిన్నే! ఆపు.... ఆటో ఆపు!" అంది ధైర్యం కూడదీసుకుని ఆటో డ్రైవర్ భుజం మీద చెయ్యేసి కుదుపుతూ.

అప్పుడు....

అతను వెనక్కి తిరిగాడు.

దేదీప్య గుండె ఝల్లుమంది.

అతను.... రాకా!!!

* * * *

"ఇదీ మా నాన్నగారి సంగతి! ఆయన మళ్ళీ మామూలు మనిషి కావాలి! అందరిలో కలిసిపోవాలి! ఆయనకు కావలసిన మానసిక ధైర్యం మీరివ్వాలి!" అంది దేదీప్య అతనికి రెండడుగుల దూరంలో కూర్చుని, దూరంగా కనిపిస్తున్న నీళ్ళకేసి చూస్తూ.

"చూడు దేదీప్యా! మీ డాడీకి మానసికంగా ధైర్యం చెప్పడానికి నేనేం సైక్రియాట్రిస్ట్‌ని కాదు! ఆయన్ని అన్యాయం చేసిన వాళ్ళెవరో చెప్పమను. ఫినిష్ చేస్తాను.... ఈ సెంటిమెంట్లు.... ఈ గొడవలు నా తత్వానికి సరిపడవు!" తెగేసినట్టుగా చెప్పాడతను.

దేదీప్య మనస్సు చివుక్కుమంది.

అతనిలోని కాఠిన్యం తాలూకు నగ్న స్వరూపం ఎంత భయాన్ని కలిగిస్తుందో అంతే ఫాసినేషన్ని పెంచుతోంది.

అంతటి కఠినుడు- ఎవర్నీ కేర్ చెయ్యనివాడు. తనను కలుసుకోవడానికి ఉవ్విళ్ళూరుతున్నాడు. అంటే.... మనసులో ఏ మూలో తన పట్ల అభిమానం వుందన్నమాట.

అభిమానం అభిమానంలా ఎన్నాళ్ళుంటుంది? అది చిగురులు వేయకుండా వుంటుందా?

"నిన్నెందుకు కలుసుకున్నానో తెలుసా?" అడిగాడతను.

"నన్ను చూడాలని! కాదా?" అంది సూటిగా అతని కళ్ళలోకి చూస్తూ. విరాగ్గాచూశాడు రాకా. ఆమె అతని ఫీలింగ్స్ పట్టించుకోకుండా—

"ఆ రోజు మీరు ఫోన్ చేసింది మొదలు ప్రతి క్షణం మీ గురించే ఆలోచించాను!" చెప్పింది.

"నువ్వేం మాట్లాడుతున్నావో నాకర్థం కావట్లేదు!" అన్నాడు రాకా.

"అర్థం చేసుకోవడానికి ప్రయత్నించవచ్చుగా?"

"చూడు దేదీప్యా! ఒక ముఖ్యమైన విషయం నీతో మాట్లాడాలని...."

"ప్లీజ్ అవన్నీ తర్వాత! ముందిది చెప్పండి? నేనంటే మీకు అభిమానం లేదా?"

"నాకెవరన్నా అభిమానాలు— తోటకూరకాడలూ లేవు. యిలా అభిమానాలు పెంచుకుని వుంటే— ఈ పాటికి పోలీసుల మీద కూడా అభిమానం పెరిగిపోయి వాళ్ళ అతిథిగా వుండేవాడిని!" అన్నాడు చాలా కాజువల్‌గా.

"అబ్బ... ఇప్పుడు కూడా జోక్సేనా? రియల్లీ రాకా నువ్వంటే నాకెంతో ఇష్టం" తడబడుతూ చెప్పింది దేదీప్య.

"వ్వాట్?" ఆశ్చర్యంగా అడిగాడు రాకా.

దేదీప్య ముఖం సిగ్గుతో కందిపోయింది.

"ఐ.... ఐ.... లవ్‌యూ!"

క్షణం జాలిగా చూశాడు ఆమె వేపు.

"ఇట్సాల్ రబ్బిష్....! బుల్షిట్! నువ్ మరీ యింత చిన్న పిల్లలా మాట్లాడతావనుకోలేదు. నా ప్రపంచంలో ప్రేమకి స్థానం లేకపోలేదు. కానీ అది నీవనుకొనే ప్రేమ కాదు!. వసుధైక ప్రేమ! నేనందర్నీ... ఐ మీన్ అమాయకుల్నీ బాధితుల్నీ అందర్నీ ఒకేలా ప్రేమిస్తాను. చేతనైతే అలాంటి ప్రేమని నేర్చుకో! నువ్వూ నేనూ ప్రేమించుకొని పెళ్ళి చేసుకున్నంత మాత్రాన ఈ ప్రపంచానికి జరిగే మేలేమిటి? విషయాల్ని బ్రాడ్‌గా ఆలోచించడం నేర్చుకో! అండర్‌స్టాండ్!?"



వికలాంగుల దినోత్సవం సందర్భంగా ఖరగ్‌పూర్‌లో 100 మీ పరుగు పందెంలో గెలుపొందిన వారు

బిక్క ముఖం వేసుకుని చూస్తుండిపోయింది దేదీప్య. అన్యాయాన్ని సహించని అతనిలోని ఆవేశం. విశ్వమానవ ప్రేమ... యివి చూసి కదా అతనంటే తను మనసు పారేసుకుంది? ఆ వసుధైక ప్రేమ తనలో కూడా వుండబట్టేగా అతని పట్ల ఆకర్షితురాలయింది? అది గ్రహించకుండా మరీ ఇలా మాట్లాడతాడేం? ఛ... ఆడపిల్ల హృదయంలో పుట్టే సున్నితమైన ఆ ప్రేమని అర్థం చేసుకోలేడా యితను? మొదటి నుంచీ ఈ రకమైన నేరాల్లో జీవించడం వల్లనే యితని మనసు ఆడపిల్లల పట్ల ఆకర్షింపబడి వుండదు! తను ప్రయత్నిస్తే అతని హృదయంలో ప్రేమజల్లు చిలకరించడం అసాధ్యం కాదు!. యిది తనకో ఛాలెంజ్ అవును.

ఇక ప్రేమ, దోమ మాటలు మానేసి సీరియస్‌గా అతనితో కలిసి పనిచేస్తూ అతనికి తెలీకుండానే అతని మనసుని దోచేయాలి! అనుకున్న దేదీప్య—

"ఒకే మిస్టర్ రాకా! చెప్పండి... ఏదో చెప్తానన్నారుగా!" అంది.

ఒక్కసారిగా ఆమెలో కనిపించిన సీరియస్‌నెస్‌ని మరోలా అర్థం చేసుకున్న రాకా–

"సారీ దేదీప్యా... అభిప్రాయాల్ని నిక్కచ్చిగా చెప్పడం నాకు అలవాటు. అలాగే.... ఆడపిల్లలతో మెలగడం కూడా నాకు కొత్త! మరి ముఖ్యంగా టైం వేస్ట్ చెయ్యడమంటే అసలు పడదు! సో.... నేనో చిన్న పని చెప్తాను. చేస్తావా?" అన్నాడు.

"ఓ యస్! అయాం రడీ టు టేక్ యువర్ ఆర్డర్స్!" అంది దేదీప్య నవ్వుతూ–

"సరే.... జాగ్రత్తగా విను!"

అంటూ చెప్పడం ప్రారంభించాడు రాకా.

దేదీప్య శ్రద్ధగా వినసాగింది.

* * * * *

గేటు తీసుకుని 'శైలజా సదన్' అన్న అక్షరాల్ని చదువుతూ బిల్డింగ్ లో పలికి ప్రవేశించారు దేదీప్య, ఆమె స్నేహితురాళ్ళు రూప, కుసుమ.

హాల్లోకి ప్రవేశిస్తూనే–

"శైలూ.... శైలూ...." అంటూ పిల్చింది దేదీప్య.

అదే హాల్లో ఓ ప్రక్కగా వున్న సోఫాలో పడుకుని పేపర్ చదువుకుంటున్న ఓ పెద్దమనిషి లేచి కూర్చుంటూ–

"ఎవరమ్మా మీరు?" అనడిగాడు.

"మేం శైలజ ఫ్రెండ్స్‌మండీ! మ్యారేజ్ ఫిక్స్ అయిన దగ్గర్నుంచీ అది కలవలేదు.... అందుకనే వచ్చాం!" అని.

"మీరు?...." అంది.

"నేను శైలజ ఫాదర్‌నమ్మా! పైన వుంది వెళ్ళండి!" అన్నాడాయన. అందరూ బిలబిలమంటూ హాల్లోంచి మేడ మీదికి వున్న మెట్లెక్కారు.

శైలజ మంచం మీద బోర్లా పడుకుని నవల చదువుకుంటోంది. వీళ్ళని చూస్తూనే–

"హాయ్ ఫ్రెండ్స్! వెల్‌కం!" అంటూ లేచి కూర్చుంది.

"అవునే.... ఫ్రెండ్స్ అట ఫ్రెండ్స్! లోకంలో నీ ఒక్కదానికే పెళ్ళవుతున్నట్టు మరీ మమ్మల్నందర్నీ మర్చిపోయి నల్లపూసవైపోయావే?" అంది దేదీప్య నిష్ఠూరంగా.

"పెళ్ళి సెటిలయ్యింది కదా! బయటకు వెళ్ళొద్దన్నారు!" అంది శైలజ సిగ్గుపడుతూ.

"ఎవరూ కాబోయే మొగుడుగారా?"

ఠకీమని అడిగేసింది రూప. శైలజ సమాధానం చెప్పేలోగా కుసుమ అందుకుని "కాబోయే పెళ్ళాం లోకం కంటపడకూడదని ఆజ్ఞాపించినంతటి పురుషపుంగవుడెవరే! కొంపదీసి నువ్వు ఏ మేవార్ మహారాజునో కట్టుకోవడం లేదు కదా" అంది శైలజని ఆటపట్టిస్తూ.

"ఛీ! పొండి! ఆయనలాంటి వారు కాదు!" అంది శైలజ చిరాకు నభినయిస్తూ.

"ఓహో.... అప్పుడే శ్రీవారి తరపున వకాల్తా పుచ్చుకుంటున్నావే!" అంది రూప.

"సరేగాని ఆ మగపురుషుడెవ్వడు? వాని నామధేయంబేమి? ఎక్కడివాడు? రూప లావణ్యాలెటువంటివి? కొంచెం చెప్పి పుణ్యం కట్టుకో శైలజాదేవీ!"

అంటూ తన తెలుగు నాలెడ్జినంతా ఉపయోగించేసింది కుసుమ.

"ఆయన పేరు...." సిగ్గుపడింది శైలజ.

"హార్నీ! నీ సిగ్గు మొగ్గలుకానూ! నువ్వు చెప్పకపోయినంత మాత్రాన ఆయన పేరు మాకు తెలీదనుకున్నావా? తాటికాయంత అక్షరాల్తో వేయించావ్‌గా శుభలేఖలో 'వాసు' అనీ! అది సరే ఆ ఇంజనీర్‌గార్ని ఎంత పోసి కొనుక్కున్నావేంటి?" అనడిగింది దేదీప్య.

"ఏమో నాకు తెలీదు!" అంది శైలజ.

"అవున్లే పాపం.... కట్నం ఇవ్వకూడదని డిబేట్‌లో వాదించి గోల్డ్ మెడల్ కొట్టేసినదానివి! ఎలా చెప్తావులే! అయినా మీ డాడీ కాంట్రాక్టర్.... పైగా నువ్వొక్కర్తివే కూతురివి.... ఉన్న ఆస్తంతా నీదైనప్పుడు కట్నాల గోలేముంటుంది?" అన్న దేదీప్య మాటలకి ఫ్రెండ్సంతా సపోర్ట్ చేశారు.

కాఫీ, టిఫిను అయాక–

"శైలూ.... మ్యారేజ్ అవగానే నువ్ స్టేట్స్‌కు వెళ్ళిపోతావ్ గనుక ఫ్రెండ్సంతా కలిసి పిక్నిక్ ప్రోగ్రాం వేశాం. మళ్ళీ ఎప్పటికి కలుస్తామో కదా! రేపు ఉదయం ఎనిమిదికల్లా రెడీగా వుండు. మేమొచ్చి పికప్ చేసుకుంటాం!" అంది కుసుమ.

"రేపా? నాన్నగారేమంటారో...." సందేహంగా అంది శైలజ.

"పోవోయ్! పెద్ద.... క్లాసులెగ్గొట్టి చూసిన సినిమాలన్నీ నాన్నగార్ని అడిగే చూశావా? ఎలా వస్తావో తెలీదు. నీకోసం అరేంజ్ చేసిన ప్రోగ్రాం గనుక మిస్ అయ్యే ప్రసక్తే లేదు. ఓకే?" అంది దేదీప్య.

"ఓ....కే...." అంది నవ్వుతూ శైలజ.

మర్నాడు–

* * * * *

పిక్నిక్ ప్రోగ్రాం సరదాగా గడిచింది.

పెళ్ళిళ్ళ మీద, కాబోయే భర్తల మీద విపరీతంగా జోక్స్ కట్ చేసుకున్నారు సాయంత్రం కాగానే నెమ్మదిగా నడుస్తూ షికారు బైలుదేరారు.

శైలజ, దేదీప్య ఓ చెట్టు క్రింద కూర్చున్నారు. తనకి కాబోయే భర్త స్టేట్స్ నుండి ఫోన్ చేసి ఏం మాట్లాడాడో చెప్పింది శైలజ.

ఎన్నంతసేపూ ఎంజాయ్ చేసిన దేదీప్య హఠాత్తుగా సీరియస్‌గా మారిపోయి–

"శైలూ! నేను చెప్పేది శ్రద్ధగా విను!" అంది గంభీరంగా.

ఉన్నట్టుండి దేదీప్య కంఠంలో కలిగిన మార్పుకి ఆశ్చర్యంతో కళ్ళుపెద్దవి చేసింది శైలజ.

దేదీప్య మెల్లగా చెప్పడం ప్రారంభించింది. శైలజ ఆసక్తిగా వినసాగింది. రెండు నిమిషాలపాటు దేదీప్య చెప్పిన మాటలు అత్యంత శ్రద్ధగా వింది శైలజ.

మరికొద్దిసేపు ఎవరి ఆలోచనల్లో వాళ్ళు ఉన్నట్టుగా మౌనంగా వుండిపోయారు.

"ఇక వెళ్దామా?" అంటూ లేచింది దేదీప్య.

శైలజ కూడా లేచి దేదీప్యతో కలిసి మిగిలిన ఫ్రెండ్స్ వెళుతున్న వేపుగా కదిలారు.

అయితే–

ఆ ఇద్దరిలో ఏ ఒక్కరికీ తాము గడిపిన ఆ "రెండు నిముషాలు" తమ జీవితాల్ని ఊహించని మలుపుల్ని తిప్పుతాయని తెలీదు. (ఇంకా ఉంది)



# నెస్టమ్ బేబి సిరియల్ ప్రారంభించేందుకు ఆదర్శప్రాయమైనది పెరుగుదలకు ఆదర్శప్రాయమైనది



**నెస్టమ్, పాలు-పూర్తి పోషక విలువలున్న ఆహారం.**

మీ బాబు సుమారు 4 నెలలవాడయ్యేసరికి, కావాలి పాలతోపాటు ఘనఆహారం. పాపాయికి తేలిగ్గా జీర్ణమయ్యేట్టు, ప్రత్యేక శ్రద్ధతో తయారయిన నెస్టమ్ బేబి సిరియల్ ని పెట్టడం ప్రారంభించండి. ముందుగా మరిగించి చల్లార్చిన గోరువెచ్చటి పాలతో కలపండి. ఇక, పూర్తి పోషక విలువలున్న ఆహారం సిద్ధమవుతుంది. పాపాయి ఆరోగ్యంగా, చలాకీగా పెరిగేందుకు తోడ్పడుతుంది.

**నెస్టమ్ తో వివిధ వంటలు-పాపాయి ఆహారంలో బోలెడన్ని రకాలు**

మీ పాపాయి ఎదుగుతున్న కొద్దీ కొత్త రకాలు రుచి చూపించండి. ఉడికించిన కూరముక్కలూ, పండ్ల ముక్కలూ, పప్పు-పిండిని నెస్టమ్ తో కలిపి పెట్టండి. బాబు, కుటుంబంలో వారు తినే ఆహారాన్ని తినటం నేర్చుకునేందుకు ఇది తోడ్పడుతుంది.

**నెస్టమ్**
**రైస్**
ఇనుము-విటమిన్లతో కూడినది
పాలలో కలపండి.

**ఉచితం**
మీ బాబు, తన ఆహారంలో, కొత్త రుచులను కోరుతాడు అందుకని-మీ ఉచిత నెస్టమ్ వంటల పుస్తకం కోసం రాయండి.
నెస్టమ్
పోస్ట్ బాక్స్ నెం. 6016,
న్యూ ఢిల్లీ-110008.







Nestlé

S.K SWAMY/FSL/4764 TEL

# మనసే ఒక శాపం

## పైడిపాల

ఇందిర కనిపించడం లేదు!

ఇందిరది తిరునాళ్ళలోనో, తిరుపతి కొండమీదో తప్పిపోయే తప్పటడుగుల వయస్సుకాదు- తప్పటడుగులు వెయ్యడానికి అవకాశముండే పద్దెనిమిదేళ్ళ పరువం.

కాని ఇందిరది అంత తేలిగ్గా తప్పు పట్టదగిన నడవడికాదు. అందుకే ఇందిర కనిపించక పోయినా వూరంతా గుప్పుమనలేదు.

ఇందిరకు తల్లీ, తండ్రీ... సమస్తం సత్తిరాజే- అని ఇందిర భావించదు. సత్తిరాజు శాసిస్తాడు. అతని అనుమానానికి అతని అర్ధాంగి చిన్నతనంలోనే ఆహుతయి పోయింది. ఇందిర చదువు హైస్కూలుతో ఆగిపోయింది. ఆ ఇంట్లో ఆ పిల్ల కున్న ఒకే ఒక ఆడతోడు మంగమ్మ. ఆమె సత్తిరాజుకి అత్తగారి వరుస. భార్య పోయిన తర్వాత ఇందిర సంరక్షణ కోసం 'నా' అన్నవాళ్ళు లేని మంగమ్మకు యింట్లో చోటిచ్చాడు.

మేనల్లుడు శేఖరం ఆ వూళ్ళో పి. జి. సెంటర్లో ఎమ్మే చదువుతూ తన యింట్లో వుందామని ఆశపడినా, వీలు కాదన్నాడు సత్తిరాజు. అయినా శేఖరం కాలితో తన్నితే చూరు పట్టుకొని వేళ్ళాడే రకం కనుక అద్దె గదిలో కాలక్షేపం చేస్తూనే అడపాతడపా సత్తిరాజు యింటికి వస్తూ పోతున్నాడు.

ఇందిర తండ్రితో తప్ప సినిమాలు చూడకూడదు. పత్రికల్లో అభ్యంతర కరమయిన విషయాలున్న పుటలు చించేసి మరీ యింటికి తీసుకొస్తాడు సత్తిరాజు.

కనుపాపలా పెంచిన ఇందిర కనుమరుగు కావడం సత్తిరాజుకు ఆవేదనతో పాటు ఆశ్చర్యాన్నీ, ఆగ్రహాన్నీ కలిగించింది. రాత్రి ఏడింటికి యిల్లు చేరిన సత్తిరాజు గంట గడిచినా యిందిర కనిపించక పోయే సరికి మంగమ్మ నడిగాడు. మధ్యాహ్నం వరకు ఇందిర ఇంట్లోనే వుందనీ, తను చిన్న కునుకు తీసిన తర్వాత ఆమె కనిపించలేదనీ మంగమ్మ సంజాయిషీ చెప్పింది. ముసల్దాన్ని సత్తిరాజు నోటి కొచ్చినట్టు తిట్టాడు. ఆమె పేదరికం అన్నిటినీ సహించింది. సత్తిరాజు శేఖరం సహాయంతో ఇందిర కోసం వూరంతా గాలించినా ఆమె జాడ లేదు!

వయసొచ్చిన ఆడపిల్ల ఎవరితోనైనా లేచి పోవాలి లేదా ఏ దుండగులో కిడ్నాప్ చేసి వుండాలి. లేదా ఏ సాధువులో భైరాగులో నోరుకట్టి తీసుకొని పోవాలి- ఇంతకంటె ఇందిర అదృశ్యం కావడానికి కారణాలేం కనిపించలేదు సత్తిరాజుకి. కాని తనకు తెలిసినంత వరకు ఇందిరకు ప్రేమికులెవరూ లేరు. ఇందిరతో పాటు ఆ వూళ్ళో మరోమగాడు అదృశ్యం కాలేదు కూడా. పగటి పూట ఇందిరను ఎత్తుకుపోయే ప్రత్యర్థులూ తనకి లేరు. భైరాగులకు చిక్కే అమాయకురాలు కాదు ఇందిర. ఎంత తల బద్దలు కొట్టుకున్నా ఇందిర మాయంకావడానికి కారణం అవగతం కావడం లేదు సత్తిరాజుకి. రాత్రంతా కంటి మీద కునుకులేదు. తెల్లవారినా ఇందిర రాకపోయేసరికి అతని ఆదుర్దా అధికమయింది. ఉదయం పదిగంటల వరకు చూసి పోలీసు కంప్లైంటు యిచ్చాడు. పత్రికల్లో ఇందిర ఫొటోతో సహా ప్రకటన యిద్దామనే ఆలోచన వచ్చింది. శేఖరంతో సంప్రదించాడు.

"మావయ్యా. ఇందిర పసిపాప కాదు. పద్దెనిమిదేళ్ళ పిల్ల కనిపించడం లేదనేసరికి జనం అపార్థం చేసుకోవడం ఖాయం. పత్రికల్లోగాని, రేడియోలో గాని ప్రకటించడం చేతులారా అప్రతిష్ఠ తెచ్చుకోవడమే. పోలీసులతో పాటు మనం కూడా శక్తి వంచన లేకుండా వెతుకుదాం గానీ ప్రకటన ప్రయత్నాలొద్దు".

శేఖరం సలహా సత్తిరాజుకీ నచ్చింది. ఆ సమయంలో శేఖరం ఆపద్బాంధవుడిలా కనిపించాడు. ఆపద సత్తిరాజును బలహీనుణ్ని చేస్తోంది.

"ఒరేయ్ శేఖరం – నువ్వు ఇందూ ఎవరితోనైనా కలిసి తిరగడం చూశావురా?"

"ఛ! ఛ! ఇందూ నిప్పులాంటి పిల్ల. ఇలాంటి అనుమానం నీకెందుకొచ్చింది మావయ్యా?"

"నా మనస్సు పరిపరి విధాల పోతోంది. వయస్సులో వున్న పిల్ల ఇలా మాయమయ్యిందంటే ఏ మచ్చా లేకుండా తిరిగి యింటి కొస్తుందంటావురా?"

"మావయ్యా, ఇందూ మీద నాకా నమ్మకం వుంది. ఒకవేళ నువ్వనుకున్నట్టు ఇందూకేమైనా జరిగినా – అది ఆమె తప్పుకాదు. నీకభ్యంతరం లేకపోతే ఇందూకి జరగకూడని దేమైనా జరిగినా తనని పెళ్ళి చేసుకోవడానికి నేను సిద్ధంగా ఉన్నాను."

"శేఖరం!" మబ్బుల్లో మెరుపులా అంత విచారం లోనూ సత్తిరాజు కళ్ళు ఆనందంతో మెరిశాయి.

"నిజం మావయ్యా ఇందూ లాంటి భార్య దొరకడం అదృష్టం."

"శేఖరం. నీ ఔదార్యం నాకళ్ళు తెరిపించింది. నువ్వు అన్నివిధాలా యోగ్యుడివి. ఇందూతిరిగి వస్తే చాలు నీకిచ్చి పెళ్ళి చేస్తాను – సరేనా?"

"ఇందూ తప్పకుండా వస్తుంది. ఆ నమ్మకం నాకుంది" శేఖరం ఆశాభావం సత్తిరాజుకి ఆనందంతో పాటు కించిత్ అనుమానాన్ని కూడా కలిగించింది.

★ ★ ★ ★ ★

శేఖరం అన్నట్టుగానే ఇందిర తిరిగివచ్చింది. మర్నాడో మూడో నాడో కాదు. వారం రోజుల తర్వాత. ఆమె ఇక కనిపించదని నిరాశ చేసుకొని నీళ్ళొదులుకొన్న తర్వాత– ఓ ఉదయం బస్స్టాండ్ నుంచి రిక్షాలో యింటికొస్తున్న ఇందిరను చూసి జనం ఆశ్చర్య పోయారు. కొంతమంది వచ్చి పరామర్శించారు. ఇందిర అందరికీ నవ్వుతూ సమాధానం చెప్పింది.

"నేను మా స్నేహితురాలింటికి వెళ్ళాను– మా నాన్న అనవసరంగా కంగారు పడ్డాడు. అంతే" అని. జనానికి సత్తిరాజు సంగతి బాగా తెలుసు గనుక ఎవరూ ఇందిరను శంకించలేదు. సత్తిరాజుమాత్రం ఆమెననుమానించక పోలేదు. అందరూ వెళ్ళిపోయిన తర్వాత లోపలకు పిల్చి నిజం చెప్పమని నిలదీసి అడిగాడు. ఇందిర తొణకలేదు.

"నిజమే నాన్నా. నాకు స్కూల్లో శైలజ అనే స్నేహితురాలుండేది గుర్తుందా? దాని భర్తకి స్టేట్స్‌లో ఉద్యోగం. ఆ రోజు బస్స్టాండ్‌లో పత్రికలు కొంటున్న నన్ను చూసి తనుకూడా వాళ్ళూరు రమ్మని పట్టు బట్టింది. వాళ్ళది అమలాపురం– మళ్ళీ ఎపుడు కలుస్తామో, ఈ వారం రోజులు కోనసీమ అందాల్ని కలిసి ఎంజాయ్ చేద్దామని – ఎంత మొత్తుకున్నా వినకుండా కట్టు బట్టలతో తీసుకొని పోయింది. నీకీ విషయం రాస్తే వచ్చి అక్కడ రభస చేస్తావనే రాయలేదు భయంతో. ఈ రోజు వాళ్ళు స్టేట్స్ వెళ్ళిపోతున్నారు.....!!"

"లేకపోతే మరోవారం వుందువేమో. ఆడపిల్లవన్న భయం లేకుండా బలాదూరుగా తిరిగొచ్చావన్న మాట. జనం ఏమనుకుంటారో అనే జ్ఞానం వుందా నీకు?".... సత్తిరాజు నిప్పులు చెరిగాడు.

"నాన్నా! నీ కూతుర్ని..... " ఆమె కళ్ళు వర్షించాయి. అతను చల్లబడ్డాడు.

"ఇందూ, జరిగిందేదో జరిగి పోయింది. ఇంకెప్పుడూ నాతో చెప్పకుండా యిల్లు

విడిచిపెట్టకు. త్వరలో ఓ మంచి సంబంధం చూసి నీకు మూడుముళ్ళు వేయించేస్తే నా బాధ్యత తీరిపోతుంది".

దుఃఖం ఆపుకోలేని ఇందిరను మంగమ్మ అనునయిస్తోంది.

★ ★ ★ ★ ★

సత్తిరాజు ఇందిరకు వేరే సంబంధాలు చూస్తున్నాడనే వార్త శేఖరానికి అశనిపాతమయ్యింది. ఆవేశాన్ని ఆపుకోలేక సత్తిరాజు ఎదుటపడి అడిగేశాడు.

"నే విన్నది నిజమేనా మావయ్యా?!"

"నువ్వు విన్నదేదో చెపితే నిజమోకాదో నేను తర్వాత చెప్తాను". గోరుతో చుట్టనుసి రాలుస్తూ తాపీగా సమాధానం చెప్పాడు సత్తిరాజు.

"అదే.... ఇందిరకు పై సంబంధాలు చూస్తున్నావని...."

"మరి పైసంబంధాలు చూడక ఎవరికిమ్మంటావురా?"

"ఇందిర తప్పిపోయినపుడు నువ్విచ్చిన మాట...."

"ఓహ్... అదా? - అప్పుడేదో ఆపదలో వుండి మతి స్థిమితం లేకుండా అన్నమాట



నిజమనుకున్నావా? అయినా ఇందిర కేమయినా జరిగితే నీకిద్దామనుకున్నా గాని అటువంటి దేమీ జరక్కుండానే బంగారం లాంటి పిల్లను నీకిచ్చి కట్టబెట్టమంటావా? ఆశకు అంతుండాలి. నువ్వెక్కడ? ఇందిరెక్కడ? అసలు ఇలా అడగడానికి నీకెన్ని దమ్ములురా?"

సత్తిరాజు వైఖరికి విస్తుబోయాడు శేఖరం. మారు మాట్లాడకుండా తల వంచుకొని వెళ్ళిపోయాడు. వెళ్ళినవాడు ఊరుకోలేదు. అటునుంచి నరుక్కొని రావాలనుకున్నాడు. సత్తిరాజు లేని సమయం చూసి ఇందిరను కలుసుకున్నాడు.

"ఇందూ..... నిన్నోమాట అడుగుతాను. ఏమీ అనుకోవుకదా?" నిజానికా ప్రశ్న ఏవైనా అనుకొనేలాగేవుంది.

"అడుగు". ఇందిర ముక్తసరిగా జవాబు చెప్పింది.

"నేనంటే నీకిష్టమేగా?"

"ఇష్టం సంగతి తెలీదుగాని అయిష్టం మాత్రం లేదు".

"థాంక్స్. ఆమాత్రం దయచాలు. నువ్వంటే

మాత్రం నాకు చాలా యిష్టం. నువ్వు వారం రోజులు వూళ్ళోలేనప్పుడు మావయ్య కంగారుపడుతుంటే – నీకేమైనా జరిగినాసరే పెళ్ళి చేసుకొనేంత ఇష్టం వుందని మావయ్యతో అప్పుడే చెప్పాను. కాని మావయ్య ఇపుడు మాట తప్పుతున్నాడు. అందువల్ల నువ్వోసాయం చెయ్యాలి ఇందూ...."

"ఏవిటి?"

"నీకు అప్పుడు జరక్కూడనిది జరిగిందని మావయ్యతో అబద్ధం చెప్పాలి. అప్పుడు నిన్ను నాకిచ్చి పెళ్ళి చేస్తాడు మావయ్య."

"నేనంటే నిజంగా నీకంత యిష్టమా బావా?"

"ఇష్టమనే పదం సరిపోనంత యిష్టం. నిన్ను మనసారా ఆరాధిస్తున్నాను. నిన్ను పువ్వుల్లో పెట్టి....."

"దండకం చాలు..... ఒక వేళ నేను నిజంగా చెడిపోయాననుకో. అయినా నన్ను పెళ్ళి చేసుకుంటావా?"

"నన్ను పరీక్షిస్తున్నావా? నువ్వలాంటి దానవుకాదు....."

"ఒకవేళ పరిస్థితుల ప్రభావం వల్ల అలా జరిగిందనుకో. అప్పుడు కూడా నువ్వు నన్ను......."

"పెళ్ళి చేసుకుంటాను. సరేనా? మరి మావయ్యతో అబద్ధం చెపుతావా?"

"కాదు. నిజమే చెపుతాను. నేనిదివరకు చెప్పింది అబద్ధం. నేను స్నేహితురాలితో కలిసి కోనసీమ వెళ్ళలేదు. ఓ కలం స్నేహితుణ్ని నమ్మి మోసపోయాను. అతనో రచయిత. కాకినాడ ఉపన్యాసానికి వెళ్తూ నన్ను మనూరి బస్స్టాండ్ దగ్గర కలుసుకొమన్నాడు. నన్ను చూసి ప్రలోభ పెట్టి తనతో తీసుకుపోయాడు. నేను సర్వస్వం కోల్పోయిన తర్వాత తెలిసింది– అతను వివాహితుడని. నిజం తెలిస్తే జనం ఉమ్మేస్తారని స్నేహితురాలి కథ చెప్పి అందర్ని నమ్మించాను. కాని నాన్న పెళ్ళి ప్రయత్నాలు చేస్తున్నాడని కుమిలి పోతున్నాను. నేను కాబోయే భర్తను జీవితాంతం మోసం చేస్తూ నటించలేను. నీలాంటి సహృదయుడు నిజం తెలిసి కూడా నన్ను యిష్టపడి పెళ్ళి చేసుకొంటే గతాన్ని పీడకలగా మర్చిపోయి జీవితాన్ని దిద్దుకుంటాను. నాన్నతో జరిగింది యధాతధంగా చెప్పేసి నీతో...... " కృతజ్ఞతా భావంతో ఆర్ద్రమైన కళ్ళు తెరిచేసరికి శేఖరం అక్కడ లేడు!

* * * * * * *

తర్వాత శేఖరం తారసపడినప్పుడు ఆలోచించుకోవడానికి వ్యవధి కావాలన్నాడు– వారం రోజులు కాదు. పదిరోజులైనా శేఖరం తన నిర్ణయం చెప్పలేదు సరికదా– జనం తనను చూసి కొత్తగా గుసగుసలు పోవడం ఇందిరకు ఆశ్చర్యాన్ని, అసహ్యాన్ని కలిగించింది. అదే సమయంలో సత్తిరాజు ఇందిరను పిల్చి ఓ 'శుభవార్త' చెప్పాడు.

"ఇందూ. రేపు విజయనగరం నుంచి నిన్ను చూడ్డానికి పెళ్ళివారొస్తున్నారమ్మా. అబ్బాయి ఎంత అందగాడో అంత బుద్ధిమంతుడు. నువ్వు అదృష్టవంతురాలివమ్మా."

సత్తిరాజు ఆశించినట్టు ఇందిర మొహంలో ఎలాంటి సంతోషం వ్యక్తం కాలేదు. తెల్లవారే సరికి ఇందిర మళ్ళీ అదృశ్యమయ్యింది.

ఈ సారి సత్తిరాజుకి ఎవరూ చెప్పకుండానే కొంత సంగతి అర్ధమయ్యింది. ఇదివరకటిలా గాబరాపడి గోల చేసుకోలేదు. పెళ్ళివారికి మాత్రం అమ్మాయి యింట్లోకి రావడానికి వీల్లేనందువల్ల పెళ్ళి చూపులు వాయిదా వెయ్యమని ఫోను చేసేశాడు. వారం రోజులు తిరక్కుండానే సత్తిరాజుకి ఇందిర నుంచి ఓ వుత్తరం వచ్చింది.

ప్రియమైన నాన్నకి,

ముందుగా క్షమించమని వేడుకొంటున్నాను. నేను మీతో అబద్ధం చెప్పాను. నేను కలం స్నేహంతో ఓ రచయితను నమ్మి మోసపోయాను. అంతా జరిగి పోయిన తర్వాత అతనికిదివరకే పెళ్ళయిందనీ, రచయితగా తనకున్న గ్లామర్తో అమ్మాయిల జీవితాలతో ఆడుకోవడం అతని కలవాటనీ తెలిసింది. అసహ్యించుకొచ్చేసాను. మీరందరూ నా మీద నమ్మకంతో నేను చెప్పింది నమ్మినా జీవితాంతం నటిస్తూ భర్తకు ద్రోహం చెయ్యడం చేతకాక నేనీ నిర్ణయం తీసుకున్నాను. ఆ మోసగాడి దగ్గరే రెండో భార్యగా అయినా బ్రతుకుదామని వెళ్తున్నా. జరిగిన తప్పులో నాకూ భాగం వుందని అతనిపేరు బయటపెట్టటం లేదు మీరు నన్ను మర్చిపొండి. నేను చనిపోయినట్టే భావించి అలాగే సమాజానికి చెప్పి నాకు తిలోదకాలు వదిలెయ్యండి.

నీ కడుపున చెడబుట్టిన --
ఇందిర.

* * * * *

"..... ఇదీ నాకథ..... పాత్రలు మాత్రం పేర్లు మార్చి చెప్పాను" సమీర చెప్పడం ముగించి మధుబాబు కేసి చూసింది. అతడామె నీలికళ్ళ కేసి తదేకంగా చూస్తున్నాడు.

ఆమె జడలో మల్లెపూలు.... గదిలో 'సంక్రాంతి' అగరొత్తులు..... అతని దుస్తుల నిండా "మై ఛాయిస్" స్ప్రే గదినిండా వెదజల్లుతున్న






# అమృతాంజన్ గ్రైప్ వాటర్




## పాప ఆరోగ్యానికి,
## సంతోషానికి దివ్యామృతం

అజీర్ణం, వాయువు, కలతనిద్ర, వాంతులు, విరేచనాలవంటి బాధలు వెంటనే తగ్గిపోతాయి.

ఆకలి, జీర్ణశక్తి బాగా వుంటాయి. పాపాయి ఆరోగ్యం బాగుపడుతుంది.

**అమృతాంజన్ లిమిటెడ్**
42-45, లజ్ చర్చ్ రోడ్డు,
మద్రాసు 600 004

**Amrutanjan Limited** 

753-T(

## ఇ'వేమన' పద్యాలు

## తీరని ఆకలి




బాల్యమందు తనకు పాలపై ప్రేమచే
తల్లినపుడు చూచి తనయుడేడ్చు
తనదు పనులు తీరి తనయుని ముద్దాడు
విశ్వదాభిరామ వినురవేమ

పరిమళాలు ఆగది 'వాతావరణాన్ని' తెలియ జేస్తున్నాయి.

"సమీ...... మీ వృత్తిలో నీకంటి అందమైన వాళ్ళను చాలా మందిని చూశాను. కాని నీ అంత హృదయ సౌందర్యం వున్నదాన్ని మాత్రం నేను చూడలేదు. అసలు "సమీర" అనే పేరు వినగానే అంత అందమైన పేరు పెట్టుకున్న నిన్ను చూడాలని ఉవ్విళ్ళూరాను.

నీతో మాట్లాడిన తర్వాత నీ సాహిత్య పరిజ్ఞానం నాకు ఆశ్చర్యం కలిగించింది. బుచ్చిబాబు 'అమృతం' పాత్ర గురించీ, చలంగారి 'రాజేశ్వరి' గురించీ నువ్వు మాట్లాడుతుంటే నాకు నోట మాట రాలేదు. శ్రీశ్రీని తిలక్‌ని అప్పగిస్తుంటే – నీ అంతటి

## మనసే ఒక శాపం

చదువు సంస్కారం వున్న స్త్రీ ఈ వూబిలో కూరుకు పోడానికి ఏదో బలమైన కారణం వుంటుందని ఊహించాను. నీ కథ తెలుసుకోవాలనే ఆత్రుత నన్ను నిలబడనివ్వలేదు.... నిన్ను బాధపెట్టి నీ కథ చెప్పించాను. నన్ను మన్నించు" మధుబాబు ఆమె రెండు చేతులూ పట్టుకొన్నాడు.

"మీలాంటి సహృదయులకు చెప్పుకోవడం వల్ల నా బాధ ఉపశమించినట్టుంది. మధుబాబుగారూ, వృత్తి పరంగా ఎందరి చేతుల్లోనో నలిగి పోయే నేనంటే మీ కసహ్యం కలగడం లేదూ?".....

"లేదు సమీ.... నీ నిజాయితీ నన్ను ఆకర్షించింది. నీ కథ విన్న తర్వాత నీ మీద అభిమానం రెట్టింపయ్యింది. నువ్వంగీకరిస్తే నిన్నీ చెరనుండి విడిపించి నిన్ను నాదాన్ని చేసుకుంటాను".

"మధుబాబూ..... మళ్ళీ నన్ను మభ్యపెట్టకండి. ఇలా ఆశపెట్టిన వాళ్ళను నేను నా జీవితంలో శేఖరం మొదలుకొని చాలమందిని చూశాను."

"కాదు సమీ.... నన్ను నమ్ము. నేనే ఆ జాబితాలో ఆఖరివాణ్ణి. నీ జీవితంలో నిజమైన మధుమాసం ఇప్పటి నుంచే ప్రారంభమవుతుంది."

"నేను అదృష్టవంతురాల్ని. నా గత చరిత్రను మర్చిపోయి నన్ను ప్రేమించే వ్యక్తి లభించకే నాజీవితాన్ని బలిపెట్టాను. నన్నర్థం చేసుకొన్న మీలాంటి దేవుడు....."

"పొగడ్తలు చాలు. శారీరక సుఖం కోసం సానికొంపల వెంట తిరిగే నేను దేవుణ్ణా? ఆత్మవంచన పరవంచన చేతకాక పండంటి జీవితాన్ని నేలపాలు చేసుకున్న – హృదయ సంస్కారం ఉన్న నువ్వే దేవతవు. నేను పది రోజుల్లో డబ్బు చూసుకొని నిన్ను విడిపించి తీసుకెళ్తాను. అప్పట్నుంచీ జీవితం పొడుగునా పరస్పరం పొగుడుకుందాంలే....." ఆమె అధరాల్ని స్పృశించాడు– మధుబాబు.

"మధుబాబూ" సమీర లతలా అతణ్ని అల్లుకు పోయింది.

★ ★ ★ ★ ★ ★

పదిరోజులు ... పక్షం .... నెల.... రెండు నెలలు గడిచాయి. మధుబాబు మళ్ళీ సమీరకు కనిపించలేదు. ప్రోషిత భర్తృకలా సమీర అతని కోసం ఎదురు చూసింది. అతణ్ని కలవడానికి ఆమె చేసిన ప్రయత్నాలు వ్యర్థమయ్యాయి. అతను పని చేస్తున్నట్టు చెప్పిన ఆఫీసులో మధుబాబు అనే పేరు గల వ్యక్తి ఎవరూ లేరట!

సమీరకు పగలంతా పత్రికలే కాలక్షేపం. ఆ వారం సాహితీ సుధ వారపత్రికలో కథల పోటీ ఫలితాలు, బహుమతులు పొందిన కథలు వచ్చాయి. మొదటి బహుమతి పొందిన కథ ప్రారంభమే తనను ఆకట్టుకొంది. పూర్తిగా చదివేసరికి సందేహం తీరిపోయింది. అది తన కథే.... మధుబాబుకి మాత్రమే చెప్పిన కథ.... రచయిత పేరు చూసింది – అంశుమాలి!

'అంశుమాలి' మధుబాబు కలం పేరయి వుండాలి. మధుబాబు తనను మోసగించిన మరో మగాడు.

తను తండ్రితో చెప్పిన అబద్ధానికి కట్టుబడి వుంటే – కనీసం కాబోయే భర్తను మోసం చెయ్యగలిగితే .... తన జీవితం మరోలా వుండేది. తన నిజాయితీ తనను శపించింది...

'మనసు గతి యింతే..... మనిషి బ్రతుకింతే... మనసున్న మనిషికీ సుఖములేదంతే' ఆత్రేయ గారి పాట సమీర చెవుల్లో మార్మోగుతోంది. □




ఆంధ్రప్రదేశ్‌లోని తెలంగాణాలో కాకతీయ మహారాణి రుద్రమ పుట్టి పెరిగిన గడ్డ, ఓరుగల్లు – దానికొకింత దూరములో ప్రకృతిమాత ఒడిలో పరవశించే పల్లె – అదే "పోసనపల్లె".

ఆ గ్రామములో 1945 ఆగష్టు 2వ తేదీన జన్మించిందో బాలిక. ఆమె గొప్ప క్రీడాకారిణి అవుతుందని యెవరూ 'కలలుకనలేదు సరికదా, కనీసం కాంక్షించనైనాలేదు. అయినా ఆ బాలిక పెరిగి పెద్దదై ప్రముఖ క్రీడాకారిణియై, యావద్భారత ఖ్యాతినందింది. అత్యుత్తమ క్రీడా అవార్డయిన "అర్జున్" అవార్డుని అందుకొని ఆంధ్రమహిళా లోకానికి అపూర్వగౌరవ మర్యాదలు కొనితెచ్చింది. ఆమే శ్రీమతి ముళినీరెడ్డి.

కాకతీయుల కదన పటిమను కలబోసుకొని



అర్జున్ అవార్డుగ్రహీత శ్రీమతి ముళినీరెడ్డిని గౌరవిస్తున్న సందర్భంగా వేదికపై ప్రసంగిస్తున్న ప్రొద్దుటూరు 'రాయలసీమ కాలేజ్ ఆఫ్ ఫిజికల్ ఎడ్యుకేషన్' ప్రిన్సిపాల్ డా. పరమేశ్వరరామ్.

పుట్టిన ముళినిరెడ్డి పోసనపల్లెలో బాల్యం గడిపి. భాగ్యనగర్‌లోని 'రోసరీ కాన్వెంటు'లో మెట్రిక్ వరకు చదివింది. చదువుతో బాటు సాహసం చెయ్యాలన్నదీ బాలిక కోరిక. పదిమందిలో ప్రత్యేకత సంతరించుకోవాలన్నదే ఈమె దీక్ష – అందుకే క్రీడారంగాన్ని, తన అభిమాన హాబీగా యెన్నుకొని "వాలీబాల్" క్రీడలో ప్రత్యేకతను సంతరించుకున్నది.

ఏకాగ్రత, పట్టుదలలతోపాటు అవిరళ 'కృషి' ఆమెను 'విశిష్ట'వ్యక్తిగా మార్చాయి. క్రీడాంగణం ఆమెకు జోడి. క్రీడ ఆమెకు ఆరవప్రాణం. మొగ్గగా వున్నపుడే నిగ్గుదేరిన 'ముళిని' పువ్వై వికసించేనాటికి. వాలీబాల్ క్రీడలో నిష్ణాతురాలయింది. ఆ పువ్వు శలభం హైదరాబాదు హద్దులుదాటి జాతీయ రంగములో ప్రవేసించింది. అప్పుడు హైదరాబాదులోని నారాయణగూడలోని 'రాజాబహదూర్ వెంకటరామారెడ్డి మహిళా కళాశాలలో ప్రవేశించింది. బి. ఏ. పరీక్షలో ఉత్తీర్ణురాలైంది. ఏం చదివినా, ఏం చేసినా 'ఆటలు' ఆమెకు ఆరవప్రాణంగానే నిలిచిపోయాయి.

వాలీబాల్ క్రీడాకారిణికి శరీర వ్యాయామంతో పాటు, ఏకాగ్రత, శ్రద్ధలు పుష్కలంగా వుండాలి. ముళినీరెడ్డి అంటే "పవర్ పాక్డ్" మువింగ్ బ్యాటరీ అనేవారు. 'షాట్' కొడితే 'క్యానన్ షాట్' అనేవారంతా. పాస్‌చేయడంలోనే 'ముళినీరెడ్డి పాయింట్లని "క్యాష్"చేయగల నేర్పరి.

ఆంధ్రప్రదేశ్‌లో వాలీబాల్ టీములో వరుసగా 12 ఏండ్లు ఆడిన ఘనత ఆమెది. ఆమె పాల్గొన్న ఆటల్లో, మన మహిళాజట్టు నాలుగుసార్లు ప్రథమస్థానాన్ని, మరో నాలుగుసార్లు ద్వితీయ స్థానాన్నిపొంది, భారతీయుల దృష్టి నాకర్షించింది. 1964లో ఉస్మానియా విశ్వవిద్యాలయం జట్టులో ఆడింది.

అవార్డులు, రివార్డులు, ట్రోఫీలు, మెడల్సు, యోగ్యతాపత్రాలు కొల్లలుగా కురవసాగాయామెపై. "ఎవరీ తెలుగు వనిత" అని పొరుగు రాష్ట్రాల క్రీడాకారులు చూడసాగారు.

1963లో జరిగిన ఒలింపిక్ క్రీడల్లో మనదేశ స్త్రీల వాలీబాల్ జట్టులో ప్రధాన పాత్ర వహించిన 'ముళిని' 1970లో పారిస్ విశ్వవిద్యాలయం జట్టుతో జరిగిన పోటీల్లో 'కెప్టెన్'గా తన గురుతరబాధ్యత నెరవేర్చిన ఈమెను, భారత క్రీడా సంఘం 'క్వాలిఫైడ్' రెఫరీగా ఎన్నికచేసి గౌరవించింది.

1974లో దేశములో క్రీడాకారులకిచ్చే అత్యుత్తమ "అర్జున్ అవార్డు"ను పొందిన తొలి వాలీబాల్ ఆంధ్రక్రీడాకారిణి ముళినీరెడ్డి. 1982లో ఢిల్లీలో జరిగిన తొమ్మిదవ ఆశియాక్రీడల్లో పాల్గొన్న మన జట్టుకీమె "మేనేజరు"గా వ్యవహరించడము ఆంధ్ర మహిళలకు గర్వకారణము. 1986లో దక్షిణ కొరియాలోని 'సియోల్'లో జరిగిన పదవ ఆసియాక్రీడలకు మన జట్టుతో 'జాయింట్ ఛీఫ్ - డి - మిషన్'గా వెంబడించిందీమె. 1987లో "గ్రీస్"లో జరిగిన (జూలై 1 నుండి 16 వరకు) "ఒలింపిక్ సాలిడారిటీ కోర్స్"కై ఈమె ఏథెన్స్ నగరం వెళ్ళివచ్చింది!

తన అమూల్య జీవితాన్ని క్రీడారంగానికి అంకితం చేసిన ఈమె, ఉత్సాహవంతులైన యువతులకు 'వాలీబాల్'లో శిక్షణనిస్తూనే, స్టేట్‌బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్'లో ఆఫీసర్‌గా ఉద్యోగం నిర్వహిస్తున్నారు. శ్రీమతి ముళినీరెడ్డి భారత మహిళాలోకంలో ఉజ్వలంగా ప్రకాశిస్తున్న మహిళామణి. ఆమె అడుగుజాడలు ఆంధ్ర యువతులకు అనుసరణీయము.

(ఈ వ్యాస రచనకు స్ఫూర్తి కలిగించిన ప్రొద్దుటూరు వ్యాయామకళాశాల ప్రిన్సిపాల్ డా. పరమేశ్వరరామ్‌గారికి కృతజ్ఞతలతో).

– వి. విజయలక్ష్మీరెడ్డి

# సహనానికి పరీక్ష



కుందనపు బొమ్మలాంటి కుముద చాపమీద తలవాల్చుకుని కూర్చుంది.

ఆమె ఎదురుగా కుర్చీలో కూర్చుని వున్నాడు శ్రీకర్. "నేను ఆమెతో పర్సనల్‌గా మాట్లాడాలి" తల్లి చెవిలో చిన్నగా చెప్పాడు శ్రీకర్.

అతను చిన్నగానే చెప్పినా కుముద తండ్రికి ఆ మాట అర్థం అయింది.

క్షణంలో ఆగదిలో కుముదతప్ప అందరూ లేచి వెళ్ళిపోయారు.

"ఇలా చూస్తారా!" శ్రీకర్ మృదువుగా అడిగాడు. కుముద కళ్ళు ఎత్తింది. సోగకళ్ళు కాంతితో రెపరెపలాడాయి.

"వాళ్ళందరూ వుంటే మీరు నన్ను సరిగ్గా చూడరని వాళ్ళను పంపించేసాను. ఇప్పుడు నన్ను చూడండి. నేను మీకు నచ్చితేనే మన పెళ్ళి జరుగుతుంది" అన్నాడు.

కుముద చూపులు ఒక్కసారి అతని ఆపాదమస్తకం పరిశీలించి కిందకు వాలాయి.

శ్రీకర్‌ది మంచి పర్సనాలిటీ. పెదవులపై సిరి ఉట్టిపడే నవ్వు.

కుముదని కూడా అందమైనవాళ్ళలో లెక్కకట్టొచ్చు. ఇద్దరూ పక్కపక్కని నిలబడితే మేడ్ ఫర్ ఈచ్ అదర్‌లా వుంటారు.

కుముద తండ్రి ఒక సినిమాహాల్ ప్రొప్రయిటర్. సాంప్రదాయమైన కుటుంబంవాళ్ళది. కుముద కాక యింకా యిద్దరు మగపిల్లలు వున్నారు. కుముదకు వాళ్ళు తమ్ముళ్ళు.

శ్రీకర్ ఊటీలో మంచి జాబ్ చేస్తున్నాడు. జీతం కూడా ఎక్కువగానే వస్తుంది.

కుముద, శ్రీకర్ ఒకరి కొకరు నచ్చారు. శ్రీకర్ తల్లిని పిలిచాడు.

అందరూ బిలబిలా వచ్చేసారు.

కుముద, శ్రీకర్ పెళ్ళికి లగ్నం నిర్ణయించారు. ఆ తరువాత నెలలో ఆ యిద్దరి పెళ్ళివైభవంగా జరిగిపోయింది.

అల్లుడికి, వియ్యాలవారికి కోరకముందే కట్నాలు, లాంఛనాలు కొరతలేకుండా జరిపించాడు కుముద తండ్రి.

కుముదకు కోరినన్ని చీరలు వచ్చాయి. ఏ చీరైనా సినిమాస్టార్‌లా కట్టటం కుముదకు బాగా అలవాటు. పదిరోజులు శ్రీకర్ అత్తవారింట్లోనే వుండిపోయాడు.

కుముద స్వభావం అతనికి బాగా అర్థం అయిపోయింది.

కుముదకు పెంకెతనం, గర్వం, కోపం ఎక్కువ. ఏ విషయంలోనైనా తనమాటే వేదం అనే అహంకారం. అందరూ తన చుట్టుతిరగాలన్న అతిశయం ఎక్కువ.

శ్రీకర్ భార్య స్వభావం గ్రహించినా ఎరుగనట్టే వుండిపోయాడు. శ్రీకర్‌ది ఎవరితోనైనా కలసి మెలసి వుండాలనే తత్వం.

కుముద స్వభావం పూర్తిగా చుక్కెదురు. ఆమెను తను మార్చవచ్చులే అన్న ధైర్యంతో వున్నాడు. మరీ పెళ్ళి అయిన వెంటనే ఆమె మాటలని ఖండిస్తే చిన్నబుచ్చుకుంటుంది. ముందు ముందు ఆమెకు మంచీ – చెడూ విడమర్చి చెప్పాలన్న అభిప్రాయంతో వున్నాడు. కొత్తజంట కాబట్టి పదిరోజులు పదిక్షణాల్లా గడిపేశారు.

శ్రీకర్‌కు లీవ్ యిక రెండురోజులు మాత్రమే వుంది. ప్రయాణానికి సిద్ధంఅయ్యాడు. కుముదకూడా అతనితో ప్రయాణం అయ్యింది.

కొత్తకాపురానికి వెళ్తూ తన తల్లిని వెంట పెట్టుకెళ్ళాలని ఎప్పటినుండో శ్రీకర్ ఆలోచన.

"మీ అమ్మగారు వద్దు" కచ్చితంగా చెప్పేసింది కుముద.

"అదికాదు కుముదా! మా అమ్మకు నేను ఎప్పటినుండో మాటయిస్తున్నాను. నీకూ కొత్త. అమ్మవస్తే నాలుగురోజుల్లో అలవాటుపడతావు" నచ్చజెప్పబోయాడు.

"ఫరవాలేదు అలవాటుదేం వుంది. నేను ఎక్కడైనా ఎడ్జెస్ట్ కాగలను. మనం యిద్దరమే వెళదాం" పేచీపెట్టింది.

కొత్తభార్యని కఠినంగా శాసించలేక తల్లికే నచ్చజెప్పాడు.

"పోనీలే నువ్వు సుఖంగా వుండరా అంతేచాలు" నిర్లిప్తంగా అనేసింది ఆవిడ.

★ ★ ★

శ్రీకర్, కుముద ఊటీలో కాపురంపెట్టారు. కుముదకు అక్కడ చూపించాల్సిన ప్రదేశాలన్నీ చూపించాడు శ్రీకర్.

అవి చూపించిన నాలుగురోజులూ యింట్లో వంటపని పెట్టుకుంటే టైం అంతా వేస్ట్ అయిపోతుందని హోటల్‌లో నే భోజనం చేసేవారు.

ఆరోజు శ్రీకర్ కుముదను వంటచేయమన్నాడు. ఆరోజే అతను ఆఫీసుకువెళ్ళాలి.

"ప్లీజ్! ఈరోజుకు మీరే చేసుకోండి. ఇప్పుడు ఆఫీస్ టైం అయిపోతుందనే కంగారులో నేన సరిగ్గా చెయ్యలేను" గోముగా అడిగింది.

"వంటచేయటం నాకు అలవాటులేదు. నేన హోటల్‌లో చేస్తాను యివాళ్టికి. నువ్వు చేసుకు తిను" అని చెప్పి శ్రీకర్ ఆఫీసుకు వెళ్ళిపోయాడు.

సాయంత్రం ఆఫీస్ నుండి వచ్చాడు శ్రీకర్.

"ఉదయం వంటచేసుకున్నావా?" అడిగాడు.

"చేసుకున్నాను" తలవూపింది.

"ఇవాళ బైటకు ఎక్కడికీ వెళ్ళొద్దు. నీ చేతివంట తినాలి. ఏడుగంటలకల్లా నాకు భోజనంపెట్టేయి" అంటూ ఆర్డర్‌వేసాడు.

"మీరూ సాయం చేయండి" కోరింది.

"ఓ.కే" హుషారుగా అన్నాడు.

అంతలో శ్రీకర్ ఫ్రెండ్ రాకేష్ రావటంతో వాళ్ళప్రయత్నానికి అవరోధం కలిగింది.

కుముదను వంటచేసివుంచమని చెప్పి శ్రీక రాకేష్‌తో బైటకు వెళ్ళిపోయాడు.

కుముద అసహనంగా పళ్ళు కొరుక్కుంది.

శ్రీకర్ ఏడుగంటలతరువాత వచ్చాడు. డైనిం టేబుల్‌మీద అన్నీ సర్దింది కుముద.

శ్రీకర్ అన్ని డిష్‌లూ చూసాడు.

అన్నం గింజలుగింజలుగా వుంది. సరిగ్ ఉడకలేదు. కారెట్ ఫ్రైచేసింది. అందులో మసాల వేయలేదు. చప్పగావుంది. టమాటో చట్నీలో కార మండిపోతోంది.

"తినండి" కుముద పింగాణీ ప్లేట్‌లో అన్నం వడ్డించింది.

శ్రీకర్‌కు ఈ తిండి కంటే హోటల్‌లో భోజనమే బాగుందనిపించింది.

ముందుముందు తనే నేర్చుకుంటుందిలే అని అప్పటికి ఏమీ మాట్లాడలేదు.

"ఎలా వుందిసర్ మన వంట?" శ్రీకర్ తెచ్చిన కిళ్ళీ నములుతూ అడిగింది కుముద.

"చాలా బాగుంది" ఎగతాళిగా నవ్వాడు.

"సరిగ్గా చెప్పండి. దొంగమాటలు ఎందుకు?" చిరుకోపంగా అడిగింది.

"ఇవాళ మొదటిసారి కదా క్షమించేసాను. ఇంకొకసారి యిలాచేస్తే అప్పుడు చెప్తాను" సున్నితంగా కుముద చెంపమీద దెబ్బవేశాడు.

కుముద కోపంగా చూసింది.

* * *

కుముద ఊటీవచ్చి నెలరోజులు గడచిపోయాయి. ఈ నెల రోజుల్లో కుముద కొంచెంకూడా మారలేదు. తనకుతో చినట్టుగా వండటం, డైనింగ్‌టేబుల్‌మీద పడేయటం – శ్రీకర్ తినగలిగితే తినటం, తినలేకపోతే వెళ్ళిపోయి హొటల్‌లో తినటం.

తండ్రికి లెటర్ రాసింది. ఇక్కడ బోర్‌కొడ్తోంది టి. వి. కావాలంటూ. వెంటనే ఆమె తండ్రి టి. వి. నిమిత్తం పదివేల రూపాయలు పంపించాడు. అంతడబ్బుతో టి. వి. కొనటం శ్రీకర్‌కు యిష్టంలేదు. "కుముదా యిప్పుడు టి. వి. ఎందుకు? నీకు తెలుగు



నావెల్స్ తెచ్చిపెడుతున్నాను. ఆ పదివేలు బ్యాంక్‌లో ఫిక్సిడ్‌చేస్తే వడ్డీ వస్తుంది" నచ్చచెప్పబోయాడు. చురచురా చూసింది.

"మీరు సంపాదించిన డబ్బు అయితే బాధపడాలి. ఇది నా డబ్బు. నాకు తోచక చస్తున్నాను" అంటూ వాదం పెంచుకుంది.

చేసేదిలేక శ్రీకర్ ఆమెను వెంటతీసుకువెళ్ళి టి. వి. కొన్నాడు.

అక్కడనుండి కుముదకు టి. వి. చూడటం మీద శ్రద్ధ పెరిగిందికానీ, భర్తకు సౌకర్యాలు చేయటంమీద శ్రద్ధ పెరగలేదు.

కొత్తకాపురం ముచ్చటగా వుండాలన్న ధ్యాసే లేదు ఆమెకు. క్లబ్‌లో మెంబర్‌గా జేరింది. చక్కగా అలంకరించుకుని బైటకు వెళ్ళిపోయేది.

శ్రీకర్ ఆఫీస్ నుండి యింటికి వచ్చేసరికి తాళం ఎదురు అయ్యేది. వంటరిగా వుండేవాడు. కుముద రాగానే కేకలువేసేవాడు, కుముద తగ్గేదికాదు. ఇంట్లోపని చెయ్యటం నావల్లకాదు అని కచ్చితంగా చెప్పేసింది.

కుముద మాటలకు శ్రీకర్ నిర్ఘాంతపోయాడు. కుముదకు అత్తగారిఆరడిలేదు. మామగారి మందలింపులేదు. ఎందు కిలా ప్రవర్తిస్తోందో అతనికి అర్థంకాలేదు. రానురాను యింట్లో వుండటం అంటే కుముదకు భోర్‌కొట్టసాగింది. ఇంటో వున్నంతసేపూ శ్రీకర్‌తో ప్రతి విషయానికి పేచీపెట్టుకోవాల్సివస్తోంది.

ఫ్రెండ్స్ ఇళ్ళలో, సినిమా థియేటర్స్‌లో, క్లబ్‌లో కాలక్షేపమే బాగుంది.

శ్రీకర్ జీవితంలో అతి కష్టంగా సంవత్సరం గడచింది. శ్రీకర్ ఎన్నో ఊహలతో పెళ్ళి చేసుకున్నాడు. అవన్నీ కాలి బూడిద అయ్యాయి. పగలంతా ఆఫీస్‌లో గడపటం, ఆకలి అయితే ఏ హొటల్‌లో నో కడుపు నింపుకోవడం చేస్తున్నాడు.

కుముద యింటిపట్టున వుండటమే మానేసింది. తన చాకచక్యంతో అక్కడ మహిళామండలి ప్రెసిడెంట్ అయింది.

శ్రీకర్‌కు జీవితం నిస్సారం అయిపోయింది. అతనికి ధనానికి ఏమీ లోటులేదు. కాని ప్రేమ, ఆదరణకు దూరం అయిపోయాడు.

పూర్వంలా ఫ్రెండ్స్‌తో హుషారుగా తిరగటం మానుకున్నాడు.

అతనిది ఒకరితో చెప్పుకోలేని బాధ. ఎవరికైనా చెప్పినా భార్య చేతిలో చవట అని అతన్నే హేళన చేస్తారు. బాగా ఆలోచించుకుని కుముద

# సహనానికి పరీక్ష

ఇదీ వరస... కస

రాష్ట్రాలలో ఐ.ఎ.ఎస్.,ఐ.పి.ఎస్ లను తగ్గించాలని డిమాండ్ చేస్తున్నా

అక్కర లేదు సార్.. మా 'ట్రీట్మెంట్' భరించలేక...

ఇప్పటికే చాలామంది పొరుగు రాష్ట్రాలకు ట్రాన్స్ఫర్ పెట్టుకున్నారు..

కొత్తవాళ్ళు ఇక్కడికి రాకుంటున్నారు..

విషయాలు అన్నీ వివరంగా ఆమె తండ్రికి తెలియజేస్తూ లెటర్ రాసాడు. శ్రీకర్ మనసులోని అసహనం వల్ల మనిషి సగం అయ్యాడు.

మరో పదిరోజులు గడచిపోయాయి.

ఆ రోజు కుముద తండ్రి చంద్రరావు వచ్చాడు. కుముద తండ్రిని చూడగానే ఎంతో దిగులుపుట్టిన దానిలా ఏడ్చింది.

చంద్రరావు హృదయం కదలిపోయింది ఇంతకాలానికి కూతుర్ని చూసినందుకు.

"చూడండి డాడీ. విజయవాడ వెళ్దాం" అంటే ఆయన నన్ను ఒకసారికూడా తీసుకురాలేదు" వెక్కిళ్ళమధ్య భర్తమీద తండ్రికి రిపోర్ట్ చేసింది.

శ్రీకర్ ఆమె ఆరోపణలకు తెల్లబోయాడు. ఆమె ఒకటి రెండుసార్లు విజయవాడ వెళ్దాం అని అడిగినమాట వాస్తవమే. కానీ తనను విసిగిస్తోంది అనే కోపంతో తనే విజయవాడ తీసుకువెళ్ళటానికి యిష్టపడలేదు.

సంవత్సరం నుండి తనను అన్నివిధాలుగా విసిగించింది కాకుండా, ఎదురు తనమీద తండ్రికి రిపోర్ట్లు యివ్వటం చూస్తుంటే శ్రీకర్‌కు మతిపోయింది.

చంద్రరావు కూడా పూర్తిగా కూతురిపక్షానజేరి శ్రీకర్‌ను వంటరివాడిని చేసేశాడు.

శ్రీకర్ ఆఫీస్‌కు వెళ్ళిపోయాకా ఆయన కూతురికి అల్లుడు తనకు రాసిన లెటర్ చూపించాడు. అది చదివి కుముద మండిపడింది.

శ్రీకర్‌మీద చిలవలుపలవలు కల్పించి చెప్పి ఏడ్చి తండ్రి సానుభూతి పొందింది.

ఆ సాయంత్రం యింటికి వచ్చిన భర్తమీద విరుచుకునిపడింది.

శ్రీకర్‌కు మామగారిముందు ఎంతో చిన్నతనం అనిపించింది. అతని సహనం హద్దులుదాటింది. భార్య గురించి మొత్తం మరోసారి చంద్రరావుకు చెప్పాడు.

చంద్రరావు కుముదను గారాబంగా పెంచాడు. కూతురిమీద వల్లమాలిన ఆపేక్షతో అతనికి తప్పంతా శ్రీకర్‌దే అనిపించింది.

ఆయనకూడా శ్రీకర్‌మీద యుద్ధానికి కాలు దువ్వాడు.

"నీలాంటివాడి దగ్గర నా కూతుర్ని క్షణం కూడా వుంచకూడదు" అంటూ చంద్రరావు రంకెలువేసాడు.

"అలా అయితే ఆమెను తీసుకుపొండి" శ్రీకర్ హద్దులుమీరిన కోపంతో చెప్పేసాడు.

కుముదలో విచక్షణాజ్ఞానం నశించిపోయింది. విజయవాడ వెళ్ళిపోవాలనే నిర్ణయించుకుంది. శ్రీకర్ బైటకు వెళ్ళిపోయాడు.

చంద్రరావు, కుముద విజయవాడ వెళ్ళిపోవాలని తయారయ్యారు. పక్కింట్లో వున్నవాళ్ళు ఆ తండ్రీ కూతుళ్ళకి నచ్చజెప్పబోయారు.

"మీ సలహాలు అడగలేదు" కుముద కొట్టినట్టే మాట్లాడింది.

వాళ్ళు మౌనంగా వుండిపోయారు. వాళ్ళు కుముద భాగోతం రోజూ చూస్తూనేవున్నారు ఆమె అహంకారంతో దేవుడిలాంటి భర్తనూ, పచ్చని సంసారాన్ని వదులుకుని వెళ్ళిపోతోంది అని బాధపడ్డారు.

శ్రీకర్ తిరిగితిరిగి యింటికివచ్చాడు. అతను ఊహించినట్టే యింటికి తాళంపెట్టివుంది. కీస్ గుమ్మంమీద వున్నాయి. తండ్రీ, కూతురూ వెళ్ళిపోయారని అర్థం అయింది. తాళం తీసుకుని లోపలకు వచ్చాడు. ఇల్లంతా ఎంతో నిశ్శబ్దంగా వుంది.

కుముద వెళ్ళిపోయింది. ఇక యింట్లో అనవసర రగడ జరగదు అన్న ఆలోచన శ్రీకర్‌కు ఎందుకో తృప్తిగా వుంది. ఆమెతో కాపురంచేసిన సంవత్సరంలో శ్రీకర్ ఒక్కరోజు కూడా సుఖపడలేదు. ఇప్పుడు ఆమెలేకపోతే వచ్చే నష్టంలేదు అనిపించింది. కుర్చీలో వెనక్కివాలి ప్రశాంతంగా కళ్ళు మూసుకున్నాడు శ్రీకర్.

* * *

శ్రీకర్ జీవితంలో రెండు సంవత్సరాలు గడచిపోయాయి. కుముద శ్రీకర్ నుంచి విడాకులు పొందింది.

పావనికి పెళ్ళి అయిన ఆరు నెలలకే భర్త చనిపోయాడు.

ఆమె శ్రీకర్ ఆఫీస్‌లోనే ఉద్యోగం చేస్తోంది. శ్రీకర్ సహృదయంతో ఆమెను తన జీవితంలోకి ఆహ్వానించి, ఆమె జీవితంలో తిరిగి వెలుగులు నింపాడు.

ఇద్దరూ తిరుపతి పుణ్యక్షేత్రం దర్శించాలనుకుని ప్రయాణం అయ్యారు.

దేవస్థానానికి వెళ్ళే బస్‌లో కుముద కనిపించింది శ్రీకర్‌కు.

కుముద యిప్పుడు చిక్కి శల్యం అయివుంది. ఆమెవెంట ఆమె తమ్ముళ్ళు వున్నారు. మరో యిద్దరు ఆడవాళ్ళు వున్నారు. వాళ్ళు కుముద తమ్ముళ్ళ భార్యలు.

ఎంతో అహంకారంతో తన మాటే నెగ్గాలన్నట్టు వుండే కుముద యిప్పుడు తముళ్ళు, వాళ్ళ భార్యలకు ఒదిగిఒదిగి ప్రవర్తిస్తోంది.

శ్రీకర్‌ను చూడగానే కుముదకు తన అహంకారం గుర్తొచ్చి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. తండ్రి చనిపోయాడు.

దేవుడిలాంటి భర్తను దూరంచేసుకుని ఘనమైన కట్నాలుతెచ్చిన తమ్ముళ్ళ భార్యల కాళ్ళకింద జీవితాంతం పడివుండాల్సి వచ్చింది అనుకుని బాధపడింది.

"తను మూర్ఖంగా అతని సహనానికి పరీక్ష పెట్టింది. అందులో అతనే నెగ్గాడు. తను ఘోరంగా వోడిపోయింది." మూగ గారోదించింది. □




# ఈ సారి పుట్టిన రోజుకు మీనాకు అన్నిటినీ మించిన కానుకను ఇచ్చింది ఫెయిర్ అండ్ లవ్లీ.

ఈసారి పుట్టిన రోజుకు మీనాకు అన్నిటినీ మించిన కానుకను ఇచ్చింది ఫెయిర్ అండ్ లవ్లీ.

గత రెండు నెలలుగా మీనా ఈ రోజుకోసం ఎదురుచూస్తూ ఏర్పాట్లు చేసుకుంటోంది. ఆ ఏర్పాట్లలో ఫెయిర్ అండ్ లవ్లీ కూడా ఓ ప్రముఖ పాత్ర వహించిందనుకోండి. ఫెయిర్ అండ్ లవ్లీ సహజంగా, మృదువుగా పనిచేసి ఆమె ఎల్లప్పుడూ కలలు కంటున్న మెరిసే, నునుపైన వంటి ఛాయను ఆమెకు సమకూర్చింది. అందంగా ప్యాక్ చేయబడిన కానుకను అందిస్తూ రవి వెన్నెలను ఆస్వాదించే చకోరంలా మెచ్చుకున్నది ఆమెకు సమకూరిన ఆ పసిడి ఛాయనే. ప్రశాంతమైన ఆమె ముఖంలో ఓ చిరునవ్వు. ఇదే సమయంలో ఆమె హృదయంలో ఫెయిర్ అండ్ లవ్లీ పట్ల కృతజ్ఞతా గీతికల గానం.

మీనా లాగే మీరూ ఇతర్లు గుర్తించేలాంటి మెరిసే ఛాయను సమకూర్చుకోవచ్చు ఫెయిర్ అండ్ లవ్లీతో.

**ఓ ముఖ్యమైన వైజ్ఞానిక విజయం**

ఫెయిర్ అండ్ లవ్లీ... మీ వంటికి సహజమైన రీతిలో మెరుగైన ఛాయనివ్వడానికి దీనిలో వుంది



ఫెయిర్ అండ్ లవ్లీ వాడక ముందు



ఫెయిర్ అండ్ లవ్లీ వాడిన తర్వాత

ఓ సాటిలేని ఫార్ములా. ఇది ముఖ్యంగా రెండు విధాల పనిచేస్తుంది. ఒకటి, ఇది చర్మం అడుగున పనిచేసి



శరీరం స్వతహాగా లోలోనే నల్లబడటాన్ని అరికడుతుంది—ఇంకే క్రీమూ చెయ్యలేని తీరులో. రెండు, దీని డబల్ సన్‌స్క్రీన్ చర్య, నల్లబరిచే సూర్యకిరణాల నుంచి చర్మాన్ని కాపాడుతుంది. అంచేత 6 నుంచి 8 వారాల్లో పైకొచ్చే కొత్త చర్మ పొరలు మరింత మెరుగైన ఛాయ కలిగి వుంటాయి. మీరు ఫెయిర్ అండ్ లవ్లీని నియమానుసారంగా రోజుకు రెండుసార్లు ఉపయోగిస్తూంటే, మీ వంటి ఛాయ ఎంతో అందంగా, మృదువుగా, సహజమైన మెరుపుతో అలాగే నిలిచి వుండటం ఖాయం.

**ఉపయోగించే పద్ధతి**

ముఖం, మెడ, చేతులు కడుక్కున్నాక, వాటి మీద ఫెయిర్ అండ్ లవ్లీ క్రీము చుక్కచుక్కలుగా రాయండి. ఇప్పుడు వేళ్లతో ఎగువకు రుద్దుతూ నెమ్మదిగా మాలిష్ చేయండి. ఫెయిర్ అండ్ లవ్లీ పనిచేయడం ప్రారంభించగానే మీకు కొద్దిగా జిమజిమలాడవచ్చు. భయపడకండి, అది తొందరగా తగ్గిపోతుంది.

**సులభంగా లోపలికి ఇంకుతుంది**

ఫెయిర్ అండ్ లవ్లీ ఇంతకు ముందుకన్నా ఇప్పుడు మరింత మృదువైనది, నేవళమైనది. ఇది చర్మం అంతటా మరింత సమానంగా పరుచుకొని, మరింత సులభంగా లోనికి ఇంకుతుంది. త్వరలోనే ఆ తేడాని మీరు అనుభూతి చెందుతారు...కంటితో చూస్తారు కూడా! మీరు ఫెయిర్ అండ్ లవ్లీ గురించి ఇంకా ఏమైనా అడిగి తెలుసుకోవాలనుకుంటే, ఈ చిరునామాకు వ్రాయండి: శ్రీమతి కవితా కుమార్, ఫెయిర్ అండ్ లవ్లీ అడ్వయిజర్, పి. ఓ. బాక్స్ 758, బొంబాయి 400 021.

**ఫెయిర్ అండ్ లవ్లీ**

**వంటి ఛాయని మెరుగుపరిచే క్రీమ్**




## వంటి ఛాయను మెరుగుపరుస్తుంది సహజంగా, మృదువుగా... ఇతర్లు గుర్తించేలాగ!

LINTAS FAL 59 2720 TL

హిందూస్తాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

# చిన్నారి బాలల దీన గాథలు

## అతి భయం పతనానికి దారి తీస్తుంది

'ఏరా పరీక్షలలో ఇంత తక్కువ మార్కులు వచ్చాయి'? పరీక్షలలో తక్కువ మార్కులు వచ్చినందుకు తండ్రి కొడుతున్న దెబ్బలను భరించ లేక ఏడుస్తున్నాడు 14 సం. రాము. అలా తండ్రిచేత చావు దెబ్బలు తింటున్న ఆ పసివాణ్ని దగ్గరకు తీసుకొని లాలించ వలసిన తల్లి కూడా నాలుగు దెబ్బలు వేయడంతో ఆ పసివాడి పరిస్థితి




మరింత దయనీయమైంది. ఆ చిన్నారిని అలా కొద్ది సేపు కొట్టి, హింసించి ఆ రోజు అంతా అతడిని పస్తులుంచి, ఆరు బయట చలిలోకి నెట్టి తలుపులు మూసుకున్నారు కఠినాత్ములైన ఆ తల్లితండ్రులు. ఇలాంటి సంఘటనలు ఎక్కడో ఒక చోట రోజూ జరుగుతూనే ఉన్నప్పటికీ, మనం చూస్తూ ఊరుకోవడం తప్ప ఏమీ చేయ లేక పోతున్నాం, చిన్నారి బాలల భవిష్యత్తును తీర్చి దిద్ది వారిని ఒక మంచి దారిలో నడిపించి, నలుగురిలో తల ఎత్తుకుని తిరిగేలా చేయ వలసిన వారి తల్లితండ్రులే వారి పతనానికి కారకులవుతున్నారంటే అది మనం ఎంతో సిగ్గు పడవలసిన విషయం,

ముఖ్యంగా చిన్న పిల్లలపై వారి తల్లి తండ్రుల ప్రభావం ఎంతో ఉంటుంది, పెద్దల ప్రవర్తన పైననే చిన్న పిల్లల భవిష్యత్తు ఆధారపడి ఉంటుంది, పెద్దలు మంచి ప్రవర్తన, అలవాట్లు కలిగి ఉంటే చిన్న పిల్లలు కూడా ఆ అలవాట్లను, ప్రవర్తనను అలవరచుకొనే అవకాశం ఉంటుంది. కొందరు తల్లితండ్రులు తమ పిల్లలను కొట్టి హింసించి తమ దారిలోకి తెచ్చుకోవాలని చూస్తారు, అలా చేయటం వారి మూర్ఖత్వమే అవుతుంది. పిల్లలను ప్రతి చిన్న విషయానికి కొట్టటం, తిట్టటం చేస్తే వారిలో ఉన్న ప్రతిభ, తెలివితేటలూ దిగజారి పోవటమే కాక, వారిలో ఒక విధమైన భయం చోటు చేసుకొనే అవకాశం ఉంది.



అంతే కాక వారి చిన్నారి మనసులలో హింస, ద్వేషం, పగ, చోటు చేసుకొని వారు సంఘ విద్రోహక శక్తులుగా మారే అవకాశాలు చాలా ఉన్నాయి. కనుక ప్రతి తల్లితండ్రులు తమ పిల్లలను మంచి మాటలతో మార్చడానికి ప్రయత్నించాలి గాని, వారిని కొట్టి, తిట్టి, హింసించి మార్చడానికి ప్రయత్నించకూడదు.ముఖ్యంగాపిల్లల చదువు విషయంలో కొందరు తల్లి తండ్రులు చాలా కఠినంగా ప్రవర్తిస్తుంటారు. వారి చిన్నారి మనసులను గాయ పరుస్తుంటారు, ఒక్కసారి మార్కులు తక్కువగా వచ్చాయనో, లేదా చదువులో వెనుకబడి పోతున్నారనో తిట్టి, కొట్టి, మానసికంగాను, శారీరకంగాను వారికి బలహీనుణ్ని చేసి ఈ సంఘంలో వారిని ఎందుకూ పనికిరాని వారిలా తయారు చేస్తున్నారు. అలాగాక తల్లి తండ్రులు తమ పిల్లల యొక్క తెలివి తేటలనూ, గ్రహింపు శక్తినీ తెలుసుకొని వారిలో ఉన్న ప్రతిభ వారే తెలుసుకొనేలా చేసి, వారికి ఎప్పుడూ ధైర్యం చెబుతూ, వారిపై వారికి ఆత్మ విశ్వాసం పెరిగేలా చేసి వారికి ఒక మంచి భవిష్యత్తును ఏర్పర్చ గలగాలి, లేదా వారు ఏరంగంలో ఎక్కువ శ్రద్ధ కనబరుస్తున్నారో తెలుసుకొని వారిని ఆ రంగంలో ప్రవేశపెట్టి, తగినంత ప్రోత్సాహం కల్పించి, వారు అందులో అభివృద్ధి చెందేటట్టు చూడాలి. అంతేకాని చీటికీ, మాటికీ వారిని తిట్టడం, కొట్టడం మానుకోవాలి. కాబట్టి ప్రతి తల్లితండ్రులూ తమ పిల్లల యెడల నిర్లక్ష్య మైఖరి చూపక వారిపై ప్రేమానురాగాలు కురిపిస్తూ, వారిని ఏవిధమైన మానసిక వత్తిడులకు గురి చేయక, వారిని దేశానికి ఉపయోగపడే విధంగా తయారు చేయవలసిన బాధ్యత తమపై ఉన్నదని తెలుసుకోవాలి.

–ఎం. శ్రీనివాస్, హైదరాబాద్

కూపన్

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

చిన్నారి బాలల దీన గాథలు

రచన పంపిన వారి పేరు : ....................................

పూర్తి చిరునామా : ....................................

....................................

....................................

పిన్‌కోడ్ :

# నా ప్రపంచమే తలక్రిందులై పోయేది...



## నేను న్యూ ఇండియాతో పంపుసెట్టు భీమా చేయించి వుండకపోతే



నా పంపుసెట్టు దొంగలెత్తుకొని పోయారు, కాని పని మాత్రం ఆగి పోలేదు
ఎందుకంటే, న్యూ ఇండియా సహాయంతో కొత్త పంపుసెట్టు కొని పెట్టేసుకొన్నా

రైతుకు అతడి పంపుసెట్టు ఎంత విలువైనదో, అతడికీ, అతడి కుటుంబం వారికి బాగా తెలుసు. కాని ఆ పంపుసెట్టు కాలిపోతే, విరిగిపోతే, పాడైపోతే లేదా దొంగలెత్తుకు పోతే? అలాంటప్పుడు న్యూ ఇండియా ఎష్యూరెన్స్ ఒక మంచి నేస్తంలా మీకు ఆధారంగా నిలుస్తుంది.

**న్యూ ఇండియా ఎష్యూరెన్స్ వారి పంపుసెట్టు భీమా**

పంపు మోటారు యొక్క హార్స్ పవర్‌ను బట్టి, ఒక ఏడాదిలో 50 రూపాయల నుంచి 190 రూపాయల దాకా చెల్లిస్తే చాలు. దేశమంతటా న్యూ ఇండియా ఎష్యూరెన్స్ వారివి దాదాపు 1000 కార్యాలయాలు వున్నాయి. ఎక్కువ వివరాలకోసం నేడే మీ ఏజెంట్‌ను కలవండి, లేదా మీకు దగ్గరలోని కార్యాలయానికి విచ్చేయండి.

## న్యూ ఇండియా ఎష్యూరెన్స్



జనరల్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా అనుబంధ సంస్థ

పంపుసెట్టు భీమా–నష్టాలలో మీకు నమ్మకమైన ఆధారం!

R K SWAMY/NIA/3573/TEL

ఒక సంవత్సరం పైగా బోఫోర్స్ గురించి వార్తా, వ్యాఖ్యా లేకుండా ఒక్క పత్రిక కూడా వెలువడలేదు. బోఫోర్స్‌ను ప్రస్తావించ కుండా రాజకీయవాదులు మాట్లాడిన సందర్భం ఒక్కటి కూడా లేదు. అంతర్జాతీయ పత్రికల నుంచి స్థానిక పత్రికల వరకూ పత్రికలన్నీ బోఫోర్స్ గురించి ప్రత్యేక వ్యాసాలు ప్రచురించాయి. దూరదర్శన్ బోఫోర్స్ గురించి రెండు భాగాల ప్రత్యేక కార్యక్రమాన్ని ప్రసారం చేసింది. ఇంత ప్రాముఖ్యతను సంతరించుకున్నా, ఇంత కాలం గడిచినా బోఫోర్స్ వ్యవహారం అనేక నాటకీయమైన మలుపులు తిరిగింది గాని పూర్తిగా తేట తెల్లం కాలేదు. అనుమానాలు, ఆరోపణలు ఉన్నచోటే ఉన్నాయి. సమాధానాలు, సంజాయిషీలు, ప్రత్యారోపణలు వివాదాన్ని జటిలం చేశాయి గాని పరిష్కరించలేక పోయాయి.

ఈ వ్యవహారంలో వాస్తవాలు తెల్చి చెప్పడం ఎందుకు ఇంత అసాధ్యం అవుతోంది? అసలు ఈ బోఫోర్స్ ఏమిటి? ఈ వివాదం ఎందుకు ఇంత చిక్కుముడి అయింది? ఈ వివాదంలో తరపున తెరవెనుక ... ఎవరు? ... ఎవరు? ... ఈ ...



నాటి స్వీడిష్ ప్రధానమంత్రి కీ.శే. ఒలోఫ్ పాల్మె

సమీప భవిష్యత్తులో తెరపడుతుందా?..... ఇటువంటి ఎన్నో ప్రశ్నలకు సంతృప్తికరమైన సమాధానాలు లేని సంక్లిష్ట వ్యవహారం బోఫోర్స్ ఐనా ఉన్న అసంతృప్తికర సమాధానాలను విశ్లేషించడం ద్వారా, వాటి లోగుట్టును కనుక్కోవడం ద్వారా ఈ సంక్లిష్టతను పరిష్కరించవచ్చు. బోఫోర్స్ వివాదాన్ని అర్థం చేసుకోవచ్చు.

బోఫోర్స్ ఎ. బి. అనేది స్వీడన్‌కు చెందిన ఒక ఆయుధ కర్మాగారం. నోబెల్ ఇండస్ట్రీస్ అనే పారిశ్రామిక సముదాయంలో ఇది ఒక భాగం. ఆయుధాల విడిభాగాలను, ఆయుధాలను తయారు చేసే బోఫోర్స్ సంస్థ స్వీడిష్ ప్రభుత్వ నిబంధనల మేరకు విదేశాలకు అమ్మకాలు సాగిస్తుంది. భారతదేశంతో బోఫోర్స్‌కు ఎన్నో సంవత్సరాలుగా లావాదేవీలున్నాయి.

యుద్ధంలో వాడే భారీ శతఘ్నుల కోసం భారత ప్రభుత్వ రక్షణ శాఖ 1970 ల ప్రారంభం నుంచి అన్వేషిస్తోంది. ఈ అన్వేషణలో నాలుగు శతఘ్నుల పోటీకి నిలిచాయి. అవి బ్రిటన్, జర్మనీ, ఇటలీలకు చెందిన కంపెనీలు సంయుక్తంగా తయారు చేసిన ఎఫ్ హెచ్ 70, స్వీడన్‌కు చెందిన బోఫోర్స్ తయారు చేసిన ఎఫ్ హెచ్ 77బి, ఫ్రాన్స్‌కు చెందిన జిఐఎటి తయారు చేసిన 155 టి ఆర్ సోఫ్మా, ఆస్ట్రియాకు చెందిన వొయెస్ట్ ఆల్పైయిన్ తయారు చేసిన జిహెచ్ ఎన్ 45.

ఈ నాలుగు శతఘ్నుల పనితీరును, సామర్థ్యాన్ని పరిశీలించడం ప్రారంభించిన తర్వాత ఆస్ట్రియన్ శతఘ్ని జాబితాలో నిలువలేదు. ప్రతిభా పాటవాలను బట్టి మూడుదేశాలు సంయుక్తంగా తయారు చేసిన శతఘ్ని ప్రథమ స్థానంలో, ఫ్రాన్స్ తయారు చేసిన శతఘ్ని రెండో స్థానంలో, బోఫోర్స్ తయారు చేసిన శతఘ్ని మూడో స్థానంలో నిలిచాయి. మూడు దేశాలు సంయుక్తంగా తయారు చేసిన శతఘ్నులను కొంటే, సాంకేతిక నైపుణ్యం వినిమయంలో ఇబ్బంది ఏర్పడుతుందనే కారణంతో జాబితా నుంచి ఎఫ్ హెచ్ 70 శతఘ్నిని తొలగించారు.

1982కు ఈ జాబితా సిద్ధం కాగా 1984లో ఈ కంపెనీలతో వాణిజ్యపరమైన చర్చలు ప్రారంభమయ్యాయి. ఈ కొనుగోలు కోసం ప్రభుత్వం రెండువేల కోట్ల రూపాయలు కేటాయించింది. 1984 మేలో సైన్యాధికారులు పంపిన, బోఫోర్స్ శతఘ్నులతో ఏది కొన్నా తమకు అభ్యంతరం లేదని ప్రకటించారు. 1985-86లో ఈ రెండు దేశాల వ్యాపార వర్గాలు, ప్రభుత్వాలు తమతమ ఉత్పత్తులను మనం కొనేలా చేయడానికి తీవ్ర ప్రయత్నాలు చేశాయి.

1986 జనవరిలో మనదేశం సందర్శించిన స్వీడన్ ప్రధానమంత్రి ఒలోఫ్‌పాల్మె మన ప్రధానికి ఒక హామీఇచ్చారు. బోఫోర్స్‌తో చర్చలు జరిపి మొత్తం ఖరీదుపై కనీసం 500 కోట్ల రూపాయలు తగ్గేలా చూస్తామన్నారు... చివరికి 1986 మార్చి 24న భారత ప్రభుత్వానికి, బోఫోర్స్‌కూ మధ్య ఒప్పందం కుదిరింది. 1427 కోట్ల రూపాయలకు 410 శతఘ్నులను నాలుగు సంవత్సరాలలో పంపించడానికి బోఫోర్స్ అంగీకరించింది. నాలుగు సంవత్సరాల తర్వాత 3000 కోట్ల రూపాయలకు సాంకేతిక నైపుణ్యాన్ని వినిమయం చేసేందుకు, ఆ తర్వాత నుంచి స్వదేశీ ఉత్పత్తి జరిగేందుకు అంగీకారం కుదిరింది. ఈ ఒప్పందం కుదరడంలో ప్రధాన పాత్రధారులు స్వీడన్ ప్రధాని ఒలోఫ్‌పాల్మె,



బోఫోర్స్ శతఘ్ని

అప్పటి బోఫోర్స్ మేనేజింగ్ డైరెక్టర్ మార్టిన్ ఆర్డ్‌బో, స్వీడన్ విదేశీ వాణిజ్య కార్యదర్శి కార్ల్ జోహన్ ఆబర్గ్, భారత ప్రధాని రాజీవ్‌గాంధీ.

1987 ఏప్రిల్ 16న ఈ వ్యవహారం హఠాత్తుగా వివాదాస్పదమైంది. స్వీడన్‌లో స్వతంత్ర ప్రతిపత్తి గల రేడియో సంస్థ ఈ కాంట్రాక్టును పొందడం కోసం బోఫోర్స్ భారత రాజకీయనాయకులకు, ప్రముఖ వ్యక్తులకు దాదాపు 50 కోట్ల రూపాయల ముడుపులు చెల్లించిందని ఆరోపించింది. ఈ ఆరోపణను బైట పెట్టిన వ్యక్తి, హాంకాంగ్‌లోని స్వీడిష్ రేడియో విలేఖరి రాల్ఫ్ ఎక్‌సరిడ్.

ఈ ఆరోపణ సహజంగానే భారతదేశంలోనూ, స్వీడన్‌లోనూ పెద్ద సంచలనాన్ని సృష్టించింది. స్వీడిష్ ప్రభుత్వం బోఫోర్స్ వ్యవహారాలను పరిశోధించవలసిందిగా నేషనల్ ఆడిట్ బ్యూరోను కోరింది. భారత ప్రభుత్వం ఈ ఆరోపణ నిరాధారమైనదని ప్రకటించింది.

జూన్ 1987లో భారత ప్రభుత్వానికి స్వీడన్

హిందుజా సోదరులు శ్రీ చంద్, ...



# కొనసాగుతున్న వ్యవహారం!



రాజీవ్‌గాంధీ

ప్రభుత్వం, కొన్ని బాగాలు మినహాయించిన, నేషనల్ ఆడిట్‌బ్యూరో నివేదికను అందజేసింది ఆ నివేదిక ప్రకారం బోఫోర్స్ నుంచి కొంత డబ్బు స్విస్ బ్యాంకు ఖాతాల్లోకి చేరిన మాట నిజమేనని, కాని అది లంచం కాదని అంతకు ముందున్న మధ్యవర్తులను వినియోగించుకోకుండా ఉన్నందుకు ఇచ్చే డబ్బు మాత్రమేనని ఈ నివేదిక ప్రకటించింది.

ఈ నివేదికను బహిర్గతం చెయ్యడానికి కొద్ది రోజుల ముందే భారతదేశంలో బోఫోర్స్ ఏజెంటు అయిన విన్ ఛడ్డా దేశం వదిలి వెళ్ళిపోయారు. చాలాకాలం వరకు ఆయన జాడ తెలియలేదు ఈ ముడుపులు విన్‌చడ్డాకు చెందిన అనాట్రానిక్ జనరల్ కార్పొరేషన్‌తో పాటు స్వెన్‌స్కా ఇన్‌కార్పొరేటిడ్ (పనామా), మొరెస్కొ మొయినియావో ఎస్.ఎ పిటికో (స్విట్జర్లాండ్), ఎ ఇ సర్వీసెస్ (యు. కె.)లిడ్ ఇంజనీరింగ్ ప్రైవేట్ లిమిటెడ్ (సింగపూర్) సంస్థలకు కూడా అందాయని కొన్ని వార్తలు తెలుపుతున్నాయి

ఈ మారుపేర్లు గల సంస్థల వెనుక అసలు ముడుపులు అమితాబ్ సోదరులకు, ప్రవాస భారతీయులైన హిందుజా సోదరులకు అందాయని ఆరోపణలు ప్రముఖంగానే వినబడుతున్నాయి అసలు ముడుపులలో స్నామ్ ప్రొగెట్టి అనే ఇటాలియన్ సంస్థకు చెందిన ఆటేవియో క్వాట్రోచీ ద్వారా రాజీవ్‌గాంధీ కుటుంబానికి కూడా సంబంధం ఉందనే ఆరోపణలు వచ్చాయి

ఈ ఆరోపణలను తొలగించుకునేందుకు ప్రభుత్వం తన సంసిద్ధతను 1987 జూన్‌లో ప్రకటించింది ఒక సంయుక్త పార్లమెంటరీ కమిటీని నియమిస్తామని ప్రభుత్వం ప్రకటించింది ఆ కమిటీకి ఏ మంత్రినైనా విచారించే అధికారం, ఏ పత్రాలనయినా తెప్పించుకునే అధికారం ఉండాలని ప్రతిపక్ష నాయకులు కోరారు

1987 జూలైలో ప్రభుత్వం 30 మంది సభ్యులు గల సంయుక్త పార్లమెంటరీ కమిటీని ప్రతిపాదించింది కాని ఆ కమిటీ విచారణాంశాలు విచారణకు తగిన విధంగా లేవని, ఆ పరిమితుల్లో వాస్తవాలు కనిపెట్టడం అసాధ్యమని ప్రతిపక్షం ప్రకటించింది

కమిటీలో చేరడానికి ప్రతిపక్షం నిరాకరించింది.

ఈలోగా స్వీడన్‌లోని సీనియర్ పబ్లిక్ ప్రాసిక్యూటర్ లార్స్‌రింగ్‌బెర్గ్ ఈ ముడుపుల ఆరోపణపై కోరితే పరిశోధిస్తామని ప్రకటించారు విపి సింగ్, వంద మంది ప్రతిపక్ష పార్లమెంటు సభ్యులు కోరిన మీదట ఈ పరిశోధన ప్రారంభమైంది

పార్లమెంటరీ కమిటీకి శంకరానంద్ నాయకత్వం వహించగా విచారణ ప్రారంభించింది ఆగస్టు 87 నుంచి విచారణ ప్రారంభించిన ఈ కమిటీ ప్రభుత్వం ఏ తప్పిదమూ చేయలేదని, ఆరోపణలు నిరాధారమైనవని ఆరునెలల విచారణ తర్వాత ప్రకటించింది కమిటీలోని ఎ ఐ ఎ డిఎం కె సభ్యులు ఈ నివేదికను వ్యతిరేకిస్తూ అసమ్మతి పత్రాలు ప్రకటించారు ప్రతిపక్ష సభ్యులు లేకపోవడం వల్ల ఉన్న సభ్యులయినా అసమ్మతి ప్రకటించడం వల్ల ఈ కమిటీ నివేదిక సాధికారతను సంతరించుకోలేక పోయింది

సంయుక్త పార్లమెంటరీ కమిటీ నివేదిక ప్రభుత్వాన్ని, .. విన్‌చడ్డాను, సంబంధిత వ్యక్తులందరినీ నిర్దోషులుగా ప్రకటించినప్పటికీ, 'హిందూ' వంటి పత్రిక కూడ తన అనుమానాలను వదులుకోలేక పోయింది హిందూ తరఫున జెనీవాలో ప్రత్యేక పరిశోధనలు జరిపిన శ్రీమతి చిత్రా సుబ్రహ్మణ్యం ఏప్రిల్ 22, 27 జూన్ 22 తేదీల్లో సంచలనాత్మకమైన ఆధారాలను ప్రకటించారు ముగింపు ఖర్చులు మాత్రమే చెల్లించామని, కమిషన్ చెల్లించలేదని బోఫోర్స్ చేసిన ప్రకటన, ప్రభుత్వపు సమర్థన అబద్ధాలు కావచ్చునని ఈ ఆధారాలు తెలియ జేస్తున్నాయి. విన్‌ఛడ్డా కూడా ఇంత కాలమూ బోఫోర్స్ చెపుతున్నట్టు కేవలం బోఫోర్స్ అధికారుల నివాస, భోజన సదుపాయాలు, ఇతర అవసరాలు చూసే వ్యక్తి కాదని, ఆయన అచ్చంగా భారత ప్రభుత్వ రక్షణశాఖలోని రహస్యాలని బోఫోర్స్‌కు చేరవేసే మధ్యవర్తి అని ఈ పత్రాలు తెలియ జేస్తున్నాయి

మొత్తం మీద ఆరోపణలన్నిటినీ నిర్ద్వంద్వంగా కొట్టివేయ గల సమాధానాన్ని ప్రభుత్వంగాని, బోఫోర్స్‌గాని ఆరోపణలకు గురయిన వ్యక్తులు గాని ఇవ్వలేక పోయారు సంవత్సరం పైగా సాగిన తర్క వితర్కాలలో ప్రజలకు తమ ప్రభుత్వం గురించి తెలుసుకునే హక్కు అనేకసార్లు ధ్వంసమై పోయింది పరస్పర విరుద్ధ ప్రకటనలతో ఈ వ్యవహారమంతా ఒక మాయాజాలం అయిపోయింది ఈ ప్రహేళికను పరిష్కరించే ఓపిక లేని బుద్ధిజీవులు క్రమక్రమంగా ఈ వివాదాన్ని పట్టించుకోవడం మానేశారు

కాని 1500 కోట్ల రూపాయల ప్రజాధనాన్ని సద్వినియోగం చేశారా, దుర్వినియోగం చేశారా అందులోనూ 50 కోట్ల రూపాయల ధనాన్ని ఎవరో [illegible] అప్పనంగా



రాల్ఫ్ [illegible]

అప్పజెప్పడం జరిగిందా లేదా? కోట్లాది మంది పన్ను చెల్లింపుదార్ల శ్రమ ఇంత దుర్మార్గంగా కొల్లగొట్టడం జరిగిందా లేదా? కోట్లాది మంది రైతుల, కార్మికుల చెమటా నెత్తురూ కరిగించి పోగుబడిన సంపద ఇట్లా రహస్యంగా కొందరి హక్కు భుక్తమై దేశపు ఎల్లలు దాటి పోయిందా లేదా అనే ప్రశ్నలు ఇంకా మిగిలే ఉన్నాయి సమాధానాలు ఇంకా ఎక్కడో నిరీక్షిస్తూనే ఉన్నాయి ఈ అనంత నిరీక్షణ ముగిసేదెన్నడో?...

—వి. జి.

డ్డా

...పీచంద్, ప్రకాష్‌చంద్, అశోక్





# వారఫలం

## 29–7–1988 శుక్రవారం మొదలు 4–8–1988 గురువారం వరకు

★ **మేషం:** ఉత్తముల పరిచయం సర్వవిధాలా లాభదాయకం. పత్రికాధిపతులకు, పత్రికా రంగాన శ్రమించేవారికి అనుకూలసమయం. రాజకీయ రంగాన కొందరకు మేలున్నది. విద్యారంగాన పెంపుగలసమయం. మరిశ్రమించాలిగా! స్త్రీలకు: సర్వవిధాల అనుకూల వారం.

★ **వృషభం:** సుఖకరమైన సమయం. వృత్తిరీత్యా అనుకూలసమయం. దూరప్రాంతాల నుండి బంధుమిత్ర సమాగమం. సభాగౌరవం కొందరకు. పత్రికాగౌరవం కొందరకు చేకూరగల వారం. సంతానం కొరకు చేసినయత్నం నెరవేరుతుంది. స్త్రీలకు: సుఖశాంతులుంటాయి. ప్రశాంతికి ఆకరమైనవారం.

★ **మిధునం:** కనివినీ ఎరుగని మేలు జరుగుతుంది. విశిష్టవ్యక్తుల పరిచయం ఏర్పడుతుంది. ధనాగమసమయం. కొందరకు నూతన వ్యాపార నిశ్చయం. రాజకీయంగా ఏదో మేలు జరుగనున్నది. యత్నించి మేలుపొందండి. స్త్రీలకు: సభాగౌరవం. వృత్తియందు అనుకూలం. మేలైనవారం.

★ **కర్కాటకం:** దివ్యమైన సమయం. వారమంతా అనుకూలదాయకమే. కృషిలోపం లేకపోతే అన్ని రంగాలందును విజయమే. సభామర్యాద కొందరకు, పత్రికా గౌరవం కొందరకు చేకూరుతుంది. స్త్రీలకు ధనలోపం లేదు. ఉద్యోగించే వారికి అనుకూలవారం. మిత్ర సమాగమం.

★ **సింహం:** అన్ని రంగాలవారికి అభివృద్ధికరమైన మార్పులు రానున్నవి. పత్రికాగౌరవం చేకూరనున్నది. రాజకీయంగా అనుకూలసమయం. సభాగౌరవమున్నది. విదేశాలనుండి మిత్ర సమాగమం. పత్రికారంగాన ప్రసిద్ధి ఏర్పడనున్నది. స్త్రీలకు: శుభసమయం. బంధుసమాగమం.

★ **కన్య:** ఉత్తముల స్నేహం లభ్యమవుతుంది. సభా గౌరవం కొందరకు, వ్యాపారరంగాన ప్రసిద్ధి చేకూరుతుంది. సభారంగాన ప్రసిద్ధి యేర్పడుతుంది. దూరప్రాంతాల నుండి బంధుమిత్రులు రానున్నారు. ఆదరించవలసిన అగత్యం కూడా ఏర్పడుతుంది. బాధాకరమే! స్త్రీలకు: శుభదాయకసమయం. పుణ్యకార్యాచరణానుకూలం. గ్రహించాలి.

★ **తుల:** వారమంతా మీకు అందంగా ఉత్సాహజనకంగా జరిగిపోతుంది. రాజకీయ వాదులకు అధికంగా మేలున్నది. ఇలా తెలిసికొన్నపుడు కార్యరంగంలో దిగాలి. మేలు సాధించాలి. వృత్తియందు వికాసమున్నది. స్త్రీలకు: సుఖశాంతులు, ధనలబ్ధి, కుటుంబానందం.

★ **వృశ్చికం:** వారమంతా జాగ్రత్తవహించుట మేలు. ధన విషయంగా ఏవో పేచీలు రావచ్చు. వృత్తియందు అనుకూలవార్తాశ్రవణం. సుఖశాంతులకు ఎలాంటి లోపంలేదు. అయినా మానసికంగా స్వల్ప సంక్షోభం తప్పదు. స్త్రీలకు: శాంతియుతంగా వారం జరిగితే మేలు. స్వల్పంగా ధనలబ్ధి లేకపోలేదు.

★ **ధనుస్సు:** వారమంతా పెద్దగా అనుకూలం కాకపోయినా, పెద్దగా ఒడిదుడుకులురావు. కృషిమూలాన కొన్ని యిబ్బందులనుండి దాటుకోగలుగుతారు. వ్యాపారరంగానగాని, వ్యవసాయ రంగానగాని మీకు ఎలాంటి ఒడిదుడుకులు రావని గ్రహించాలి. స్త్రీలకు: ఉద్యోగమందు అధిక ఆదరణ.

★ **మకరం:** ఎంతో విజయవంతమైన దినం. ఉత్తముల సాహచర్యమున్నది. వ్యాపారాన అధికంగా అనుకూలం. విదారంగాన, కళారంగాన, చలనచిత్ర రంగాన సదవకాశాలుంటాయి. ఇరుగుపొరుగులతో గొడవలు రాకుండా చూచుకోవాలి. విజయవంతమైనవారమే.

★ **కుంభం:** అనుకొన్నవిధంగా మీకు ఆదాయం అనుకూలించిరాగలదు. వృత్తియందు వికాసం. రాజకీయాలందు విలువపెరుగుతుంది. కళారంగాన మీకు ఆదరణ లభ్యంకావటం గమనింపదగిన అంశాలు. స్త్రీలకు: సంతతివలన ఆనందోత్సాహాలు, రాజకీయరంగాన అనుభవానికి ఆస్కారం.

★ **మీనం:** బహు అనుకూల సమయం. రేవతి వారికి మరీ అనుకూలం. ఆరోగ్యమందు చెప్పదగిన అనుకూలం. వ్యాపారం సాగిరావటం గమనింపదగిన అంశాలు. వృత్తియందు, రాజకీయమందు విజయమున్నది. శుభవాతావరణం ఏర్పడనున్నది. రాజకీయాలకు ఈవారం దూరంగా వుండుట గమనించాలి. స్త్రీలకు: ఆరోగ్యవృద్ధి, ఆనందం, కొందరకు నూతనోద్యోగావకాశాలు.

– విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

సీరియల్

# తమస్





తెనుగుసేత: డా॥ యార్లగడ్డ లక్ష్మీప్రసాద్

హిందీమూలం: డా॥ భీష్మసాహ్నీ

(గత సంచిక తరువాయి)

**ఆ** సందులో అడుగుపెట్టగానే నత్తూ హాయిగా గాలి పీల్చుకున్నాడు. రోడ్డుమీద చీకటి తగ్గుతుంది. కాని సందులో మాత్రం చీకటి ఇంకా దట్టంగానే వున్నది. నత్తూ సందులు గొందులు దాటుకుంటూ త్వరగా తన ఇంటికి చేరుకోవాలనుకుంటున్నాడు. దుర్గంధంతో నిండిన ఆ గుడిసె నుండి బయటపడి, ఆరుబయట ప్రశాంత వాతావరణం ప్రాణానికి హాయిగావుంది. గడిచిన రాత్రితో పోల్చుకుంటే, ఈ సందుల్లో నడవటం అతనికి ఎంతో మనశ్శాంతిగావుంది.

కాసేపటికి కుడివైపునుంచి ఆడవాళ్ళ మాటలు, గాజుల సవ్వడి వినిపించసాగాయి. ఆడవాళ్ళు అతని ప్రక్కన నడుచుకుంటూ వెళ్ళారు. పంపు దగ్గర ఇద్దరు ముగ్గురు కడవలు ఎదురుగా పెట్టుకుని కూర్చునివున్నారు. పంపులో ఇంకా నీళ్ళు రావటంలేదు. నత్తూకు ఇదికూడా మంచిదే అనిపించింది.

కొంచెం దూరం నడిచిన తర్వాత కాలికి ఎదురుదెబ్బ తగిలింది. కాలికి ఏదో తగిలి చెల్లాచెదరయ్యినట్లనిపించింది. ఒక ఇంటిముందు ఎవరో స్త్రీ 'మంత్రం కట్టించినట్లుంది. గుడ్డపీలికలతో చుట్టబడిన చిన్న రాళ్ళు. చిన్న పుల్లలు గుచ్చబడిన బియ్యపుపిండితో చేసిన బొమ్మ దారికి అడ్డంగా పడవేయబడి వున్నాయి. ఎవరో 'దురదృష్టవంతులు తనకు పట్టిన 'అశుభాన్ని' ఎవరికో అంటగట్టడానికి 'మంత్రం' వేయించినట్లుంది. నత్తూ తాను దానిని తొక్కటం అపశకునంగా భావించాడు. రాత్రంతా గందరగోళమైన పరిస్థితులలో గడిపిన నత్తూకు, మళ్ళా ఈ దిగదుడుపు వస్తువుల్ని తొక్కటం ఎంతో భయాన్ని, విచారాన్ని కలుగచేసింది. అయితే వెంటనే తనను తాను సంభాళించుకున్నాడు. మామూలుగా ఈ దిగదుడుపులు పిల్లలకు పట్టిన 'గాలి'ని వదిలించుకోవటానికి చేయిస్తుంటారు. తాను పిల్లవాడు కాదుగదా అన్న ఆలోచన నత్తూకు ధైర్యాన్ని కలిగించింది. అతను ధీమాగా ముందుకు నడిచాడు.

ఆ సందు నత్తూకు బాగా తెలుసు. అతను ప్రవేశించిన సందులో కొంతదూరం వరకు అన్నీ మహమ్మదీయుల ఇళ్ళే. రెండు మూడు రజకులవాళ్ళ ఇళ్ళు. ప్రక్క రోడ్డు చివర మాంసం దుకాణాలు నడిపే కొందరి కసాయివాళ్ళ ఇళ్ళు కూడా ఆ సందులోనే వున్నాయి. ఇక్కడే మహమ్మద్ హమామ్‌వాలా కూడా నివసిస్తూవుంటాడు. మరికొంచెం దూరం నడిస్తే హిందువుల, సిక్కుల ఇళ్ళూ వున్నాయి. సందు చివరకు వెళ్ళేసరికి ముల్లాల యిళ్ళు మొదలవుతాయి.

ఒక యింటిముందుకు వచ్చేసరికి ఒక వృద్ధ స్వరం.....

"యా అల్లాహ్ కుల్ దీ ఖైర్ కుల్ దా భలా!" అనటం వినిపించింది.

ఆ వృద్ధుడు ఉదయాన్నే మేలుకుని అతను దగ్గటం, ఒళ్ళు విరుచుకుంటూ నిద్రలేస్తున్న శబ్దం వినవస్తూంది.

ప్రజలు మేలుకోసాగారు.

నత్తూ మరి నాలుగడుగులు వేసేసరికి అతని కుడికాలు ఏదో జారుడు పదార్థంలో పడినట్లనిపించింది. అతి కష్టంమీద పడకుండా నిలదొక్కుకున్నాడు. వెంటనే పేడవాసన అతని ముక్కుకు సోకింది. కాలు పైకి లాగుకునేసరికి సగం పగిలిన కుండీ ప్రక్కకు దొర్లింది. అతనికి విషయం అర్థమయ్యింది. నోటినుండి బయటకు రాబోయిన తిట్టు ఆగిపోయి, పెదవులపై చిరునవ్వు నిలిచింది. 'దిగతుడుపు' అశుభం దీనితో తల తిరిగిపోయినట్లనిపించింది. కొద్ది రోజులుగా ఎండలు ముదిరి, ఆకాశం నుండి చుక్కకూడా వర్షం పడటంలేదు. వర్షాలు కరువైనప్పుడు కొందరు ఉత్సాహవంతులైన కుర్రవాళ్ళు పగిలిన కుండలో పేడ మరియు ఆవు, గుఱ్ఱం మొదలగు జంతువుల మూత్రం పోగు చేసి ఆ పేటలో అపకారిగా భావించబడేవాని ఇంటి ముందు

జరిగిన కథ- 2: మురాద్ అలీ చూపిన ఆశతో నత్తూ పందిని చంపడానికి సిద్ధపడతాడు. కాని ఆ పంది నత్తూ శక్తినంతా తోడేస్తుంది. ఎంతో కష్టంతో పందిని లొంగదీసి, చంపేస్తాడు. కాంగ్రెస్ నిర్వహించే ప్రభాత ప్రదర్శనకు బక్షీ, అజీజ్, మెహతా, కాశ్మీరీలాల్, శంకర్, వచ్చేస్తారు. పారిశుధ్య కార్యక్రమం కోసం ఇమామీదిన్‌పేటకు బయలుదేరుతారు.

పడవేస్తుంటారు. దీనిని వర్షాలు కురిపించ ప్రయత్నంలో భాగంగా భావిస్తుంటారు.

ఒక ఇంటి ముందు వీధిలో కట్టేసిన ఆవుకు ఒక మనిషి నిలబడి కుడితి పెడుతున్నాడు. దగ్గరలోని ఒక ఇంటినుండి వంటపాత్రల మోతలు, గాజుల గలగలలు వినిపిస్తున్నాయి. బహుశా టీ తయారవుతున్నట్లుంది. ఇంతలో ఒక స్త్రీ ముసుగువేసుకుని కూనిరాగం తీస్తూ చేతిలో బుట్ట పట్టుకొని ఎదురుగా నడుచుకుంటూ వెళ్ళింది. ఎవరో స్త్రీ గుడికో, గురుద్వారాకో వెళ్ళుతుందని నత్తూ భావించాడు. చాలా సాధారణంగా ఎప్పటిలాగానే దైనందిన కార్యక్రమాలు మొదలయ్యాయి. అప్పుడే సందు మొగనుండి 'ఏకతార' మీటుతున్న శబ్దం ఫకీరు పాట నత్తూ చెవులకు వినిపించింది. నత్తూ ఈ గొంతు చాలాసార్లు విన్నప్పటికీ ఆ ఫకీరును ఇంతవరకు చూడలేదు. ముఖ్యంగా రంజాన్ పండుగరోజులలో మహమ్మదీయులు తెల్లవారుఝామునే లేచి తమ-




దినచర్య ప్రారంభించే సమయానికి ఈ ఫకీరు 'ఏకతార' మీటుకుంటూ. పాటలు పాడుకుంటూ వీధులలో తిరుగుతూ వుంటాడు. దగ్గరకు వచ్చేసరికి పొడవుగా, వెడల్పాటి నుదురు, తెల్లటి చిరుగడ్డం, తలమీద టోపీ, పొడవైన లాల్చీ, చంకన పెద్ద జోలె వున్న వృద్ధుడైన ఫకీరు నత్తూకు కనిపించాడు. నత్తూ ఆగిపోయాడు. అతను ఫకీరు పాట నిలబడి విందామనుకున్నాడు.

ఫకీరు పాడుతూ వస్తున్నాడు. నత్తూ తరచుగా విని, నిద్రలో కూడా ఆనందించే 'ఏకతార' సంగీతం, ఇప్పుడుకూడా ఎంతో మధురంగా వినిపించసాగింది. జేబులో నుండి ఒక పైసా ఫకీరు చేతిలో పెట్టాడు.

'అల్లా నీకు మేలు చేయుగాక' అంటూ ఫకీరు ఆశీర్వదించాడు.

'నత్తూ ముందుకు సాగిపోయాడు.'

ఆ సందు దాటేసరికి మరికొంత పగటివెలుతురు రాసాగింది. అక్కడనుండి టాంగాలు నడిపేవాళ్ళ ఇళ్ళు మొదలవుతాయి. సందలో నుండి రోడ్డుపైకి వచ్చేటప్పటికి వెలుతురు మరికొంత ముదిరింది. రోడ్డుపక్కన రెండుమూడు టాంగాలు ముందుభాగంపైకి లేపబడి. అందరికోసం భగవంతుని దీవెనలు అర్థిస్తున్నావా అన్నట్లు నిలబెట్టివున్నాయి. ఎత్తయిన గోడపక్కన నిలబడ్డ ఒక టాంగావాడు తన గుర్రానికి మాలీసు చేస్తున్నాడు. పక్కన కూర్చున్న యిద్దరు ఆడవాళ్ళు పేడతో పిడకలుజేసి అక్కడవున్న మట్టిగోడకు కొడుతున్నారు. రోడ్డు మధ్యన ఒక గుఱ్ఱం తన సహజరీతిలో గంతులు వేస్తున్నది. ప్రాతఃకాలపు ప్రశాంత సమయంలో ప్రజలు దినచర్య మెల్లమెల్లగా మొదలైనట్లుంది.

నత్తూకు తాను తిరగటానికి బయటకు వచ్చినట్లనిపించసాగింది. తనను ఎవరైనా చూడటంగాని, గుర్తుపట్టడంగాని అతనికి ఇష్టంలేదు. అయితే అతనిలోని ఆందోళన మాత్రం చాలావరకు తగ్గిపోయింది. అందుచేత అతను ఉత్సాహంతో పేటలన్నీ తిరుగుతున్నాడు.

జమీందారు బండి ఎక్కడవరకు వెళ్ళివుంటుంది అనే విషయం అకస్మాత్తుగా స్ఫురణకువచ్చింది. చాలా తెలివితక్కువ ప్రశ్న. అతను వేగంగా నడవసాగాడు. దూరంగా వున్న మిలటరీ కంటోన్మెంటుకు చేరినట్లున్నాడు. పశువుల ఆసుపత్రి ఎదురుగా వున్నట్లు గమనించాడు. అతని నోటినుండి అప్రయత్నంగా బూతులు వెలువడ్డాయి. రకరకాల ఆలోచనలు మొదలయ్యాయి. పందిని పగటిపూట చంపకూడదా? పశువుల డాక్టరుకు చచ్చిన పందితో పనియేమిటి? బహుశా! ఆ పంది మాంసాన్ని ఎక్కడో అమ్మటానికే తనచేత చంపించి వుంటారు. రాత్రి సంగతంతా గుర్తుకు రాగా నత్తూకు తనపై తనకే అసహ్యం వేసింది. అతను చాలా అసహ్యమైన రాత్రి గడిపాడు. చమట, దుర్వాసన, మూసిన గుడిసె, పంది అరుపులు, పంది కుమ్మటం, మోకాళ్ళపై చర్మం కొట్టుకుపోవటం అన్నీ ఒక్కొక్కటే గుర్తుకురాసాగాయి. పంది చచ్చేటప్పటికి నత్తూ పని సగం చచ్చినట్లయింది. మురాద్ అలీ ఎట్లాపోతే తనకేమిటి. తాను తనిష్టము వచ్చినట్లు తిరుగుతాడు. నత్తూ ఒక్కసారి జేబులో చేయిపెట్టుకుని అయిదు రూపాయిల కాగితాన్ని తడివి చూసుకున్నాడు. తన డబ్బులు తన కొచ్చాయి. మిగతా విషయం అనవసరం.

పచ్చిక బయలు దగ్గరనుండి అతను కుడిచేతివైపుకు తిరిగాడు. అప్పుడే ముస్లింలపేటలోని గడియారపు గంటల శబ్దం వినిపించింది. ప్రభాత సమయంలో ఆ గంటల శబ్దం స్పష్టంగా విన్పిస్తుంది. పగటిపూట మిగిలిన మోతల్లో కలిసిపోయి సరిగా విన్పించదు. కొద్దిక్షణాలపిమ్మట పట్టణం మధ్యలో ఎత్తయిన ప్రదేశంలో కట్టబడిన గుడి నుండి గంటలమోత విన్పించసాగింది. రకరకాలు మోతలు ఎక్కువైనాయి. ఇండ్ల తలుపులు ఒక్కొక్కటే తెరుచుకుంటున్నాయి. కొందరు దగ్గుకుంటూ చేతికర్రలతో మోతచేసుకుంటూ 'మార్నింగ్ వాక్'కు బయల్దేరారు. ఒక గొల్లవాడు తన నాలుగైదు మేకలను తోలుకొని మేకపాలు అమ్మటానికి బయల్దేరాడు. నత్తూ అడుగులు తడబడసాగాయి. అయితే ప్రాతఃకాలపు చల్లగాలిలో తిరగడం అతనికి ఎంతో హాయిగావుంది. ఇప్పుడతను బండివాళ్ళు నివసించే ప్రాంతందాటి

'ఇమామిదీన్‌పేట' అవతల 'కమిటీ'కి చెందిన పెద్ద మైదానం పక్కనే నడవసాగాడు. ఆ మైదానంలో ప్రతిరోజూ ఏదో ఒక కార్యక్రమం జరుగుతూనే వుంటుంది. వర్షాకాలంలో ప్రతి ఆదివారం కుక్కలపోటీ జరుగుతుంది. ప్రజలు పందాలుకాస్తూ వుంటారు. గాయపడిన కుక్కలు మైదానం దాటి పారిపోవటానికి ప్రయత్నంచేస్తూవుంటే చుట్టూ వున్న గుంపు వాటిని బయటకు వెళ్ళనీయకుండా అడ్డుకుంటూ వుంటారు. ఇక్కడే బయట ఊరు నుంచి వచ్చే సర్కస్ ప్రదర్శనలు జరుగుతుంటాయి. సామాజిక ఉత్సవాలు పండగలూ కూడా జరుగుతుంటాయి. ముస్లింలీగ్ పార్టీ ప్రదర్శనలన్నీ ఇక్కడే జరుగుతాయి. కాంగ్రెసుపార్టీ ప్రదర్శనలు మాత్రం ఇక్కడకు దూరంగా ధాన్యం మార్కెట్ దగ్గరవున్న మైదానంలో జరుగుతూ వుంటాయి.

నత్తూ జేబులో నుండి బీడీ కట్ట తీసి ఓ బీడీ కాల్చసాగాడు.

అప్పుడే ఇమామిదీన్‌పేట వెనకవైపున వున్న మసీదు నుండి నమాజు విన్పించసాగింది. చీకటి క్రమక్రమంగా తొలగిపోయి అంతా స్పష్టంగా కన్పించసాగింది. నత్తూ బీడీ ఆర్పి ఇమామిదీన్‌పేట సందులోకి సాగిపోయాడు. మురాద్ అలీ ఈ కమిటీ మైదానానికి దగ్గరలోనే ఎక్కడో వుంటున్న విషయం గుర్తుకువచ్చింది. ఖచ్చితంగా ఎక్కడవుండేదీ తెలియదుగాని మురాద్ అలీ ఒకటి రెండుసార్లు ఈ వైపు నుండే రావటం నత్తూ చూసాడు. అయితే మురాద్అలీ చేతిలో సన్నని బెత్తం పట్టుకుని ఏదో ఒక వీధివెంట ఎప్పుడూ తిరుగుతూ కన్పిస్తాడన్న విషయం కూడా అతనికి జ్ఞప్తికివచ్చింది. నల్లని పట్టుమైన అతని మీసాలు అతని పళ్ళను కనిపించనీయవు. అతను నవ్వినా అవి కన్పించవు. తీక్షణమైన అతని చిన్న కళ్ళు పాముకళ్ళులాగా మెరుస్తూ వుంటాయి. బహుశా అతను ఇక్కడే ఎక్కడో కన్పించవచ్చు కూడా! ఇక్కడ నుండి త్వరగా వెళ్ళిపోవడం మంచిది. మురాద్అలీ కన్పిస్తే గొడవ అవుతుంది. అతను పందిని చంపి, దానిని ఎత్తిపంపేవరకు అక్కడే వుండవలసిందని తాకీదు ఇచ్చివున్నాడు. కాని నత్తూ మురాద్ అలీ కోసం ఎదురుచూడకుండా అక్కడనుండి వచ్చేసాడు. పందిని చంపినందుకు డబ్బు ముట్టినతర్వాత ఆ దుర్గంధంలో వుండటం నత్తూకు అవసరమన్పించింది.

నత్తూ ఒక ఇరుకు సందులోకి ప్రవేశించి. కొంచెం దూరం వెళ్ళిన తర్వాత కుడిచేతివైపు వేరొక సందులోకి తిరిగాడు. కొంచెం దూరం వెళ్ళేసరికి ఫకీరు పాటలాగానే ఏదో ఒక గానబృందపు పాటలు విన్పించాయి. అతను ఇంకొంచెం ముందుకు వెళ్ళేసరికి ఆ పాటలు మరింత స్పష్టంగా విన్పించసాయి. నత్తూ అదేదో ప్రభాత ప్రదర్శనకు సంబంధించిన బృందం అనుకొన్నాడు. అప్పటికే పట్టణంలో ఉత్సవాలు, ఊరేగింపులు ఎక్కువగా కన్పించసాయి.



నత్తూకు స్పష్టంగా అర్థంకావడంలేదు. ఆ బృందం ముందు మూడు రంగుల జెండా కన్పించటంతో నత్తూ అది కాంగ్రెస్ బృందం అని తెలుసుకున్నాడు. ఆ బృందం దగ్గరకు వచ్చేసరికి నత్తూ గోడపక్కకు తప్పుకొని చూడసాగాడు. ఆ బృందం పాటపాడుకుంటూ ముందుకు సాగుతుంది. అందులో ఒక పదిమంది వరకువున్నారు. ఒక ళ్ళిద్దరు తెల్లటి గాంధీటోపీ, ఒక ళ్ళిద్దరు తలపై సఫాయీల టోపీలు వున్నాయి. ఇద్దరు ముగ్గురు సిక్కులు కూడా వున్నారు. యువకులు, వృద్ధులూ వున్నారు. వాళ్ళు నినాదాలు చేస్తున్నారు.

"వందేమాతరం"

"బోలో భారత్‌మాతాకీ....... జై".

"మహాత్మాగాంధీకీ......: జై"

కొంచెంసేపటికి ఆ సందుకు ఎదురుగా వున్న సందు నుండి ఒక నినాదం విన్పించింది.

"పాకిస్తాన్..... జిందాబాద్"

"పాకిస్తాన్....... జిందాబాద్"

నత్తూ వెంటనే ఆవైపు తిరిగిచూసాడు. ముగ్గురు మనుష్యులు ఆ సందు మలుపులో నిలబడి నినాదాలు చేయసాగారు. వాళ్ళు ఆ సందు మధ్యలో నిలబడి ఈ కాంగ్రెస్ బృందాన్ని అడ్డుకోటానికి నిలబడినట్లు నత్తూకు అన్పించింది ఆ ముగ్గురిలో ఒకని తలపై మామీటోపీ, కళ్ళకు బంగారు ఫ్రేము కళ్ళజోడు వున్నాయి. ఆ వ్యక్తి సందు మధ్యలో నిలబడి కాంగ్రెస్ బృందాన్ని రెచ్చగొడుతూ మాట్లాడసాగాడు.

"కాంగ్రెస్ హిందువుల గుంపు, దీనితో మహమ్మదీయులకు ఏవిదమైన సంబంధంలేదు."

దానికి సమాధానంగా బృందంలోని ఒక వయసుమళ్ళిన వ్యక్తి సమాధానం చెప్పాడు. "కాంగ్రెస్ అందరికి సంబంధించినది. హిందువులు, సిక్కులు, మహమ్మదీయులు అందరికీ, మహమూద్‌సాహెబ్! ఈ విషయం మీకు కూడా బాగా తెలుసు. మొదట మీరు కూడా మాతో నేవున్నారు కదా?"

ఆ విధంగా అంటూ ఆ వయోవృద్ధుడు ముందుకువెళ్ళి రూమీటోపీ ధరించిన ఆ వ్యక్తిని తన బాహువుల్లోకి తీసుకున్నాడు. కాంగ్రెస్ బృందంలోని కొందరు వ్యక్తులు నవ్వసాగారు. రూమీటోపీ ధరించిన ఆ వ్యక్తి కౌగలి విడిపించుకుంటూ – "బక్షీగారూ! మాకు అంతా తెలుసు – ఇదంతా మీ హిందువుల తెలివితేటలు మాత్రమే. మీ రెన్నయినా చెప్పండి. కాంగ్రెస్ హిందువుల సంఘమే. మహమ్మదీయుల సంఘం ముస్లింలీగ్ మాత్రమే. కాంగ్రెస్ మహమ్మదీయుల......."

రెండు బృందాలు ఒకదానికొకటి ఎదురుగా నిలబడ్డాయి. కొందరు మాట్లాడకుంటున్నారు. మరికొందరు ఒకరిపై ఒకరు కేకలువేసుకుంటున్నారు.

"అటు చూడండి కాంగ్రెస్‌లో సిక్కులు వున్నారు, హిందువులున్నారు, మహమ్మదీయులు కూడా వున్నారు. అరుగో అజీజ్‌గారు హాకీమ్‌గారుకూడా వున్నారు" బక్షీ చేతులు చాచి చెప్పాడు.

"ఈ అజీజ్, హాకీమ్‌లు హిందువుల పెంపుడు కుక్కలు. మాకు హిందువులపట్ల అసహ్యంలేదు. హిందువులు పెంచే ఈ కుక్కల్ని చూస్తేనే మాకు అసహ్యం."

కోపంతో కూడిన ఆ మాటలువిని, కాంగ్రెసు బృందంలోని ఆ యిద్దరు మహమ్మదీయులు మెల్లగా జారుకున్నారు.

"కాంగ్రెస్ అధ్యక్షుడు మౌలానా అజాద్ మహమ్మదీయుడో, హిందువో మీకు తెలియనిదికాదు గదా!"

"మౌలానా అజాద్ హిందువుల పెంపుడు కుక్క. ఇక్కడ ఈ కుక్కలు మీ వెనుక తోకాడించుకుంటూ తిరిగినట్లే, అక్కడ మౌలానా, గాంధీ వెనుక తిరుగుతుంటాడు" ఈ మాటలు విన్న బక్షీ గంభీరంగా చెప్పసాగాడు. "స్వాతంత్ర్యం అంధరికీ సంబంధించినది. హిందూస్తాన్ అందరికీ సంబంధించినవిషయం."

"హిందూస్థాన్ స్వాతంత్ర్యం కేవలం హిందువులకోసమే. స్వతంత్ర పాకిస్తాన్‌లో నే మహమ్మదీయులు స్వేచ్ఛవాయువులు పీల్చుకోగలుగుతారు."

"పాకిస్తాన్ సాధన నా శవం మీద 'మాత్రమే" అంటూ కాంగ్రెస్ బృందంలో ని సన్నగా, మాసినబట్టలు ధరించి, చంకలో బెత్తం పెట్టుకున్న ఒక సర్దార్ ముందుకువచ్చాడు.

ఇదిచూసి కాంగ్రెస్ బృందంలో నివారు నవ్వసాగారు.

"నువ్వాగవయ్యా బాబు." అంటూ ఎవరో అతన్ని మాట్లాడకుండా ఆపటానికి ప్రయత్నించసాగారు. నిజానికి ఆ సర్దార్ మాటలు చాటు నుంచి వింటున్న నత్థూ చాలా ఆందోళనచెందాడు. అందరూ నవ్వటంచూసి వేళాకోళపు మనిషి కాబోలు అనుకున్నాడు.

కాని ఆ సర్దార్‌మాత్రం ఆగలేదు. "పాకిస్తాన్ ఏర్పాటు తన శవంమీద మాత్రమే జరుగుతుందని గాంధీజీ ప్రతిజ్ఞచేసారు. నేను కూడా పాకిస్తాన్‌ను ఏర్పడనివ్వను."

అందరూ మళ్ళీ నవ్వసాగారు.

"అయ్యా! జనరల్‌గారూ! మీరు కాసేపు కోపం ఆపుకోండి!"

"జనరల్! నువ్వు కాసేపు మాట్లాడటం ఆపు." అన్నాడు బక్షీ. కాని జనరల్ రెచ్చిపోయాడు. "నన్నెవ్వరూ నోరుమూయించలేరు. నేను నేతాజీ సుభాష్ చంద్రబోసు సైన్యానికి చెందిన మనిషిని. నాకు అందరి సంగతి తెలుసు. మీ సంగతి కూడా తెలుసు........"

అందరూ మరల నవ్వసాగారు.

"కాంగ్రెస్ బృందం ముందుకుసాగగా, రూమీ టోపీ ధరించిన వ్యక్తి వానిని అడ్డుకున్నాడు. "మీరు యిటు వెళ్ళవద్దు. ఇది మహమ్మదీయులు నివసించే ప్రాంతం."

"వెళ్ళటానికి ఎందుకు వీలులేదు? మీరు పాకిస్తాన్ నినాదాలు చేసుకుంటూ నగరమంతా తిరుగుతున్నారు. మిమ్మల్ని ఎవరు ఆపుతున్నారు? మేము కేవలం దేశభక్తి గీతాలు మాత్రమే పాడుకుంటూ వెళుతున్నాం."

ఈ మాటలు విన్న రూమీ టోపీ వ్యక్తి కంగారుపడ్డాడు. "మీరు వెళ్ళదలుచుకొంటే వెళ్ళవచ్చు. కాని ఈ కుక్కల్ని మాత్రం మా ఇళ్ళ దగ్గరకు రానివ్వం" అంటూ చేతులుచాచి దారి అడ్డుకుంటున్నట్లు నిలబడ్డాడు. అప్పుడు ఆ రూమీ టోపీ వ్యక్తి వెనుక వున్న మురాద్‌అలీని నత్థూ చూసాడు. మురాద్‌అలీని చూడగానే నత్థూకు కంపరమెత్తింది. 'వీ డెక్కడి నుండి దాపురించాడు' అనుకుంటూ నత్థూ గోడపక్కన నక్కుతూ ఈ భజన బృందం వెనుకకు చేరాడు. అక్కడ నుంచి మురాద్‌అలీ కూడా అతనికి కనపడడు. కొంచెంసేపయిన తర్వాత నత్థూ మెల్లగా తల యెత్తి చూసాడు. మురాద్‌అలీ అక్కడే నిలబడి సంభాషణ వింటూ కన్పించాడు.

నత్థూ మెల్లగా వెనకకు నడవసాగాడు. అక్కడ గొడవజరుగుతున్నంత సేపు మురాద్‌అలీ తనను చూడడని, ఈలోగా తాను పారిపోవచ్చునని తలంపు. మురాద్‌అలీ తన్ను చూస్తే తప్పక ప్రశ్నలతో వేధిస్తాడని భావించిన నత్థూ మెల్లగా వెనకకు నడిచి ఒక్కసారి వెనక్కుతిరిగి వేగంగా అడుగులువేస్తూ, సందుతిరిగి పరుగెత్తి వెళ్ళిపోయాడు.

* * *

గుట్టమీదకు వెళ్ళినతరువాత ఇద్దరూ తమ గుర్రాలను ఆపివేసారు. ఎదురుగా వెడల్పాటి లోయ. కొండల చివరి వరకు వ్యాపించినట్లు కన్పిస్తుంది. దూరంగా ఆకశంలో ఏడు రంగులు కన్పించసాగాయి. విశాలమ్మైన మైదానం, చిన్నచిన్న కొండలు. నీలాకాశం! ఆ దృశ్యం ఎంతో మనోహరంగా వుంది. అక్కడ సూర్యోదయం అద్భుతంగా కన్పించసాగింది.

ఆ అద్భుత దృశ్యాన్ని చూపించడానికే రిచర్డ్ తన భార్యను అక్కడకు తీసుకువచ్చాడు. రిచర్డ్ పక్కకు తిరిగి లీజా ముఖంలోకి చూసాడు. ఈ ఆ దృశ్యం ఆమెపై ఎటువంటి ప్రభావంకలిగించిందో తెలుసుకోవాలన్న కుతూహలం కళ్ళలో కన్పించింది. ఎంతోకాలంగా దాచివుంచిన బహుమతి, ఆప్యాయంగా అందించినట్లు ఇక్కడి సూర్యోదయాన్ని లీజాకు చూపించాలనుకున్నాడు రిచర్డ్.

చల్లని ఉదయపు పిల్లగాలులు లీజా బంగారు శిరోజాలను ఆడిస్తున్నట్లున్నాయి. ఆమె నీలికళ్ళల్లో ఒక ప్రత్యేక స్వచ్ఛత, మెరుపు వున్నాయి. కళ్ళకిందమాత్రం నిద్రలేని కారణంగాను, ఎక్కువ బీరు సేవించిన కారణంగాను ఉబ్బుగా వుంది.

లీజాను సంతోషపెట్టడానికి రిచర్డ్ ఇక్కడకు తీసుకొచ్చాడు. లీజా ఆరు నెలల తర్వాత విదేశాలనుండి తిరిగివచ్చింది. ఇక్కడి పరిసరాలతో విసుగుచెంది ఆమె ఎక్కడ తిరిగి విదేశాలకు వెళుతుందో అని రిచర్డ్ భయం. ఆమెకు ఈ పట్టణం నచ్చకపోతే యిక్కడ నివసించడం యిద్దరకూ నరకప్రాయం అవుతుంది. అతను పగలంతా ఆఫీసులో పనిచేసివచ్చిన తర్వాత ఇంటిదగ్గర ఇద్దరిమధ్యా తగాదా ప్రారంభమవుతుంది. అందుచేత రిచర్డ్ ఉదయమంతా





# న్యాయపీఠం



బి.బి.రావు. ఎమ్.ఏ.ఎల్ఎల్.బి.

## మోటార్ ఏక్సిడెంటులో నష్టపరిహారం అన్నదమ్ములకు చెల్లించవచ్చును

గుజరాత్ స్టేట్ రోడ్ ట్రాన్స్‌పోర్ట్ కార్పొరేషన్ వారి బస్సు భానూభాయ్ అను 14 సంవత్సరాల బాలుని గుద్దుకొనడం వలన భానూభాయ్ మరణించాడు. రామన్‌భాయ్ మరియు దినేశ్‌భాయ్ అన్నదమ్ములు. భానూభాయ్ మరణించినందున అతని అన్నదమ్ములు రామన్‌భాయ్ మరియు దినేష్‌భాయ్ ఇద్దరూ బరోడాలోని మోటార్ ఏక్సిడెంట్స్ క్లయిమ్సు ట్రిబ్యూనల్‌లో నష్ట పరిహారం కోసం పిటిషన్ పెట్టారు. భానూభాయ్‌కు లీగల్ రిప్రజెంటేటివ్ క్రింద ఇద్దరు అన్నదమ్ములు పిటిషన్ పెట్టారు. ట్రిబ్యునల్ 32,000 రూపాయలు నష్ట పరిహారం క్రింద చెల్లించాలని గుజరాత్ స్టేట్ రోడ్ ట్రాన్స్‌పోర్టుకు ఆదేశాలు జారీ చేశారు. ఈ ఉత్తర్వు మీద స్టేట్ రోడ్ ట్రాన్సుపోర్టు వారు గుజరాత్ హైకోర్టులో అప్పీలు పెట్టుకున్నారు. మోటారు వాహనాల చట్టంలోని 110-బి శెక్షన్ క్రింద అప్పీలు పెట్టుకున్నారు. గుజరాత్ హైకోర్టు 1986లో అప్పీలు డిస్మిస్ చేశారు. ఈ తీర్పు మీద స్టేట్ రోడ్ ట్రాన్స్‌పోర్టువారు సుప్రీమ్ కోర్టులో స్పెషల్ లీవ్ పిటిషన్ దాఖలు చేసుకున్నారు. మరణించిన భానూభాయ్ యొక్క అన్నదమ్ములకు నష్ట పరిహారం చెల్లించడానికి వీలు లేదని 1855 సంవత్సరం ఫేటల్ ఏక్సిడెంట్స్ చట్టం ప్రకారం నష్ట పరిహారం మీద అన్నదమ్ములకు హక్కు లేదని రోడ్ ట్రాన్స్‌పోర్ట్ కార్పొరేషన్ వారు వాదించారు. వారి వాదనకు బలంగా మధ్యప్రదేశ్ హైకోర్టు 1981లో ఇచ్చిన తీర్పు కూడా ఉదహరించారు. గుజరాత్ హైకోర్టు వారు 1977లో గుజరాత్ హైకోర్టు వారు ఇచ్చిన తీర్పును అనుసరించారు.. సుప్రీమ్ కోర్టు వారు తమ తీర్పులో. 1981లో మధ్యప్రదేశ్ హైకోర్టు ఇచ్చిన తీర్పును త్రోసిపుచ్చారు. శెక్షన్ 92-ఎ ప్రకారం మరణించిన వారి బంధువులకు 15 వేల రూపాయలు, వికలాంగులైన వారికి 7,500 రూపాయలు చెల్లించాలి. వాహనం యొక్క యజమాని లేక మరియొకరి నిర్లక్ష్యం వలన ప్రమాదం జరిగినట్లు ఋజువు చెయ్యనక్కరలేదు. అంతే కాకుండా 109-ఎ నుంచి 109-సి శెక్షన్ల ప్రకారం లీగల్ రిప్రజెంటేటివ్‌లకు నష్ట పరిహారం చెల్లించాలి. ఈ సవరణలు ఆధునిక సంఘం వలన కలిగే పరిస్థితిని సరిదిద్దడానికి ప్రభుత్వం చేసిన ప్రయత్నం. 110-ఎ శెక్షన్ ప్రకారం, లీగల్ రిప్రజెంటేటివ్‌లు నష్ట పరిహారంనకు అప్లికేషన్ పెట్టుకో వచ్చును. ఫేటల్ ఏక్సిడెంట్స్ చట్టంలోనే 1--ఒ శెక్షన్‌కు మోటార్ వాహనాల చట్టం లోని 110-ఎ శెక్షను ఒక సవరణ. ఈ సవరణ ప్రకారం 1-ఎ శెక్షను రద్దు అవుతున్నది. కనుక మరణించిన వ్యక్తి యొక్క అన్నగాని, తమ్ముడుగాని, 110-ఎ శెక్షను ప్రకారం నష్ట పరిహారం కొరకు పిటిషను పెట్టవచ్చును. భర్త లేక భార్య, తల్లి దండ్రులు, పిల్లలు మాత్రమే కాకుండా అన్నదమ్ములు కూడా లీగల్ రిప్రజెంటేటివ్‌గా అర్థం చేసుకోవాలి అని 1987లో సుప్రీం కోర్టు తీర్పు చెప్తూ పిటిషన్ డిస్మిస్ చేశారు. □

లీజాతో నే గడపాలని నిశ్చయించుకున్నాడు. అందులో భాగంగానే గత వారం రోజులుగా ఆమెను బయటతిప్పుతున్నాడు. లీజాకూడా రిచర్డ్ అభిరుచులను పంచుకోడానికి తన వంతు ప్రయత్నంచేస్తూనేవుంది. జిల్లా డిప్యూటీ కమీషనర్ భార్యగా ఆమె ఒంటరిగా బయటకివస్తే దేశీయులు ఆమెకు వంగి సలాములు చేయటమే కాకుండా, ఆమె ఆజ్ఞలు నిర్వర్తించడానికి సదా సిద్ధంగా వుంటారు. అయితేమాత్రం ఒంటరిగా ఎంతకాలం తిరగగల్గుతుంది. డిప్యూటీకమీషనర్ కార్యక్రమం అతనిచేతుల్లో ఉందన్న సంగతికూడా ఆమెకు తెలుసు. కావాలనుకున్నా ఇద్దరి బంధం ఎంతకాలం కొనసాగుతుందా అన్న భయం ఇద్దరి మనస్సులోనూ వుంది.

"ఇక్కడ చాలా బాగున్నది. ఆ ఎదురుగా వున్న కొండ ఏమిటి? ఇక్కడనుండే హిమాలయ పర్వతాలు మొదలౌతాయా?" లీజా కుతూహలంగా ప్రశ్నించింది.
"అవుననుకుంటాను - ఇక్కడినుండే ఈ లోయ కొండలమధ్యగా వందలమైళ్ళు వ్యాపించివుంది" రిచర్డ్ ఉత్సాహంగా సమాధానం చెప్పాడు.

"ఎంతపెద్దలోయ!" అంది లీజా ఆశ్చర్యంతో.

"పెద్దదేకాదు! చారిత్రక విశేషంకూడా వుంది. హిందూదేశంపై దండెత్తి వచ్చినవారంతా ఈ మార్గం వెంటే వచ్చారు. మధ్య ఆసియా నుంచి వచ్చినవారు. మంగోలియా నుంచి వచ్చినవారుకూడా ఈ మార్గం వెంటనేవచ్చారు. అలెగ్జాండరుకూడా ఈదారివెంటే హిందూదేశంలో ప్రవేశించాడు. ముందుకువెళ్ళిన తర్వాత ఈ లోయ రెండు దారులుగా చీలుతుంది. ఒకదారి టిబెట్ వైపుకు, మరోదారి ఆఫ్ఘనిస్తాన్ వైపుకు. వ్యాపారస్తులు, బౌద్ధమత ప్రచారకులు ఈ దారులవెంటే ప్రయాణించేసారు. ఇది చరిత్రప్రసిద్ధిచెందిన ప్రాంతం. నేను గత నెలరోజులుగా ఈ ప్రాంతమంతా తిరుగుతున్నాను. చరిత్రకారులకు ఈ ప్రాంతం విలువకట్టలేనటువంటిది. ఎక్కడచూసినా ప్రాచీన భవనాల శిథిలాలు, కోటలు, బౌద్ధవిహారా, సత్రాలు ........" రిచర్డ్ తన్మయత్వంతో చెప్పుకుపోతున్నాడు.

అతని తన్మయత్వాన్ని గమనించిన లీజా "రిచర్డ్! ఇదేదో నీ మాతృదేశంగానే మాట్లాడుతున్నావే!" అంది నవ్వుతూ.

"దేశం మనదికాదు లీజా! కాని చరిత్రకు సంబంధించిన విషయం మనది కూడా కదా!" రిచర్డ్ చిరునవ్వుతో అన్నాడు. తర్వాత చేతిలోని గుర్రం తోలే కమ్చితో కొండవైపు చూపిస్తూ "ఆ కొండవెనక దాదాపు పదిహేడు మైళ్ళ దూరంలో తక్షశిలా శిథిలాలున్నాయి. తక్షశిల నీకు తెలుసుకదా?" అన్నాడు.

"తెలుసు. విన్నాను."

"గతంలో అక్కడ పెద్ద విశ్వవిద్యాలయం వుండేది!"

లీజా చిన్నగా నవ్వసాగింది. రిచర్డ్ ఆ ప్రాంతపు చరిత్రంతా వినిపిస్తాడని ఆమెకు అర్థమైంది. రిచర్డ్ ఉత్సాహం ఆమెకూ ఆనందాన్ని కల్గించింది. రిచర్డ్ చిన్న విషయాలనుకూడా ఎంతో విపులంగా చెప్తూవుంటాడు. తాను డిప్యూటీకమీషనర్ నన్న సంగతే మర్చిపోతుంటాడు. వాస్తవానికి లీజాకు కూడా ఆ విషయాలంటే ఇష్టమే.

(ఇంకావుంది)



# ఈకాలం పిల్లలు....

కె. నాగేశ్వరి

అహంకారం అంటే "ఇగో" ఎలా మనుష్యులలో పెరుగుతుంది? రంగు, రూపు, రుచిలేని ఈ గుణం అవలక్షణమా? లేక దుర్గుణమా?

ఇది ముందు అవలక్షణంగా వుండి దురహంకారం కింద పెరుగుతుంది. దురహంకారం దుర్గుణంకంటే చెడ్డది.

ఇది ఏ వయసునుండి పెరుగుతుంది? సైన్సు ప్రకారం జీన్సుద్వారా సంక్రమిస్తుందా? వంశపారంపర్యలక్షణమా? అనే ప్రశ్న తెన్నివచ్చినా యిది మాత్రం మనుష్యులకి ప్రమాదకరమైన లక్షణమే! దీనికి స్త్రీ పురుషభేదం లేదు. గొప్పా బీదా తారతమ్యం అంతకంటేలేదు. అందచందాలతో, రూపలావణ్యాలతో పనిలేదు.

ఒకవిధంగా చెప్పాలంటే. యిది పిల్లలదగ్గర పెద్దవారు చెప్పుకొనే గొప్పలద్వారా కూడా సంక్రమించడానికి అవకాశంవుంది. ఉదాహరణకు ఈ రోజుల్లో ఎంతటి మూర్ఖపు కుటుంబాలవారు కూడా పిల్లలను బడికి పంపుతారు. అక్కడందరు పిల్లలూ విధిగా యూనిఫారం ధర్మమా అని ఒకే దుస్తులు వేసుకుంటారు. కొందరు పిల్లలు తిండిదగ్గర వేరువేరు అభిరుచులు కలిగివుంటారు. దానికింత పొడుగున సాగదీసి "మా పిల్లవాడు వెన్నకాచిన నెయ్యి తప్ప వేసుకోడు! చేతో వేస్తే తినడు. వేడివేడి అన్నమే వుండాలి. వేపుడు కూరలే తింటాడు! అందరిముందూ తినడానికి నామోషి! వాడి తిండి వాడికే తెలియదు!" మొదలైనవాటిని గొప్పగా చెబుతారు. పొద్దున్న వెళ్ళిన కుర్రాడికి శ్రద్ధగా చదివితే ఆకలిందుకువెయ్యదు. ఆడుతూ



పాడుతూండే వయసులో వేడి చల్లదనం ఏమిటి? ఎవరికేది యిష్టమో అది తింటారు. అదికూడా ఒక గొప్పలక్షణమా? దాంతో వాళ్ళకి చుట్టుపక్కల వారంతా గడ్డితింటున్నట్లు తా మొక్కరే అన్నం తింటున్నట్లు ఒక భావం ఏర్పడుతుంది.

ఈకోవకి యిప్పుడు ఆడపిల్లలు కూడా చేరుకున్నారు. "మా పిల్ల చిక్కుడుకాయ కూరని పుల్లముక్కలంటుంది. మీ పిల్ల ఏదిపెట్టినా తింటుంది." అంటే అవతలి పిల్ల తక్కువ, తమపిల్ల ఎక్కువ అన్న అహంకారాన్ని తల్లే పిల్లలో పెంపు చేస్తున్నట్లుకాదా? సైన్సుచదివే పిల్లలకి చిక్కుడుకాయలో వుండే పోషకపదార్థాలు, విటమినుల సంగతి తెలియదా? యింక యిదివిని నేనేం తీసిపోయానా అని అవతలిపిల్ల కూడా చిక్కుడుకాయ కూరనిచూసి "ఛీ! చిక్కుడుకాయ కూరా?" అని అంతెత్తున ఈసడించడం – అవతల తల్లి పిల్లకి మంచిలక్షణాలు అలవాటు అవాలంటే వెంటనే "తింటేతిను. లేకపోతే యింకోటివేసుకుని ముద్దమింగు. అవతలివారికి యిష్టమైతే ఏం అనుకుంటారు. ఇంట్లో అంటే అన్నావుగాని నలుగురిలో యిలా అను, నిన్ను కూడా వారు నీ కిష్టమైంది నువ్వు తినేప్పుడు "అబ్బే! బంగాళా దుంపల కూర చూస్తేనే డోకు" అంటారు. అప్పుడు నీ కెలాగుంటుంది? పెద్ద నీకే రుచులు తెలిసినట్లు. తెలివితక్కువవాలకంచేస్తలూ!" అని తిట్లతో తలంటుతుంది. ఆ పిల్ల నాలుగుసార్లు గునిసినా, అయిదోసారి ఆ ధోరణివదిలి యధావిధిగా వుంటుంది.

వయసువస్తే కర్రికాకి అయినా కళగా వుంటుంది. అలాగే ఈనాటి నాగరికయుగంలో అందమైనవారిని అనాకారులుగా, అనాకారివారిని అందమైనవారిగా మార్చే చిట్కాలు, సౌందర్య సాధనాలు, దుస్తులు ఎంతో తోడ్పడుతున్నాయి. వీటి ధర్మమా అని ఎవరికినచ్చిన హీరోయిన్ గెటప్‌లో ఆడపిల్లలూ, హీరో గెటప్‌లలో మగపిల్లలూ తయారవవచ్చు, వర్తమానకాలంలో అడ్వర్టైయిజుమెంట్లను కంఠస్థం చేయడం మొదలైనవి సరేసరి! అంతవరకూ ఫాస్ట్ మెయిల్ సర్వీసులా సాగినచదువు పాసింజరు తీవల్లోకి వచ్చేస్తుంది. అహంమాత్రం మంచి స్థాయిలో వుంటుంది. ఇంట్లోకంటే ఈరకం ఆడామగా బంధువుల యిళ్ళలో పెళ్ళిళ్ళలో, పేరంటాలలో తమ అహంభావం ప్రదర్శిస్తారు.

"ఛీ! ఛీ! ఛీ! సాంబారు అలావుందేంటి. ఆ కూర చూస్తేనే వికారంగా వుంది" అంటుందో పదో తరగతి దండయాత్ర కొట్టిన అమ్మాయి. అదీ ఎవరితో, పినతల్లో, మేనత్తో లేక తండ్రికో, తల్లికో మిత్రురాలు అయివుండొచ్చు. తన యింటికివచ్చి తననే వంకబెడుతున్న ఆ పిల్ల అహంభావం అగ్నిజ్వాలలా ఆ యిల్లాలిని చుట్టుముడుతుంది ఆ పిల్లమీద అంతవరకూ వున్న అభిమానం మాయమవుతుంది. వివేకంగలదైతే ఊరుకొని ఆ పిల్ల ఖర్మానికి ఆ పిల్లనే వదిలేస్తుంది. కొంచెం అమాయకురాలైతే "అదేమిటి? నే నెప్పుడూ యిలాగే చేస్తాను. ఏమైంది?" అని ఎదురు ప్రశ్న వేస్తుంది. ఈమెగారి అహంకారం మరింత ఎక్కువై అందుకే నేను చదువాపేశాను.



నువ్వలా పది నిముషాల్లో అయిందనిపించావు. నే నైతేనా యిలా చెయ్యను" అని ఈసడించి వారి ఆర్థికస్తోమతు చూడకుండా యిష్టమొచ్చిన సలహాలు యిస్తుంది. ఇటువంటి అమ్మాయికి సంబంధం చూడాల్సిన బాధ్యత ఓ యిల్లాలిమీద పడింది. ఆవిడ ఆ పిల్ల అహంకారం కప్పిపెట్టి, పనిబాటచ్చుననే సద్గుణాన్ని అంటగట్టి సంబంధాలు వెదకనారంభించింది. చివరికి ఆ అమ్మాయికి సంబంధం మాట దేముడెరుగు, ఆ పిల్ల అహం ఆమె మనసును కాల్చింది. "ఆవిడా? ఆవిడకి పనిరాదు. నేనే చేస్తాను. మంచిచీర కొనుక్కోడంచేతకాదు. దర్జాగా వుండడం చాతకాదు. ఉత్త పిచ్చిది." అని ప్రోపగాండా మొదలెట్టింది. ఆవిడ పరిచయస్థులు ఆవిడని "నీ కెందుకు? ఆ పిల్ల నిన్ను అలా చులకన చేస్తూంటే వెనకేసుకొస్తావు. అంత అహంకారిని ఎవడు చేసుకుంటాడు?" అని తిట్టారు. చెయ్యని నేరానికి ఆమె పడరానిమాటలు పడింది.

ఇంక మగపిల్లల సంగతి తీసుకుంటే, తల్లి పిల్లవాడ్ని "బాగా చదువుకో నాయనా, నీకు పొద్దున్న బోర్నవిటా, సాయంత్రం హార్లిక్సు, మూడుపూటలా భోజనం అమరుస్తాను. మా చిన్నప్పుడు పదిమందిలో పుట్టి అన్నిటికీ యిబ్బందిపడ్డాం. కనీసం పిల్లలన్నా ఒక హోదాకి వస్తే సంతోషిస్తాం" అని అప్పోసప్పోచేసో,




తెలిసినవారిని నోరువిడిచి సహాయం అడిగి అన్ని సమకూరుస్తుంది. ఆ పిల్లవాడు పదవతరగతి వరకూ శుభ్రంగా చదువుతాడు. ఇంక మొదలవుతుంది అతగాడిని అహంకార పొరపేరుకోడం.

"మావాడు వాళ్ళనాన్నలా ఎదుగూబొదుగూలేని ఉద్యోగం చెయ్యడు. మా తోడికోడలు పెద్ద మిడిసిపడింది. వాళ్ళాయనే పెద్ద ఉద్యోగం చేస్తున్నాడని. మా వదిన తెగనీల్గుతుంది మాకంటే వాళ్ళేమెట్టు పైనున్నారని. మావాడూ ఆ స్థితికి వస్తాడు." అంటుంది అమాయకమైన హృదయంతో! ఏదో పరిస్థితిలో వారి అహం గర్వం ఈమె హృదయాన్ని గాయపరచొచ్చు. పాపం అది దాచుకోలేని అమాయకురాలు ఖర్మకాలి, ఈకాలపు కుర్రాడి ముందు నోరుజారడం, ఆ పిల్లవాడు అదేపట్టుకుని ఓ చెంపచదువుతూ, ఇంకో చెంప తానుచూసిన తెలుగుసినిమాలు గుర్తుకుతెచ్చుకోడం" నీ అంతు చూస్తా! నీపనిపడతా!" మొదలైన పగసాధింపు చిత్రాల్లోని హీరోలా చాతీ వెడల్పుచేసుకుని ఎగిరిపడతాడు. చదువు పూర్తయి ఉద్యోగం వచ్చేనాటికి యితడెంత దురహంకారిగా తయారవుతాడో ఊహించండి? నిజానికి అహంకారం, పంతాలు, పగలు, కక్షలు. ద్వేషాలు ప్రస్తుతం ఈ రోజుల్లో పనిచెయ్యవు. ఓర్మి, పెద్దలయెడ వినయం, తెలియన్వితెలుసుకోవాలనే ఆసక్తి, విషయ పరిజ్ఞానం యివీ ఈరోజుల్లో కుర్రాళ్ళకి, అమ్మాయిలకీ ప్రధానం. అహంకారం గురించి వ్రాసేకొలదీ తరగదుగానీ, యువతీ యువకులని అహంకారం అదఃపాతాళానికి తోస్తుంది. ఎంతటి వివేకవంతులైనా అహంకారులని చూసి వీరెటూ మన దారికిరారు అని దూరంగా వుంటారు. అది మంచిదికాదుకద! □

# షేర్ మార్కెట్‌లో పెట్టుబడులు



**-యన్. రామ్‌జీ, న్యూఢిల్లీ**

ఈ పబ్లిక్ ఇష్యూలలో పెట్టుబడి పెట్టడం వలన ఆదాయపు పన్ను పరిధిలో వున్న మధ్య తరగతి వారికి కూడా చాలా లాభాలు వున్నాయి. ఎలాగంటే వీరు సంవత్సరానికి 20 వేల రూపాయిలు పబ్లిక్ ఇష్యూలలో పెట్టుబడి పెడితే, దానిలో 50 శాతానికి అంటే పదివేల రూపాయిల వరకు పూర్తిగా ఆదాయపు పన్ను రాయితీని పొందకల్గుతారు. దీనినే 80 సి. సి. బెనిఫిట్ అంటారు. అంతేకాక ఈవిధంగా తీసుకున్న వాటాల మీద వచ్చే డివిడెండ్‌ల మీద రు. 7,500 వరకు ఆదాయపుపన్ను రాయితీ కూడా పొందకల్గుతారు.

మనం మొదట ఈ ప్రాస్పెక్టస్‌ను పరిశీలిద్దాము. ఈ మధ్యనే విడుదల చేసిన కేమ్లిన్ లిమిటెడ్ అనే కంపెనీని పరిశీలిద్దాము. ఈ కంపెనీ 40 సం. లపైగా వున్న కంపెనీ అయిన కారణంగా దీనికి 80 సి. సి. బెనిఫిట్ లేదు. ఈ 80 సి. సి. బెనిఫిట్ రావాలంటే క్రొత్త కంపెనీ అయ్యుండాలి. వీరు తమ యొక్క ప్రాస్పెక్టస్‌లో మొదట ఇష్యూ హైలైట్స్‌ను పరిశీలిద్దాము.

(ఎ) 41 సంవత్సరాలు క్రమం తప్పక డివిడెండ్ చెల్లిస్తున్న కంపెనీ. ఇది మంచి అంశం. ఎందుకంటె వచ్చిన లాభాలను కనీసం ప్రస్తుత వాటాదారులు పంచుకోవటం. కాని వీటి లెక్కలు. అన్నీ కూడా ఇంతవరకు రహస్యంగా వుండటం మూలంగా దీన్ని పూర్తిగా నమ్మటానికి కూడా అవకాశం లేదు.

(బి) అభివృద్ధిలో చక్కని రికార్డు. దీని గురించి మనందరికి కూడా తెలుసు. వ్రాయటం, చదవటం వచ్చిన వారందరికి వారి సిరా గాని వారి పెన్‌లు గాని తెలియక పోవటం అనేది లేదు.

(సి) ఎన్నో రకాలైన ఉత్పత్తుల తయారీలో అగ్రగాములు! అన్ని ఉత్పత్తుల్లో అగ్రగాములు అవునో కాదో కాని కొన్ని వస్తువులలో వీరిది అగ్రస్థానం వుంది. ముఖ్యంగా చిత్రకారులకి పనికి వచ్చే సామగ్రిలో.

(డి) ఎస్యూర్డ్ అండ్ గ్రోయింగ్ మార్కెట్! గ్రోయింగ్ మార్కెట్ అనేది వాస్తవమే. కాని వీరి కంపెనీకి ఎంత వరకు ఎస్యూరెన్స్ వున్నది అనేది ఇంక ముందు ముందు తెలియాలి. ఎందుకంటే వీరికి ఇంత వరకు పూర్తి పోటీ రాలేదు. నిజంగా పూర్తి పోటీ వస్తే అప్పుడు వీరి సత్తా తెలుస్తుంది. ఉదాహరణకు ఒక సాధారణ వ్యక్తి ఒక చిన్న వుద్యోగం చేసుకుంటూ 15 సంవత్సరాల క్రిందట ఒక చిన్న డిటర్జెంట్‌ను చాలా తక్కువ ధరకు తయారు చేసి, మొదట్లో ఇంటింటికి తిరిగి అమ్ముతూ తరువాత తన ఉద్యోగానికి రాజీనామా చేసి పెద్ద మొత్తంలో తయారు చేసి, నేడు హిందూస్థాన్ లీవర్ అనే ఒక పెద్ద బహుళజాతి కంపెనీ యొక్క పునాదులు కదిపి వేస్తున్నాడు. ఆ ఉత్పత్తి ఏమిటంటె 'నిర్మా'! దీన్ని ఎవరు వూహించారు చెప్పండి. కాబట్టి ఇంత వరకు కేమ్లిన్‌కి పోటీ లేదు కాబట్టి సరిపోయింది. రేపు అనేది మన చేతులలో లేనిది కాబట్టి, ఈ విషయానికి. ఎక్కువ ప్రాముఖ్యత ఇవ్వవలసిన పనిలేదు.

(ఇ) దేశం అంతటా పటిష్ట మైన మార్కెటింగ్ వ్యవస్థ : ఇది వాస్తవమే లేకుంటే ఇంత ప్రసిద్ధి గాంచటం కష్టమే కదా!

(ఎఫ్) అమ్మకానికి పెడితే పూర్తి సంవత్సరం డివిడెండ్ : దీని గురించి పెద్దగా కామెంట్ చేయవలసిన పనిలేదు.

(జి) అహమ్మదాబాదు, బొంబాయి, ఢిల్లీ, మదరాసు, పూనా స్టాక్ ఎక్స్ఛేంజ్‌లలో నమోదు చేసి తేలికగా మార్చుకోవచ్చు : ఈ విషయంలో ఈ కంపెనీ వారిని అభినందించక తప్పదు. ఎందుకంటె ఒక్క రిలయన్స్ తప్ప, నాకు తెలిసినంత వరకు ఎవరూ ఈవిధంగా చేయలేదు. దీని వలన ఇన్వెస్టర్స్‌కు సరైన ధరకు అమ్ముకోవటానికి అవకాశం కల్గుతుంది. అంతే కాక ఈ కంపెనీ నుంచి ఏవైన సమస్యలు వుంటే, సువిశాల భారత దేశంలో అన్ని ప్రాంతాల వారికి వారి దగ్గరలో వున్న స్టాక్ ఎక్స్ఛేంజ్‌లకు ఫిర్యాదు చేయటానికి అవకాశం వుంటుంది. అంతేకాక స్టాక్ ఎక్స్ఛేంజ్ సరైన విధంగా పని చేయటానికి వారు దోహదకారి కూడా అవుతున్నారు ఎలాగంటే వీరు ప్రతి సంవత్సరం 5 స్టాక్ ఎక్స్ఛేంజ్‌లకు లిస్టింగ్ ఫీజులు ఇవ్వటం మూలంగా.

దాని క్రింద ఇష్యూ ప్రారంభం 22 జూన్ 1988 అని వుంది చూశారా ఆ రోజు నుంచి ప్రజల వాటాలను వారు స్వీకరిస్తారు అన్నమాట. దీని దిగువ ఎడమ వైపున ఉన్న మానేజర్ టూది ఇష్యూ అనేది బాంక్ ఆఫ్ మహారాష్ట్ర అనేది వున్నది చూశారు. వీరు ప్రకటనలు ఇవ్వటం మిగతావన్నీ ఏర్పాటు

( 77 వ పేజీ చూడండి)





# గొడుగునీడ

కొయితి అప్పారావు

సావిత్రమ్మ పరధ్యానంగా ఆలోచిస్తోంది.... ఆరోగ్యంగా వుండి ఉద్యోగానికి పోయి వస్తున్న భర్త సుదర్శనం.... కంపెనీలో స్టెనోగావున్న కొడుకు రాజశేఖర్... లోటంటూ లేని ఆ చిన్న ఇంట్లో బుల్లి స్వర్గంలో ఏదో లోటు. అన్నాళ్ళూ దగ్గరలోనే వున్న కూతురూ అల్లుడూ.... మనుమడిని తెచ్చి రాత్రింపగళ్ళు ఆడించి తాతా మామయ్యలకా పసిడి నవ్వులు వెదజల్లించేది. కాని ఉద్యోగరీత్యా అల్లుడు దూర తీరాలకు పోవలసి వచ్చింది. విడువలేక గుండెను రాయి చేసుకుని వారిని సాగనంపింది.... రోజులానే ఆరోజు కూడ భర్త కోసం జాబుకోసం ఎదురు చూస్తున్న సావిత్రమ్మకు వర్షంలో తడుచుకుంటూ వచ్చి పోస్టుమన్ ఎరకయ్య జాబిచ్చాడు.

"రమ రాసిన జాబు... తడిసి పోతున్నావు. ఎక్కడైనా కాసేపు ఆగలేకపోయావా!"

"ఎక్కడికక్కడే ఆగిపోతుంటే చేతిలో వున్న ఉత్తరాలు బట్వాడా కావమ్మా! అనుకోకుండా వర్షపు జల్లు. గొడుగు తీసుకురాలేదు."

"యీ గొడుగు వాడు ఎరకయ్యా! తడిచావో జలుబూ జ్వరమూను. ఉత్తరాలు కూడ తడవకుండ బట్వాడా చెయ్యవచ్చు".

"అలాగేనండీ! రేపు తెచ్చిచ్చేస్తాను" అంటూ ఎరకయ్య బీటు చూసుకుంటూ ముందుకు పోయాడు.

ఆతృతగా కూతురు రాసిన జాబు విప్పింది. పదేపదే చదువుకుంది. ఉత్తరంలో మనుమడిచ్చిన ముద్దులకు మురిసి పోతోంది. అప్పటికే తొమ్మిది మాసాల వియోగం. మరో మూడు నెలలకు గాని రారు. అనుకుంటున్న సమయంలో భర్త కొడుకూ తడుచుకుంటూ వచ్చారు. త్వరగా లోనికి రండి. తలలు తుడుచుకుందురు గాని" అంటూ వాళ్ళకు తువాళ్ళిచ్చింది సావిత్రమ్మ.

"పాప... జాబు రాసిందండీ! అందరూ క్షేమమట! బాబు అందరికీ ముద్దులు పంపించాడు" అంటూ సరిగా తల తుడుచుకో లేక పోతున్న కొడుకు తలను స్వయంగా తుడిచింది.

"అదిగో! అప్పుడే తుమ్ములు.... పాపం ఎరకయ్య అలా తడుచుకుంటూనే వచ్చి జాబిచ్చాడు. మనిషితో పాటు ఉత్తరాలు తడిచి పోతాయని నీ గొడుగు ఇచ్చాను రాజశేఖర్" ఆ మాటలకు రాజశేఖర్ విరుచు పడ్డాడు.

"ఆ కొత్త గొడుగు పాడై పోదమ్మా!"

"నే చేసిన పనికి సంతోషించక విసుక్కుంటున్నావు కదు రాజశేఖర్! గొడుగు విప్పకుండ అలానే వుంచితే పురుగులు పట్టి పాడై పోతుంది. వస్తువన్నది అవసరాన్ని బట్టి వాడుతుండాలి. ఎరకయ్య ఒక్కపూట విప్పి వాడటం వలన పాడవదు. ఏదో ఉద్యోగానికి కావలసిన చదువైతే చదివావు కాని నీ మనసింకా వికసించలేదు రాజశేఖర్!"

సుదర్శనం కూతురు జాబు చదువుకుంటూ ముసిముసినవ్వులు నవ్వుకుంటున్నాడు.

"నిరుడు వేసవి గుర్తుందా? ఎండలు మండిపోతున్న రోజులు. వడగాల్పులు. మిట్ట

మధ్యాహ్నం. రోడ్ల మీద జన సంచారం లేదు. లోనతాపం భరించ లేక చాపలపై నీళ్ళు పోసి మాటి మాటికీ దాహం తీర్చుకుంటున్న తరుణంలో పలుకరించిందొక కంఠం. నువ్వా ఎంకయ్యా? సాయంత్రం రాలేక పోయావా? ఎలా తట్టుకోగలుగుతున్నావు?" అనగానే "ఇది రిజిష్టరీ ఉత్తరమమ్మా! సాయంత్రం పూట తీసుకురావడానికి వీలుండదు. ఎప్పటి వప్పుడైపోతుండాలి. ఇదిగోనమ్మా అబ్బాయి చేత సంతకం పెట్టించండి. ఇది అబ్బాయి గారి అపాయింటుమెంటు ఆర్డర్. దీనికోసమే చూస్తున్నారు" అంటూ చిరునవ్వుతో నీకు కవరిచ్చాడు. మనం కొందరికే బంధువులం. కాని పోస్టుమన్ అందరికీ బంధువు. ఆప్తుడు. స్నేహితుడు. నే చేసింది మంచి పనన్న వరకూ నీతో మాట్లాడను. మెప్పుకోసం ఒప్పుకోవడం కాదు. తోటి మానవుడి మీద ప్రేమ వాత్సల్యం నీలో పుట్టుకు రావాలి రాజశేఖర్"! అంటూ వరండాలోకి పోయి కూర్చుంది సావిత్రమ్మ. అలా పావుగంట గడిచింది. తండ్రి చేతిసంజ్ఞతో రాజశేఖర్ తల్లి వద్దకు పోయి తన తప్పిదం ఒప్పుకున్నాడు. సావిత్రమ్మ కొడుకు తలనిమురుతూ "ఇది అర్థం చేసుకోడానికి పావుగంట పట్టిందన్న మాట! ఇంకా మానసికంగా నువ్వు ఎదగాలి రాజశేఖర్ అంటూ అందరూ సమపంక్తిని భోంచేశారు.............

"ఏం! నిద్రరావడం లేదుకదూ!"

"పాప స్థానంలో మరో పాప ఈ ఇంట అడుగు పెట్టాలండీ! వినయ విధేయతలతో అణిగి మణిగి వుండాలి కాని రావడమే తడవు లేవతీసుకు పోయే వాళ్ళు కాదండీ మనకు కావలసింది. మనతో కలిసి పోవాలి. అత్తమ్మలో అమ్మను చూసుకునే కోడలు కావాలండీ! అలా ఐతే రోజంతా నా కెంతో కాలక్షేపం.... బాబుకి పెళ్ళీడు వచ్చిందిగా! మన ప్రయత్నం మనం చేయాలి.

"అలాగే సావిత్రీ! నేకూడ కనుక్కుంటాను. నీ ప్రయత్నం నువ్వు చెయి"....

తెల్లవారింది. ఎవరిపనులకు వారు పోయారు. పది గంటల సమయంలో సావిత్రమ్మను ఓ కంఠం పలుకరించింది.

"నేనమ్మా! ప్రేమ సమాజ సేవకుడ్ని. నెలసరి చందాకొచ్చాను. ఇది ప్రేమా సరస్వతి వివాహ పత్రిక. అబ్బాయి సంస్కార వంతుడు. కావాలని అనాధను కోరి చేసుకుంటున్నాడు. దిక్కులేని వారికి దేవుడే దిక్కమ్మా!" అంటుండగా సావిత్రమ్మ డబ్బిచ్చి రసీదు పుచ్చుకుంది.

"అబ్బాయికి కూడ పెళ్ళి చేయండమ్మా! కూతురు స్థానంలో కోడలులడాలిగా! మరీ ఆలస్యం మంచిది కాదమ్మా!" అంటూ ఆయన వెళ్ళిపోయాడు. సావిత్రమ్మ మనసంతా ఆనందంతో నిండిపోయింది. ఊహాలోకంలో అందమైన అమ్మాయిలను కండ్ల ముందు చిత్రించుకుంటోంది". యీ ఇంటికి శోభ అబ్బాయి పెళ్ళితో సమకూడాలి పరాత్పరా" అని మూగప్రార్థన చేస్తోంది. మరో అరగంట తర్వాత జాబులు లేకపోయినా గొడుగు తెచ్చిచ్చాడు ఎరకయ్య. "వర్షంలో చాల బాగా ఉపయోగ పడిందమ్మా!"

"అందుకేగా ఇచ్చింది. సాయంత్రం ఏమైనా జాబులుంటే యీ జాఫ్రీలో పడెయ్యి ఎరకయ్యా! నాలుగ్గంటలకు ప్రేమసమాజం పెళ్ళికి పోతున్నాం. ఎక్కడైనా పిల్ల కుదిరితే రాజశేఖరానికి కూడ చేసెయ్యాలి."

"చిన్న విషయం అమ్మగారూ! నేనీ ఆఫీసుకు రాకముందు హార్బర్ పోస్టాఫీసులో వుండే వాడిని. ఆ క్వార్టర్సులో మీ వాళ్ళే వున్నారు. మీ పాపలానే వుంటుంది రమణి. పాపం! తలితండ్రుల్లేరు. ఎవరు వెళ్ళి చూసినా నచ్చిందంటున్నారు కాని రాకపోకలు ఇత్యాదు లుండవని ఈసడించుకుంటున్నారు. ఆ అమ్మాయి నొకసారి చూడండి. మీ మనసు కరగక మానదు" అంటూ ఎంకయ్య బీటు చూసుకుంటూ ముందుకు పోయాడు.

"అవును. ధనవంతుల పిల్లలు కట్నమివ్వడమిస్తారు. మీ అబ్బాయిని కట్నమిచ్చి కొనుకున్నానత్తమ్మా అంటుంటారు. స్వేచ్ఛగా తిరగడానికి వేరు కాపుర మంటారు" అలాంటి తలపులతో నాలుగు గంటల వరకూ గడిపిన సావిత్రమ్మ ప్రేమ సమాజం వివాహం చూడ్డానికి పోయింది. అందరితో పాటు తాను కూడ వధూవరుల్ని ఆశీర్వదించి కుంకుమ బరిణి బహుమతిగా ఇచ్చి వచ్చింది సావిత్రమ్మ. అప్పటికే భర్త కొడుకు వచ్చి వరండాలో కూర్చున్నారు.

"ప్రేమసమాజంలో పెళ్ళికి వెళ్ళివచ్చాను. కన్నుల పండుగలా వుందంటే నమ్మండి. అత్తమామల సిరిసంపదలు స్థిరాస్తుల కాంక్షించకుండ అలాంటి వారిని చేసుకోవడానికి సిద్ధపడే వారికి మహాత్ముడిలాంటి మనసు కావాలండీ! రాజశేఖర్ కిలాంటి మాటలు రుచించవు". అంటూ పాస్కులోని కాఫీ తెచ్చిస్తూ, "బాబుకి కూడ ఈ ఏడే పెళ్ళి చేసెయ్యాలండీ!" అనగానే రాజశేఖర్ ముఖంలో వింత అనుభూతి. సహజమైన సిగ్గుతో కాఫీ కప్పుతో ఏకాంతానికి పోయాడు. కాసేపటిలో ఎరకయ్య బుక్‌పోస్టులో వచ్చిన పెళ్ళి కార్డివ్వడానికి వచ్చాడు.

"ప్రొద్దుట చెప్పానే! ఆ అమ్మాయి ఫోటో! ఎంత పనున్నా వెళ్ళి వాళ్ళ మేనమామనడిగి తీసుకొచ్చాను. ఎవరికి వారే తప్పుకుంటుంటే తలితండ్రుల్లేని పిల్లగా ఆ పాప అలా వుండి పోవలసిందేనా! అన్న బాధ నాలో కలిగిందమ్మా! మీ గొడుగు నీడకు ఆ పాప రావాలి" అంటూ ఎరకయ్య వెళ్ళి పోయాడు. ఫోటో చూసిన సావిత్రమ్మ మనసు ఉవ్వెత్తున లేచింది. "ఎంత ముద్దుగా వున్నావమ్మా రేపే వస్తాను. నిన్ను చూస్తాను. నా రాజశేఖర్ కోసమే పుట్టావా అనిపిస్తోంది. ఎరకయ్య అన్నట్టు నా గొడుగునీడలో నీకు శాశ్వత స్థానం కల్పిస్తాను అంటూ ఫోటోను భర్తకు చూపించింది.

"సావిత్రీ! మన పాప పోలికే! బాబుకి కూడ చూపించు. రేపే వెళ్ళి చూద్దాం" అంటూ ఆ ఫోటోన రాజశేఖరానికి కూడ చూపించారు. చూడనట్టే చూస్తూ ఆ అందాన్ని కళ్ళలో నింపుకుని ఆ రాత్రంతా తీయని తలంపులతో నిద్రపోయాడు రాజశేఖర్.

"సావిత్రీ! నిద్ర రావటం లేదు కదూ! కాబోయే కోడల్ని తలంచుకుంటున్నావు".

"అవునండీ! నాకు పగలంతా తోడు. ఆ ఫోటో చూసిన దగ్గర నుంచీ నా మనసు నిలుపుకోలే పోతున్నాను. తలితండ్రుల్లేని అమ్మాయికి య

## గడుసులోకం —బాబు







ఇంట్లో స్థానం కల్పించి మనమే తనకు అత్త మామలతో పాటు తలితండ్రులం కావాలి. ధనవంతులైన కోడళ్ళ అహంభావం వినండి. కేశవయ్యగారబ్బాయి, చదువు సంస్కారమున్న ఆఫీసరు. తల్లితండ్రుల నుంచి భార్య పోరు పడలేక విడిపోయిన విధానం వినండి. ఓ రోజు మిట్ట మధ్యాహ్నం లారీ వచ్చి ఆగింది. ఒక్కొక్క సామాను బండిలో వేస్తున్నాడు. ఏమిటిదంతా అని తల్లడిగితే వేరుగా పోతున్నామన్నారు. ఇదండీ ధనవంతులమని విర్రవీగే కోడళ్ళ తంతు. అత్తమామల్ని కాళ్ళ సంకెళ్ళుగా భావిస్తున్నారు. అందుకే రేపే బాబుతో వెళ్ళి చూద్దాం...."

ఎరకయ్య ద్వారా సావిత్రమ్మ వాళ్ళు పెళ్ళి చూపులకొస్తున్నారన్న వార్త విన్న రమణి మనసు మనసులో లేదు. నాలుగైదు సంబంధాలు వచ్చినా, కట్నం ఇవ్వరేమో అనీ తలితండ్రుల్లేని పిల్ల, అచ్చటా ముచ్చటా తీరకపోవడమే కాక రాకపోకలుండవని స్తూచాయగా అని సంబంధాన్ని తప్పించుకుంటున్న వారే!.... తడబడుతున్న చేతులతో పెట్టిలో వున్న తలితండ్రుల పోటో తీసిచూసింది. రమణి కళ్ళు చెమర్చాయి. ఆలుమగలుగా చిరకాలం జీవించాలని గంపెడాశతో తీయించుకున్న తలితండ్రుల ఫోటో! విధి వక్రించింది. దాని నాసరాగా తీసుకుని తనను వెలివేస్తున్న సంఘం, అభ్యుదయం. సహజీవనం. పురోభివృద్ధి. ఈ తీయని మాటలే ఎక్కడ విన్నా! కాని జరుగుతున్నది దానికి భిన్నం... అనుకుంటున్న రమణిని పెదమామయ్య మోహన్ పలుకరించాడు. ఆ నిలువెత్తు విగ్రహాన్ని రమణి భక్తితో ఆశతో దృష్టిని ఆయన పాదాల మీద కేంద్రీకరించింది.

"మంచి రోజులు రాకమానవు రమణీ! ఎరకయ్య చెప్పాడు. సావిత్రమ్మగారు చాలా మంచివారట!".

"యీ ఫోటో.... ఎప్పటిదో మామయ్యా! పాతబడిపోయింది. పెద్దదిగా చేయించండి. మన బంధువులు అప్పుడప్పుడు మనింటికొచ్చినప్పుడు నా మీద జాలితో గాజులు వేయించుకో పాపా అని ఇచ్చిన డబ్బులు! అలా ప్రోగు చేసిన డబ్బిదిగో మామయ్యా!" అనగానే మోహన్ కన్నీరు కార్చాడు.

"ఆ డబ్బులు నీ గాజుల డబ్బులు. ఎందరో ఆశీర్వదించి ఇచ్చినవి. అందులో ఏ ఒక్కరి ఆశీర్వచనం ఫలించినా యీనాటి సంబంధం స్థిరపడుతుందమ్మా! నా డబ్బుతో యీనాడే దీనిని ఎన్‌లార్జ్ చేయించడానికి స్టుడియోకిస్తానమ్మా! అంటూ "వాళ్ళొచ్చే వేళయింది. అమ్మా నాన్నను ప్రార్థించుకో" అని సావిత్రమ్మ వాళ్ళ రాక కోసం ఎదురు చూస్తున్నారు....

అరగంట వ్యవధిలో సావిత్రమ్మ భర్త కుమారునితో ఆటో దిగింది. ఎదురుగా చిరునవ్వుతో గొడుగు విప్పి ముందుకు వచ్చిన ఎరకయ్య కనుపించాడు. "ఎండ తీక్షణంగా వుందమ్మా! యీ గొడుగు నీడకు రండి. లోన రెండో వరుసలో క్వార్టర్స్. మిమ్మల్ని పరిచయం చేసి వెళ్ళిపోతాను. సంబంధాల విషయంలో ఒకరి ద్వారా మరొకరికి పరిచయం అంతే" అంటూ వాళ్ళ ముగ్గురకూ ఆ ఇల్లు చూపించి వచ్చాడు. రమణిని చూసిన సావిత్రమ్మ దగ్గరగా వెళ్ళి తల నిమిరి ఆశీర్వదించింది. "యీ చాప మీద నా దగ్గరే కూర్చో రమణీ!" అని తన సరసను కూర్చో బెట్టుకొంది. మధ్య మధ్య రాజశేఖర్ ముఖాన్ని పరిశీలిస్తోంది.

కాసేపటిలో ఎవరి ఇంటి విషయాలు వాళ్ళు చెప్పుకున్నారు.

"చూడండి! యీ శుభ సమయంలో కంటనీరు పెట్టడం భావ్యం కాదని నాకూ తెలుసును. రమణిని చూస్తున్న నా మనసు ద్రవించుకు పోతుంటుందమ్మా! ఎవరు చూసి వెళ్ళినా... పిల్ల నచ్చింది కాని తల్లితండ్రుల్లేని పిల్ల అచ్చటా ముచ్చటా తీరదన్న వాళ్ళే కనుపిస్తున్నారు. లేని తల్లితండ్రుల్ని ఎలా తీసుకు రాగలదు చెప్పండి!" అన్న మోహన్ మాటలకు సావిత్రమ్మ రమణిని బుజ్జగించి ప్రక్క గదిలోకి భర్తనూ రాజశేఖరాన్నీ పిలిచింది.

"రమణి నచ్చిందా బాబూ?"

"నచ్చిందనుకో. కాని ఎందరో ధనవంతులు నాకు పిల్లనిస్తామని ఆఫీసుకే వచ్చి వేల మీద కట్న కానుకలిస్తామంటున్నారు. వాళ్ళలో వాళ్ళే పోటీ పడి కట్నం రేటు హెచ్చిస్తున్నారు. ఈ విషయం సమయం వచ్చినప్పుడు చెప్పాలనుకున్నాను. నీవు ప్రేమ సమాజానికి చందా కట్టడంతోనే సరిపెట్టక దీనజన సేవంటూ నన్నిక్కడికి లాక్కు వచ్చావు".

"నువ్వే సంతలో పశువ్వా బేరమాడటానికి. మొన్న ప్రేమ సమాజంలో ప్రేమా సరస్వతి వివాహానికి వెళ్ళొచ్చాను కదూ! ఆ అబ్బాయి తలితండ్రులున్న వాడు. మంచి వాతావరణంలో పెరిగినవాడు. కాని అనాథను కోరి చేసుకున్నాడు. కారణం? అలాంటి వాళ్ళ హృదయాలలో వసంత శోభ కురిపించాలని తలితండ్రులున్న వారే తలితండ్రులెవరో తెలీని వారి పిల్లల్ని చేసుకుంటే నీలాంటి తలితండ్రులు లేని వాడు తలితండ్రులు లేని పిల్లను చేసుకు తీరాలి రాజశేఖర్!".

"నాకు తలితండ్రులు లేరా! పిచ్చిగా మాట్లాడకమ్మా! మీరు నా తలితండ్రులు కారా?

"కాదు బాబూ! నీ తలితండ్రులు లేమిలో మాకు పెంపకానికిచ్చారు. వాళ్ళ ఫోటోను అతి భద్రంగా దాచి వుంచాను. ఎప్పుడైనా నీకా విషయం తెలిస్తే నీ తలితండ్రులెలా వుంటారో అన్న భ్రమ కలుగక మానదు. తెల్సుకొని అడిగావనుకో. అవి నీకు చూపించడం నా బాధ్యత కాదా రాజశేఖర్! నిన్ను పెంచిన తర్వాతనే చెల్లాయి పుట్టింది. నీవు మా ఇంట కాలు పెట్టిన వేళా విశేషం... ఇప్పటి వరకూ సవ్యంగా ఏ ఇబ్బంది లేకుండా జరిగిపోతోంది. అదే నిన్ను వాళ్ళు ఏ మురికి గుంటలోనో పారేస్తే

## ధర్మపథం

# ఉత్తముల దర్శనం

ఏదయినా పని నెరవేర్చడానికి బయలు దేరేటపుడు మంచి శకునం చూడడం మన వారికి పరిపాటి. ముత్తయిదువ గాని, ఏనుగు గాని ఎదురు పడినా, గరుడ దర్శనమయినా అది మంచి శకునమని, కార్యసిద్ధి తప్పదని తలచడం జరుగుతుంది. చెడ్డ శకునం ఎదురు పడితే కార్యం సిద్ధించదని, అప్పుడు వెళ్ళడం మానుకుంటారు. ఒక్క పని విషయంలో నే కాదు. ఉత్తముల దర్శనం లభిస్తే తామెంతో కృతార్థుల-మయినట్లు భావించడం భారతీయుల యాసంతో బాధ పడి, తన గృహానికి వచ్చిన అతిథిని చూచి "మీరెవ్వరు? ఎందుకు వచ్చారు?" అని ప్రశ్నించకుండా "దయచేసి యిక్కడ విశ్రాంతి తీసికొండి! మంచి తీర్థం కావాలా? మజ్జిగ యిమ్మన్నారా, తప్పి తీర్చుకోవడానికి!" అని ప్రశ్నించి, ఆదరం చూపడం భారతీయ సంప్రదాయం. ఇట్టి మాటలతో నే ఆగంతకునకు తృప్తి కలిగి శ్రమ కొంత తగ్గుతుంది, ఆతిథ్యం ఇచ్చినా, ఇవ్వకపోయినా, మధురమైన యీ మాటలే మానవుణ్ణి ముగ్ధుణ్ణి




పద్ధతి. అట్టి వారు తమ ఇంటికి వస్తే తమ గృహం పావనమైనదని చెప్తూ వారికి ఆతిథ్యం ఇచ్చి సత్కరిస్తారు. ఇది అతిథి గృహస్థులిద్దరికీ సంతృప్తిని కలిగిస్తుంది.

ఏదైనా పుణ్య తీర్థానికి వెళ్ళినప్పుడు గాని, పుణ్య క్షేత్రాన్ని దర్శించినప్పుడు గాని భక్తులు "క్రిందటి జన్మలో ఎంతో పుణ్యం చేసుకోవటం వల్ల ఈ తీర్థంలో స్నానం చేసే భాగ్యం లభించినదనీ, క్షేత్ర దర్శన భాగ్యం లభించినదనీ తృప్తి పడతారు. అందువల్ల తమ పాపాలు నశిస్తాయని భావిస్తారు. మార్గా చేస్తాయి.

మనిషిని ఆకట్టుకొనేవి మంచి మాటలే! చెడ్డ మాట లాడేవారిని అందరూ ఏవగించుకుంటారు. మంచి మాటలు ఉత్తముల నోటి నుండే వెలువడుతాయి. మంచి వారిని చూడడం వల్ల, వారి మాటలు వినడం వల్ల చెడ్డవారి మనస్సు మారుటకు అవకాశం ఉన్నది. అందువల్ల ఉత్తములను దర్శించుటకు ప్రయత్నించడం మంచిది.

–బులుసు వేంకట రమణయ్య

## "గొడుగు నీడ"

నిన్ను ఆదుకొనేది ఆ ప్రేమ సమాజమే కదు బాబూ! తన తల్లిదండ్రుల ఫోటోను అతి భద్రంగా దాచుకుంది రమణి. లేని తలితండ్రుల్ని ఎక్కడి నుంచి తెచ్చేదమ్మా! అని రమణి మామయ్య వాపోతున్నాడు. ఈ వివాహానికి మనమంగీకరించాలి బాబూ! అందరిలానే మనం కూడ కాదన్నామో ఆ అమాయక హృదయంలో లావా ప్రవహిస్తుంటుంది. ఆ బాధ నేను ఊహించుకుంటూ బ్రతకలేను రాజశేఖర్! పెంచిన మమకారంతో నీ రెండు చేతులూ పట్టుకుంటున్నాను. వివాహమై రమణితో నీవు ఇంట అడుగు పెట్టగానే నీ తలితండ్రుల ఫోటోకు నీవు వందనం చేద్దువుగాని. రమణి తలితండ్రుల ఫోటోను కూడ నీ తలితండ్రుల ఫోటో ప్రక్కనే అనువైన చోట గోడకు అమర్చుదాం. ఆ బుల్లి స్వర్గంలో మిగిలిన జీవితాన్ని హాయిగా గడుపుకుంటాను బాబూ!" అంటున్న సావిత్రిని జాలిగా చూస్తూ సుదర్శనం కొడుకు తలను ప్రేమతో నిమిరాడు. రాజశేఖర్ తల్లి చేతులు కళ్ళ కద్దుకున్నాడు. ఆ శుభసమయంలో అందరి హృదయాలలో ఎన్నెన్నో మంగళ వాయిద్యాలు... .

అతి తక్కువ ఖర్చుతో రమణి రాజశేఖర్ల వివాహం జరిగింది.

"మీ మామయ్య వాళ్ళను విడిచి రాలేక దుఃఖిస్తున్నావు కదు రమణీ! వాళ్ళందరి స్థానంలో మేమున్నామమ్మా! పోస్టుమన్ ఎరకయ్య ఏ ముహూర్తాన నీ విషయం చెప్పి అప్పటికప్పుడు నీ ఫోటో తెచ్చిచ్చి ఈ ఇంటి గొడుగు నీడలో రమణికి స్థానం కల్పించండమ్మా అని చెప్పాడు. వేళా విశేషం అన్నీ సవ్యంగా జరిగిపోయాయి" అంటూ సావిత్రమ్మ రమణినీ రాజశేఖరాన్నీ నలుగురైదుగురు పేరంటాళ్ళతోను ఇంటికి వచ్చింది.

"రాజశేఖర్! నీ అత్తమామల ఫోటో! అనువైన చోట వుంచు బాబూ! ఆ ప్రక్కనే నీకు జన్మనిచ్చిన నీ తల్లితండ్రుల ఫోటో! అనగానే రాజశేఖర్, రమణి చేతిలోని ఫోటోను గోడకమర్చాడు. తనను కనిన తలితండ్రుల ఫోటో కొరకు మనసులో బాధపడుతూ ఎదురు చూస్తున్నాడు రాజశేఖర్.

తల్లి తెచ్చిన ఫోటోను ఆత్రుతగా చూశాడు.

"ఇది మీ ఇద్దరి ఫోటో కదమ్మా! మధ్య నున్నది నేనే".

"నీవే బాబూ! నిన్ను కని పెంచి పెద్ద చేసి రమణిని నీకిచ్చి వివాహం చేసింది కూడ మేమే బాబూ! అశ్వద్ధామ హతః.... కుజరః అన్న అనృతంతో భారత సంగ్రామ చరిత్ర తారుమారయింది రాజశేఖర్, రమణికి యీ ఇంటి గొడుగు నీడతో ఆశ్రయం కల్పించడానికి నేనొక ధర్మరాజు నయాను బాబూ" అంటూండగా రమణీ రాజశేఖర్లు సావిత్రమ్మ కాళ్ళకు వందనం చేశారు.

ఆ దృశ్యాన్ని చూసిన ఎరకయ్య మోహన్లు తన్మయత్వం చెందారు. ☐

# పొలాల్లో దిగుబడి పుష్కలం
# జై కిసాన్ సామ్రాట్ శక్తి అపారం



**జైకిసాన్ సామ్రాట్ 18:46:0**

కళకళలాడే మొక్కలు, చక్కగా కట్టే గింజలు.

ఎందుకంటే, జైకిసాన్ సామ్రాట్‌లో పోషక పదార్థాలు అత్యధిక పాళ్లలో ఉన్నాయి.

మొక్క తొలి దశలో అవసరమైన ఫాస్ఫేట్ జైకిసాన్ సామ్రాట్‌లో పుష్కలంగా ఉంది. అంచేత దీని శక్తితో బలమైన వేళ్లు, ఏపుగా పెరిగే మొక్కలు.

అంతేకాదు. ఈ ఎరువులోని 18 శాతం నత్రజని అమోనియా రూపంలో ఉండటం వల్ల ఎరువు నీటితోపాటు కొట్టుకుపోదు— అత్యధికంగా మొక్కలకు అందుతుంది. అంటే తొందరగా పెరిగేందుకు శక్తి, కళకళలాడే మొక్కలు, చక్కగా కట్టే గింజలు.

గుర్తుంచుకోండి, జైకిసాన్ సామ్రాట్ దొరికే చోటు జువారి వారి పసుపుపచ్చ దుకాణం.










LINTAS ZUA 164 2317 TL

సీరియల్

హరికిషన్

(గత సంచిక తరువాయి)

## పాతికవేలు గోవిందా:-

ఆ రోజున గాడ్రెజ్ తాళం చెవులు ఇచ్చి అభిలాష్ వెళ్ళిన అరగంటకు పోర్టికోలోకి ఒక తెల్ల రంగు కారు వచ్చి ఆగింది. ఆ కారు చాలా అందంగా ఉన్నది. లోపల కర్టెన్సు, నల్లటి విండో అద్దాలు. ఆ కారు మెత్తగా, నెమ్మదిగా వచ్చి ఆగటం సావిత్రి చూసింది. డోర్ తీసుకుని ఒక యువకుడు దిగాడు.

పచ్చని శరీర ఛాయ, షుమారు అయిదు తొమ్మిది ఎత్తు, కోల ముఖం, కోటేరు వేసిన ముక్కు. కుడి చెవికి పైన బంగారు కుట్టు పోగు. కుడి చేతికి డైమండ్స్ పొదిగిన ముంజేతి బంగారు గొలుసు. ఎడం చేతికి బంగారపు చైన్ ఉన్న రిస్టు వాచి, కుడిచేతి ఉంగరపు వేలికి నవరత్నాలు పొదిగిన ఉంగరం, ఎడం చేతి ఉంగరపు వేలికి వజ్రం పొదిగిన బంగారు ఉంగరం. అమెరికన్ ల్రిప్ వైట్ క్రీమ్ కలర్ స్లాక్, గోల్డ్ కలర్ ప్యాంటు, అంబాసిడర్ బూట్, చేతిలో ట్రిబుల్ ఫైవ్ సిగిరెట్ పెట్టి, గులాబీ పువ్వు మార్కు అగ్గి పెట్టె. జేబులో అమెరికన్‌పార్కర్ పెన్. సున్నటి గడ్డం, నల్లని పొత్తుగా ఉన్న ఉంగరాల జుట్టు. సరళంగా, స్వచ్ఛంగా సూటిగా చూసే కళ్ళు. పారిస్ సెంటు వాసన ఘుమ ఘుమలాడుతున్నది.

స్ప్రింగ్ డోర్ తోసుకుని నిటారుగా నిల్చుని "గుడ్ మార్నింగ్ మిస్. నా పేరు త్యాగరాజు. ఫోన్లో మాట్లాడింది నేనే. ఇదుగో ప్రామిసరీ నోటు. పాతిక వేలూ అప్పుగా ఇవ్వండి" అని ప్రామిసరీ నోటు ఇచ్చి చిరునవ్వుతో ఎదురుగా ఉన్న కుర్చీలో కూర్చున్నాడు.

సావిత్రి శాంతాదేవికి చెప్పి మేడ మీదికి వెళ్ళి గాడ్రెజ్ బీరువా తీసి పాతికవేలూ డబ్బు తీసుకుని, మళ్ళీ బీరువా సరిగ్గా తాళం వేసి శాంతాదేవికి డబ్బు చూపించి, ఆఫీస్ రూంలోకి వచ్చి ఆ డబ్బుని త్యాగరాజుకు ఇచ్చింది. ఆ డబ్బు తీసుకుని థ్యాంక్స్ చెప్పి వెళ్ళిపోయాడు త్యాగరాజు. కారు నెంబర్ను డైరీలో రాసుకున్నది సావిత్రి.

మరో అరగంట పోయాక అభిలాష్, మరో యువకుడూ వచ్చారు అభిలాష్ కార్లో-

"షి యీజ్ మిస్ సావిత్రి, బి. ఎస్సీ, పి. ఎ. టు అభిలాష్. దటీజ్ మై సెల్ఫ్. ఆ, సావిత్రీ ఇతనే త్యాగరాజు, ఫోన్లో స్పెషల్‌గా పాతికవేలూ అప్పడిగింది వీడే. వెళ్ళి డబ్బు పట్రా" అన్నాడు అభిలాష్.

చంద్రముఖి, సావిత్రి, ద్రౌపది ముఖాలతో చూసింది సావిత్రి. అదే మగవాడయితే షేక్స్పియర్ ఫేస్ అనే వాళ్ళు. వళ్ళంతా చెమట పట్టింది. నోరెండి పోయింది. మూర్ఛ, హిస్టీరియా రాలేదు. స్పృహ తప్పి తప్పనట్లుగా ఉంది.

"అరగంట క్రితం త్యాగరాజు వచ్చి ప్రోనోటు ఇచ్చి పాతిక వేలూ పట్టుకెళ్ళాడు. ఇద్దరు త్యాగరాజులు ఉన్నారా" అని టేబుల్ సొరుగు తీసి ప్రామిసరీ నోటు ఇచ్చింది సావిత్రి.

విస్తుపోయి చూశారు ఇద్దరూ, డైరీలో నోట్ చేసుకున్న కారు నంబరు చూపించింది. అతను ఎట్లా ఉన్నదీ వర్ణించి చెప్పింది.

"ఎవరో చాలా ఘటీకుడు. మనం టెలిఫోన్‌లో మాట్లాడింది టాప్ చేసి, ఈ కాస్త వ్యవధిలో చాలా నైస్‌గా టోపీ వేశాడు. ముందు పోలీస్ రిపోర్టివ్వు. ఆ కారు ఎవరిదయిందీ తెలుస్తుంది" అన్నాడు త్యాగరాజు.

ఈ మాటలన్నీ విని హాల్లో కూర్చున్న తల్లీ, తండ్రీ కూడా ఆఫీస్ రూంలోకి వచ్చారు. జరిగింది తెల్సుకున్నారు. సావిత్రి వైపు చూశారు అభిలాష్.

"సావిత్రీ, నువ్వు నా దగ్గర పి. ఎ. గా చేరిన ఒక్క పూటలోనే పాతిక వేలు దోపిడీ జరిగింది. సెంటిమెంట్ మీద నాకు నమ్మకంలేదు. నువ్వొచ్చిన వేళా విశేషం అటువంటిది అని నేను అనను. నేనేదో చెడిపోతున్నాననీ, నన్ను బాగు చెయ్యటానికి ఒక ఆడపిల్ల కావాలనీ మా అమ్మ నిన్ను నాకు పి. ఎ. గా వేసింది. కాని జరిగింది ఇది. పోలీస్ రిపోర్ట్ అక్కర్లేదు. ఆ గజదొంగని రెండు రోజుల్లో నేనే పట్టుకుంటాను. డబ్బు విషయంలో కాస్త జాగ్రత్తగా ఉండడం నేర్చుకో" అన్నాడు అభిలాష్. సావిత్రి వెక్కును ఆపుకోలేక శాంతాదేవిని కావిలించుకొని

జరిగిన కథ- 17: అభిలాష్ జీవితాన్ని పులబాటగా చేయాలని కంకణం కట్టుకుంటుంది సత్యభామ. బ్యాంకులో డబ్బు ఎవరు జమ చేశారో తెలియక అన్న జగదీష్ దగ్గరికి వెళ్ళి విషయం చెప్తుతుంది శ్రీవిద్య. అభిలాష్ జమచేసి ఉండవచ్చని శార్వాణి అంటుంది. అభిలాష్‌ని సన్మార్గంలోకి తెచ్చేందుకు పర్సనల్ అసిస్టెంట్‌కు సావిత్రిని నియమిస్తుంది శాంతాదేవి. హేమంత్ ఎవరో తెలుసుకోవడానికి శ్రీవిద్య ప్రయత్నాలు మొదలుపెడుతుంది.

బావురుమని ఏడ్చింది.

"సావిత్రీ, తప్పు నీది కాదని నాకు తెలుసు. గొప్పవాళ్ళ ఇంట్లో మంచి చెడ్డల స్థాయి వేల మీద ఉంటుంది. ఇది నీకొక ఆర్థిక సంబంధమయిన హెచ్చరిక. చాలా జాగ్రత్తగా ఉండు" అని వీపు తట్టిందావిడ.

త్యాగరాజుకు మరో పాతిక వేలూ ఇచ్చి పంపించాడు అభిలాష్. మధ్యాహ్నం ఇంటికి వెళ్ళబోతూ సావిత్రి అన్నది "నేను ఉద్యోగం మానేస్తాను. నా నుంచి మీరు నష్టపోవడం నాకు ఇష్టంలేదు".

తల వంచుకుని ఏదో రాసుకుంటున్న అభిలాష్ తల ఎత్తి చూసేడు.

"నా డబ్బు నుంచీ నువ్వు ఉద్యోగం మానెయ్యటం నాకూ యిష్టంలేదు. మరో విషయం, నువ్వు లేకపోతే నేను పాడయిపోవటం ఖాయం" అన్నాడు. మాట్లాడకుండా వెళ్ళింది సావిత్రి.

★ ★ ★ ★ ★



## ఆడపిల్లలు- అనుభవాలు

పోలీస్ స్టేషన్‌కీ, ఆర్. టీ. ఓ. ఆఫీసుకీ ఫోన్ చేసి ఫలాని నంబరుగల కారు ఎవరిదయిందీ చెప్పమని అడిగాడు అభిలాష్. వాళ్ళ రికార్డు ప్రకారం ఫలాని వాళ్ళదని చెప్పారు. తన కార్లో ఆ ఇంటికి వెళ్ళేడు. తనను పరిచయం చేసుకున్నాడు. చాలా ఖరీదయిన ఇల్లు. ఇంటికి తగిన డెకరేషన్. అంతటి స్టేటస్ ఉన్న వ్యక్తి ఆ ఇంటి యజమాని.

"నా పేరు చంద్రజిత్ యాదవ్, అనేక కంపెనీల్లో సంబంధం ఉన్నది. మీరొచ్చిన పని చెప్పండి" ఇంగ్లీషు, హిందీ కలిపి మాట్లాడుతూ అడిగాడు.

"ఈ నంబరు గల కారు మీదే కదూ" అని నంబరు కాగితం చూపించాడు.

"ఎస్ ప్లీజ్. టాక్సులన్నీ కట్టేశాను, ఎందుకు" ముఖ కవళికల్లో ఏ ఆందోళనా లేదు. చిరునవ్వుతో చూసి డ్రైవర్ని పిలిచాడు. అతనొచ్చాడు.

"డ్రైవర్, వీరు మన కారుని చూస్తానంటున్నారు. షెడ్‌లో నుంచి తీసుకొచ్చి చూపించు" అన్నారాయన.

డ్రైవరు కారు తెచ్చి పోర్టికోలో ఆపాడు. కారుని చూశాడు అభిలాష్. బ్లూ కలర్, ఎంబాసిడర్ కారు. వెనకా, ముందూ నంబర్ ప్లేట్ మీద అదే నంబర్. తెల్ల కారు కాదు. అభిలాష్ పెదవి తడుపుకుంటూ ఆయన వైపు చూశాడు.

"ఇప్పుడు చెప్పండి మీ సందేహం ఏమిటో" అన్నాడాయన సిగిరెట్ వెలిగించి.

"ఇదే నంబరు గల తెల్ల కారులో చక్కగా స్టైలిష్‌గా ఉన్న వ్యక్తి ఒకతను వచ్చి ఛీట్ చేసి వెళ్ళాడు. మా పి. ఎ. కారు నంబరు చెపితే, పోలీస్ డిపార్ట్‌మెంట్ వాళ్ళు మీ అడ్రస్ ఇచ్చారు. త్యాగరాజ్ అని ఎవరయినా మీ తాలూకు మనిషి ఉన్నారా" అన్నాడు అభిలాష్.

"ఎవ్వరూ లేరు, నంబర్ ప్లేటు కూడా రాంగ్ నంబర్ నోట్ చేసింది కావచ్చు, ఛీట్ చేశారన్నారు కాబట్టి, వాడు తప్పుడు నంబర్లతో కారు నడుపుతున్నాడన్న మాట. పోలీస్ కంప్లయింట్ ఇవ్వండి" అన్నాడాయన. ట్రబుల్ ఇచ్చినందుకు క్షమాపణ చెప్పి వచ్చాడు అభిలాష్. మొట్టమొదట పోలీస్ రిపోర్ట్ ఇవ్వకూడదనుకున్న అభిలాష్ పోలీస్ స్టేషన్‌కు వెళ్ళి జరిగిందంతా చెప్పి రిపోర్ట్ ఇచ్చాడు. అతను ఎట్లా ఉన్నదీ సావిత్రి చెప్పిన వివరం అంతా చెప్పాడు అభిలాష్. వారం రోజుల్లోపలే అతన్ని పట్టుకుంటాం అన్నాడు ఎస్. ఐ. ధర్మారావు.

* * * * *

ఆ సాయంత్రం సావిత్రి అభిలాష్ ఆఫీస్‌కు వెళ్ళకుండా సత్యభామ ఇంటికి వెళ్ళి జరిగింది అంతా చెప్పింది.

"నేనింక ఆ ఇంటికి వెళ్ళను. మొదటి రోజునే ఇట్లా జరిగింది. నాకెందుకో భయంగా ఉన్నది" అన్నది సావిత్రి. సత్యభామ మాట్లాడలేదు. పాతిక వేలు పాస్ బుక్‌లో జమ, శ్రీవిద్య కంట పడని వ్యక్తి ఇతనే కావచ్చు. ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చింది. శ్రీవిద్య పాస్ బుక్ సంగతి సావిత్రికి చెప్పకూడదనుకున్నది.

"సావిత్రీ నువ్వు ఉద్యోగం మానవద్దు. నువ్విప్పుడు ఉద్యోగం మానేస్తే నీకు అభిలాష్ అండ పోతుంది, ప్రాణభయం వచ్చినా రావచ్చు. నా మాట విను" అన్నది సత్యభామ. సందేహిస్తూ కూర్చున్నది సావిత్రి.

"చూడగా ఈ రోజుల్లో కష్టపడకుండా డబ్బు సంపాదించాలి. కట్నం లేకుండా డాక్టరో, ఇంజినీరో, ఐ. ఎ. ఎస్. ఆఫీసరో, గ్రీన్ కార్డ్ కలిగిన వాడో భర్తగా కావాలి. పూర్వకాలంలో అనేవారుట ఆత్మ విమర్శ, ఆత్మజ్ఞానం అని. మనిషి తనను తాను తెల్సుకోటానికి కొంత వరకయినా ప్రయత్నించేవాడు. ఈ రోజుల్లో ప్రేమనూ, సెక్సునీ మధించి తనను తాను కాక ఎదుటివారి కోరికల్ని, అనుభవాల్నీ తెల్సుకోవడం ఎక్కువైపోయింది. బ్రతకటానికి కావాల్సింది డబ్బు. ఆ బ్రతుకును సక్రమమైన పద్ధతిలో నడిపించటానికి కావలసింది సెక్సు. నీ దగ్గర డబ్బు లేదు. సెక్సున్నది. మేడ మిద్దెలతో పోల్చి చూస్తే తాటాకు పాక చాలా చల్లగానే ఉంటుంది. కాని అగ్నిప్రమాదం నుంచి ఆ చల్లదనం రక్షించలేదు కద. నీ ఆలోచనలు అతి పవిత్రమైనవే కావచ్చు. కాని ఆ ఆలోచనలకు పాలిష్ చాలా





'ఉత్తరాలు' శీర్షికకి
రాసేవారు

తమ పేరు, పూర్తి చిరునామా
తెలుగు లిపిలో రాయాలని
మనవి చేస్తున్నాము.

—సంపాదకుడు.



# రచయిత జవాబులు

## ఉత్తమ ప్రశ్న

వంటేరు విజయప్రసూనాంబ,
బ్రాహ్మణక్రాక (నెల్లూరు)

ప్ర: ఒకప్పుడు కన్నెపిల్ల మదిలో పెళ్ళంటే మల్లెపూలు, మంచు సోనలు, తెల్ల చీరె, తెల్ల వెన్నెల మెదిలేవి. నేడు అగ్గిపెట్టె, కిరసనాయిలు డబ్బా, ఉరిత్రాడు మొదలైనవి మెదులుతున్నవి. సమాజం ఈ విధంగా మారటానికి కారణం ఏమిటంటారు?

జ: భర్త అహంకారానికి అత్తమామల ఆశ తోడు కావటం-మందు లేని వరకట్నపు క్యాన్సర్ వ్యాధి ముదరటం- ఆనాటి అరిషడ్వర్గాలు- కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలు.

ఈనాటి అరిషడ్వర్గాలు- వ్యభిచారం, తాగుడు, పేకాట, లంచం, కులతత్వం, వరకట్నం-

ఎమ్. పద్మావతి, ఊరిపేరు లేదు

ప్ర : మాటకారితనం, సానుభూతి ఎదుటివారి సమస్యలను తీర్చనప్పుడు ఈ హిపోక్రసీ వలన ఏమి లాభం ఉండకపోగా మనిషి విలువ తరిగి పోతుందంటాను. మీరేమంటారు?

జ : ప్రతివారి సమస్యల్ని తీర్చగలిగితే ఆ వ్యక్తిని సృష్టికి ప్రతి సృష్టి చేయగల మహిమాన్వితుడనే అనవచ్చు. సమస్యలు తీరకపోయినా, సానుభూతి కొంత మనశ్శాంతిని ఇస్తుంది. ఇది హిపోక్రసీ కానేకాదు.

ప్రతాప వెంకట సుబ్బారాయుడు, బాలానగర్

ప్ర : నాటినుంచీ నేటివరకూ సాహిత్యంలో ఏవిధమైన మార్పులు వచ్చాయో తెలియచెప్తారా?

జ : ఆనాటి సాహిత్యం ముందు చదివి, ఈనాటి సాహిత్యంతో పోల్చి చూస్తే మీకే అర్థం అవుతుంది.

ఎ. శివరామ్, మచిలీపట్నం

ప్ర: ఎ) హర్రర్, సస్పెన్స్, సెక్స్, మారణ హోమాలతో కూడిన భయంకరమైన సీరియల్స్ వస్తున్న ఈ రోజుల్లో మీరు మాత్రం 'ఆడపిల్లలు- అనుభవాలు' లాంటి సెంటిమెంట్ సీరియల్ వ్రాయటానికి ప్రత్యేకమైన కారణం ఏదయినా ఉన్నదా?

బి) మీరు ఈ నవల ద్వారా ఆడపిల్లల తల్లిదండ్రుల్ని భయపెడుతున్నారని నా అభిప్రాయం. మీరేమంటారు?

జ: 1) ప్రత్యేకమైన కారణం ఉన్నది. ఈ సీరియల్ నవల పూర్తిగా చదవండి. కారణం మీకే తెలుస్తుంది.

2) భయంలేదు. కనువిప్పు కలిగితే చాలు. నా కృషి ఫలించినట్లే.

ఎమ్. స్వయంప్రభ, రాజమండ్రి

ప్ర: 1) మీ 'ఆడపిల్లలు- అనుభవాలు' నవలలో శర్వాణి అభిలాష్‌నీ, అభిలాష్ జగదీష్‌నీ, జగదీష్ శ్రీవిద్యనీ, శ్రీవిద్య విమలనీ ఇలా ఒకరికొకళ్ళు చెంపలు వాయించుకోవటం తప్పితే, ఇంకేమీ పనిలేదా?

2) మీ సత్యభామకి అంత టెక్కు, అహంకారం, గర్వం ఎందుకు?

3) మీ సీరియల్ టైటిల్, శైలీ కూడా ప్రత్యేక తరహాతో ఉంటున్నాయి. ఈ నవల ద్వారా మీరు చెప్పదల్చుకున్నది ఏమిటి?

జ: 1) అపనింద వేసినప్పుడూ, ఆ పరిస్థితిని బట్టి మానసికంగా బాధపడినప్పుడూ, స్నేహరీత్యా మాట పట్టింపు వచ్చినప్పుడు నేటి యువతీ యువకుల్లో ఆత్మ న్యూనతా భావం కలుగుతుంది. సెల్ఫ్ పిటీ పత్తిడికి తట్టుకోలేక చెయ్యి చేసుకోవటం సహజం-

2) ఏకైక పుత్రిక, గారాల బిడ్డ, ఆర్థిక బాధలు అసలే లేవు. ధార్మిక బుద్ధి కలది. అలాంటప్పుడు కొంత మనో గర్వం తప్పదు.

3) ఆడపిల్లలు అనవసరంగా మనస్సు పారేసుకుంటే వచ్చే నీలాపనిందలూ

ఆడపిల్లల మనస్తత్వాన్ని ఆసరాగా తీసుకుని ఎన్ని కుయుక్తులు యువకులు పన్నుతారో విమర్శగా విశదీకరించటం.

వరకట్న నిర్మూలనకు కొన్ని సూచనలు, నేటి పెళ్ళిళ్ళ ఆర్భాటం.

కొంత ఆధ్యాత్మిక చింతన... ఈ సీరియల్‌లో అతి ముఖ్య విషయాలు-

---

**ఈ వారం ఉత్తమ ప్రశ్న పంపిన వంటేరు విజయ ప్రసూనాంబ గారికి రచయిత నవల 'ప్రేమించి చూడకు' బహుమతిగా పంపబడింది.**

---

అవసరం. నువ్వే ఆలోచించి చూడు'' అన్నది సత్యభామ మళ్ళీ. మరి కాసేపు మాట్లాడి వెళ్ళింది సావిత్రి.

* * * * *

మర్నాడు ఉదయం ఎనిమిది గంటలకు డ్యూటీకి వెళ్ళింది సావిత్రి. మేడ మీదికి వెళ్ళలేదు, ఇంట్లోకి వెళ్ళి శాంతాదేవికి కనపడలేదు. ఆఫీస్ రూమ్‌లోనే కూర్చున్నది. మరో పావు గంటలో అభిలాష్ డ్రెస్ చేసుకొని వచ్చాడు. టేబుల్ ముందు తన రివాల్వింగ్ చైర్‌లో కూర్చున్నాడు.

"నిన్న మధ్యాహ్నం రాలేదేం'' ఏదో ఫైలు చూస్తూ అన్నాడు.

"పాతిక వేలు నష్టపర్చినందుకు బాధపడ్డాను. మనస్కరించలేదు. నెలకు అయిదు వందల చొప్పున నా జీతంలో కట్ చేసుకోండి. లేకపోతే నాకు మనశ్శాంతి ఉండదు'' అన్నది మనస్సులో వ్యథపడుతూ.

చూస్తున్న ఫైలు మూసేసి, తీసిన సిగిరెట్ టేబుల్ మీద పడేసి పెద్దగా నవ్వుతూ రివాల్వింగ్ చైర్‌లో మూడు రౌండ్స్ తిరిగాడు అభిలాష్.

"ఫెంటాస్టిక్, ప్రీ ఎరేంజ్‌డ్ రాబరీ. సావిత్రీ నీ అద్భుతమయిన సూపర్ డీలక్స్ తెలివితేటలకి హేట్సాఫ్'' అని సావిత్రి చెయ్యి పట్టుకుని షేక్ హేండ్ ఇచ్చాడు. అర్థం కాక చూసింది. అర్థం చేసుకుని అమితానందభరితుడైనాడు అభిలాష్.

జేబులో నుంచీ డబ్బు తీశాడు. అన్నీ వంద రూపాయిల కాగితాలు. సావిత్రి చేతిలో ఉంచాడు.

"ఇంత డబ్బు లెక్క పెట్టకుండా ఇస్తున్నారు. నాకెందుకూ'' అన్నది.

"నీకు ఇవ్వదలిచిన ఉద్యోగం ఆరు మాసాలు. అవునా''

"అవును''.

"ఆరు మాసాల తరువాత గ్యారంటీ లేదు. అవునా''.

"కరెక్ట్''

"నీ పి. ఎ. ఉద్యోగం ఉంటేనే కదా, నెలకు అయిదు వందల రూపాయల చొప్పున నీ జీతంలో కట్ చేసేది. పాతిక వేలూ తీరాలీ అంటే నువ్వు ఏభై నెల్లు ఇక్కడ ఉద్యోగం చెయ్యాలి. అంటే నాలుగేళ్ళకు పైగా. ఈ ఎక్స్‌టెన్షన్ ఆఫ్ సర్వీస్ కోసమని. నా దగ్గర పి. ఎ. చేయాలనే కోరిక నెరవేర్చటం కోసమని, ఈ పాతిక వేలు ఆ త్యాగరాజ్‌కు ఇవ్వటం, ముందు చూపుగా వేసుకున్న చిన్న అరేంజ్‌మెంట్, అని నా ఉద్దేశ్యం. ఆరు మాసాల్లో నువ్వు వెళ్ళిపోతావంటే నేనూ కాస్త ఫీలవుతాను కదా. ఈ రీతిన నువ్వు నాకు ఏభై మాసాలు దర్శనం ఇస్తావని ఈ పద్ధతిలో చెప్పటం నా అదృష్టం కదూ. అందుకనే గుప్పెడు మనస్సుకు గుప్పెడు నోట్లు, లెక్క పెట్టకుండా గుండెల్లో దాచుకో సావిత్రీ'' అన్నాడు.

సావిత్రి మనస్సు భగ భగలాడింది. ఆ నోట్లు మళ్ళీ అతని చేతిలోనే ఉంచింది.

"వెరీ సారీ సర్. మీ కామెంట్‌కు బాధపడుతున్నాను. ఆ త్యాగరాజు ఎవరో నాకు తెలీదు. మీ కొలువులో నేను ఉండాలనే కోరిక నాకు ఉండి వుంటే ఆరు మాసాల తరవాత నేను ఉంటానంటే మీరు కాదనరు. కాని ఉద్యోగం కోసం ఎవరితోనో లాలూచీపడి ఇంత దొంకతిరుగుడుగా నేను ప్రవర్తించానని మీరనుకోవడం మీ వంకర మనస్తత్వానికి మచ్చుతునక" అన్నది. ఆ కళ్ళల్లో నీళ్ళు చిప్పిల్లాయి. మనస్సు సంబాళించుకుందామనుకున్నా కన్నీరు ఆగలేదు. నాలుగు కన్నీటి బొట్లు టేబుల్ మీద పడ్డయ్యి. సావిత్రి ఇంత సున్నిత మనస్కురాలని అర్థం చేసుకున్నాడు అభిలాష్.

రెండు మోచేతులూ టేబుల్ మీద ఆనించి రెండు అరచేతులతో రెండు చెంపలనూ పట్టుకుని కూర్చున్నది సావిత్రి.

"బాధపడుతున్నావ్ కదూ, కావాలనే బాధపెట్టాను. ఇంకా ఇన్‌సల్టింగ్‌గా మాట్లాడగలను. కారణం నేను నీకు జీతం ఇస్తున్న బాస్‌ని కాదు. నీ మనస్సు తెలుసుకోవాలని ఆకాంక్షించే శ్రేయోభిలాషిని. చూడూ ఆడపిల్ల ప్రేమను సంపాదించాలంటే ఊహాలోకంలో తేలిపోయే అందమైన తియ్యని కబుర్లు చెపితే చాలు. కాని ఆ ప్రేమ కబుర్లు గుండెలో తుల్లి తరచి చూడలేవు. సద్భావంతో ఒక ఆడపిల్లను అన్నమాట ఎంత దారుణంగా మనస్సును కష్టపెట్టి గుండెల్ని కోసేస్తుందో, అంతటి స్వచ్ఛమైన అనురాగాన్ని అందిస్తుంది-" ఆదరణగా, ఆప్యాయంగా చూస్తూ అన్నాడు అభిలాష్.

కళ్ళు తుడ్చుకున్నది సావిత్రి.

"ఇటువంటి భావాలున్న మీరు ఆ రోజున మరో ఇద్దరు దుర్మార్గులతో కలిసి నన్నెందుకు రేప్ చెయ్యాలనుకున్నారు" అతని మనస్సు మరో మారు తెలుసుకోవాలని అనుకున్నది. తల వంచుకున్నాడు అభిలాష్. ఒక్క నిముషం గోళ్ళు కొరుక్కుంటూ కూర్చున్నాడు.

"జన్మతహా నాలో డబ్బు, ఆస్తి అహంకారం బాగా పేరుకు పోయింది. ఆ రోజున అన్నట్లు నువ్వు కాని, సత్యభామ కాని నాకు దక్కాలనే పట్టుదల, కోరిక, వాంఛ నాలో మరీ ఎక్కువయిపోయినయ్యి. ఒక ఫ్యామిలీ గరల్‌తో పార్టీ చేసుకుందాం రమ్మని వాళ్ళిద్దరూ నాకు ఫోన్ చేశారు. ఆడపిల్ల ఒంటరిగా కనిపిస్తే చచ్చిన మగవాడి శవం కూడా ఆనందంగా లేచి వచ్చి ఫ్రీగా అనుభవించి మళ్ళీ ఆ కట్టెలోకి చేరి శాశ్వతంగా మరణిస్తుంది. ఆడపిల్ల, పార్టీ అనగానే అక్కడికి వచ్చేశాను. తీరా చూస్తే నువ్వు. ఆ సమయంలో ఏం చెయ్యాలో నాకు తోచలేదు. వాళ్ళతో కలసిపోయినట్లు నటించి నిన్ను కాపాడుకోవాలనే ప్లాన్‌తో నే ఉన్నాను. కాని సమయస్ఫూర్తిగా నువ్వు ప్రవర్తించి నా అవసరం లేకుండానే నిన్ను నువ్వు కాపాడుకున్నావు. వయస్సు చేద్దామనుకున్న తప్పు మనస్సుకు పట్టినప్పుడు ఆ మనిషిలో ఇంగిత జ్ఞానం నశించిపోయి పాశవిక పశుత్వం ఆవహిస్తుంది. ఆనాటి సంఘటనకు నేను సిగ్గుపడటమే కాదు, నన్ను నేను దూషించుకున్నాను" అన్నాడు. సావిత్రి మనస్సు తాత్కాలికంగా శాంతించినా, తను పిల్లి వల్లో ఆడుకునే ఎలుకగానే భావించుకున్నది.

ఆ డబ్బును మళ్ళీ ఇవ్వబోయాడు అభిలాష్. కుర్చీలో నుంచీ లేచి నిల్చున్నది సావిత్రి.

"సార్, మగవాడు లంచం తీసుకుని పని చెయ్యకపోతే పది తిట్లు పరోక్షంగా తిట్టి ఊరుకుంటారు. ఆడపిల్ల అయాచితంగా ఒక మగవాడి దగ్గర డబ్బు తీసుకున్నదంటే, నేతి గిన్నెకు నిప్పు శెగ తగిలితే కరిగిపోయినట్లు ఆ మగవాడికి లొంగిపోక తప్పదు. నేను జీవించటానికి ఉద్యోగంలో చేరానుగానీ, శారీరకంగా మిమ్మల్ని సంతోషపెట్టటానికి కాదు. క్షమించండి" అన్నది.

ఈ మాటలు విని హాల్లో ఉన్న శాంతాదేవీ, దశరథరామయ్య నవ్వుతూ చప్పట్లు కొడుతూ వాళ్ళ దగ్గరకు వచ్చారు. ఖిన్నులైపోయారు ఆ ఇద్దరూ.

"సావిత్రీ, కొంతమంది పసివాళ్ళను ముఖ్యంగా దగ్గరకు పిలిచి, ఎత్తుకు వాళ్ళని నవ్వించి, కవ్వించి ముద్దు పెట్టుకుంటారు. అది లోక సహజం. కాని కొంతమంది బుగ్గ గిల్లి ఆ పసివాడు ఏడుస్తుంటే, ఆ ఏడుపు చూస్తుంటేనే గాని వాళ్ళకు ముద్దు రాదు. అదొక రకమైన హాబీ. అది సాడిస్ట్ మెంటాలిటీ కాదు. ఒకరి ఏడుపు ఒకరికి సంతోషం కలిగిస్తుంది: కాని ఆ ఏడుపుకు కారణం తామే అయితే, అదో రకమైన హాబీ. మా అభిలాష్ మనస్తత్వం కూడా అంతేనమ్మా" అన్నాడు దశరథరామయ్య.

సావిత్రి మనస్సు కాస్త కుదటపడింది. ఆ ఇంట్లో అందరికీ తన మీద సదభిప్రాయమే ఉన్నది. అది అదృష్టమో రాబోయే దురదృష్ట సంఘటనకు మెరుగు పెట్టిన దుస్సంఘటనో తెలీలేదు.

"సార్, నాదొక చిన్న రిక్వెస్ట్".

"ఏమిటది"

"మా ఇంటి వాతావరణం, నా తల్లిదండ్రులూ, వాళ్ళ మనస్తత్వాలూ మీకు తెలియవు. నన్నూ, నా చనువునీ చూసి మీరు మరో రకమైన నిర్ణయానికి వస్తే పేడ కుప్పలో కాలు వేసిన వారే అవుతారు. నేను గౌరవంగా ఉద్యోగం చేసుకోటానికే వచ్చాను గాని ఏ సరదానీ ఆశించి రాలేదు. నావల్ల తప్పుంటే నన్ను క్షమించమని అడగను. ఉద్యోగం వదులుకుని వెళ్ళిపోతాను. మీ వల్ల తప్పు జరిగితే, ఆ తప్పుని తెల్సుకుని మీరేం చేస్తారో మీరే నిర్ణయించండి" అన్నది సావిత్రి.

శాంతాదేవి గంభీరంగా చూస్తూ నిల్చున్నది. సావిత్రి మాటల్లోని స్వచ్ఛతనీ, నిర్మొహమాట వైఖరినీ ఆవిడ మనస్ఫూర్తిగా హర్షించి అర్థం చేసుకున్నది.

"మా వాడి వల్ల నీకు ఏ బాధ, అవమానం కలిగినా క్రిమినల్ చర్య తీసుకుంటానని జాయినింగ్ రిపోర్ట్‌లో నే రాశావు. కాని వాడి దవడలు వాయిస్తేనే బావుంటుందని మా ఉద్దేశ్యం, ఎందుకంటే కొట్టిన చెయ్యే కోరుతుంది" అన్నదావిడ. సావిత్రి అప్రతిభురాలయింది. (ఇంకా ఉంది)

## కాలపు కెమేరాలోంచి

మొన్నటి పురాణాలలో –
దేవాలయం ముందు నిలబడి
ధర్మ దర్శనం కోసం నిరీక్షిస్తూ,
కర్మ ప్రసాదం కోసం ప్రతీక్షిస్తూ
దీనంగా కనిపించాడు, మానవుడు– లాంగ్‌షాట్‌లో
నిన్నటి ప్రబంధాలలో –
రాజుగారికి వింజామరలు వీస్తూనో
కైవారాలు కూస్తూనో
రణ రంగంలో చస్తూనో
హీనంగా కనిపించాడు, మానవుడు– మిడ్–లాంగ్‌షాట్‌లో
నేటి వాఙ్మయంలో –
ఆకలితో, అనారోగ్యంగా
అజ్ఞానంలో, దారిద్ర్యంలో
సామాజిక శక్తుల సంఘర్షణలో
విషాదంగా కనిపిస్తున్నాడు, మానవుడు– మిడ్– క్లోజప్‌లో
రేపటి సాహిత్యంలో –
స్వేచ్ఛా పత్రాలమీద
సమతా మషీరసంతో
సౌభ్రాత్రపు అక్షరాలలో
తన విరాట్స్వరూపం తానే రాసుకుంటూ–
ఆనందంగా కనిపిస్తాడు, మానవుడు– క్లోజప్‌లో

-దు. రామమోహనరావు

# వ్యక్తిగతం

## సియోల్ తర్వాత టెన్నిస్‌కి విజయ్ వీడ్కోలు!

రెండు దశాబ్దాలకు పైగా టెన్నిస్ క్రీడారంగంలో ఎన్నదగిన క్రీడాకారుడిగా తన స్థానం నిలబెట్టుకుంటున్న భారత డేవిస్ కప్ కెప్టెన్ విజయ్ అమృతరాజ్ టెన్నిస్‌కు స్వస్తి పలకనున్నారు. 36 సంవత్సరాల విజయ్ అమృతరాజ్ ఇప్పుడు హాలీవుడ్ చిత్రసీమలో నిమగ్నమై ఉన్నారు. "ఆటలో క్రియాశీల భాగం నుంచి విరమించుకోవడం విచారకరంగానే ఉంటుంది. కాని నేను విరమించుకోవలసిన సమయం ఆసన్నమైందని నాకు తెలుసు" అని ఆయన అన్నారు. సియోల్‌లో జరగనున్న ఒలింపిక్ క్రీడలలో చివరిసారి ఆడి, తర్వాత విరమించుకోవడం సముచితంగా ఉంటుందని ఆయన అనుకుంటున్నారు. ఒలింపిక్ క్రీడల్లో టెన్నిస్‌ను 60 సంవత్సరాల తర్వాత తిరిగి చేర్చారు....





## అపర చాణక్యుడు డి. పి. మిశ్రా మృతి

అపర చాణక్యుడిగా కీర్తి గడించిన ప్రముఖ కాంగ్రెస్ నాయకుడు, మధ్యప్రదేశ్ మాజీ ముఖ్యమంత్రి శ్రీ ద్వారకా ప్రసాద్ మిశ్రా మే 31న మరణించారు. ఆయన వయసు 87 సంవత్సరాలు. ఆయన చాల కాలంగా అనారోగ్యంతో ఉన్నారు. 1926లో ఆయన రాజకీయ జీవితం ప్రారంభమైంది. రాజకీయ రంగంలో ఉచ్ఛదశలో ఉన్న రోజులలో ఆయన కీ. శే. సర్దార్ పటేల్‌కు సన్నిహిత సహచరుడుగా, కీ. శే. నెహ్రూకు విమర్శకుడుగా ఉండేవారు. ఆయన కాంగ్రెస్ నుంచి ఒకసారి బహిష్కరణకు కూడా గురయ్యారు. కాని మధ్యప్రదేశ్ ముఖ్యమంత్రిగా, శ్రీమతి ఇందిరాగాంధీని ప్రధాన మంత్రిగా ఎన్నుకోవడంలో ముఖ్యమైన పాత్ర వహించి ఆయన తిరిగి రాజకీయాలలో ప్రాధాన్యత సంపాదించారు. కొద్ది కాలం పాటు శ్రీమతి ఇందిరా గాంధీకి సన్నిహితంగా ఉన్నారు. ఆయనకు కవిగా, చరిత్రకారుడిగా కూడా గుర్తింపు ఉంది. ఆయనకు ముగ్గురు కుమారులు, ఒక కుమార్తె ఉన్నారు....

## ఎం. ఎల్. ఏ.కి కూడా తప్పని అత్తింటి ఆరళ్ళు!

అత్తవారింట్లో కోడళ్ళ అనుమానాస్పద మరణాల గురించి వార్తలు ప్రతి రోజూ వస్తున్నా ప్రతి వార్తలోనూ ఏదో కొత్తదనం ఉంటుంది. మధ్య ప్రదేశ్ నుంచి వచ్చిన వార్తలో కోడలి మృతి సంభవించలేదు గాని అనుమానాస్పద స్థితిలో వొళ్ళు కాలిన ఆ కోడలు మామూలు నిస్సహాయ స్త్రీ కాదు. ఆమె బిలాస్‌పూర్ జిల్లా ముంగేలి నియోజక వర్గం నుంచి ఎన్నికయిన హరిజన శాసన సభ్యురాలు దుర్గావతి పాట్లే. కరెంటు పోయినప్పుడు కిరసనాయిలు దీపం వెలిగిస్తుండగా వొళ్ళు కాలిపోయిందని ఆమె ప్రకటించింది గాని ఆ ప్రకటనను ఎవరూ నమ్మడం లేదు. ఆమె శరీరం మీద 25 శాతం కాలిన గాయాలున్నాయి. ఐనా తగలబడిన వెంటనే గాని, తర్వాత గాని ఆమెను ఆస్పత్రికి తరలించక పోవడం చాలా అనుమానాలను రేకెత్తిస్తోంది. ఏప్రిల్ 13న ప్రమాదం జరగగా ఏప్రిల్ 25న ముంగేలి కాంగ్రెస్ నాయకులు అనుమానాలు వెలిబుచ్చిన తర్వాత, పోలీసులు దుర్గావతి ఇంటి మీద దాడి చేసిన తర్వాత ఆమెను ఆస్పత్రికి తరలించారు. ఆమె భర్త హేమ చంద్రపాట్లే, అతని సోదరుడు జగదీష్ పాట్లే ఈ మొత్తం వ్యవహారాన్ని మసి బూసి మారేడు కాయ చేయడానికి ప్రయత్నిస్తున్నారట. దుర్గావతి స్వయంగా ఇది ప్రమాదమేనని ప్రకటించినప్పటికీ ఆమె తమ్ముడు మాత్రం ఇది హత్యా ప్రయత్నమని ఆరోపిస్తున్నాడు....



## తొంభై ఏళ్ళు వచ్చినా రోజుకి రెండు మైళ్ళ నడక!

నార్మన్ విన్సెంట్ పీల్ పేరు విన్నారా? 'ది పవర్ ఆఫ్ పాజిటివ్ థింకింగ్' అనే పుస్తకాన్ని ఆయన రాశాడు. కోటీ యాభై లక్షల ప్రతులు అమ్ముడు పోయిన పుస్తకంగా అది ప్రపంచ ప్రఖ్యాతమైంది. ఆలోచనలో సరైన సందేశాన్ని ప్రచారం చేసి, అమ్మకాలలో చక్కని ఫలితాలు సాధించిన పీల్ ఇప్పుడు వయసు తెచ్చే ఇబ్బందుల్ని అధిగమించి సాఫీగా జీవితాన్ని గడుపుతున్నాడు. ఆయన చెవులకు హియరింగ్ ఎయిడ్స్ ఉన్నాయి. దృష్టి



పూర్తిగా మందగించింది. కాని "అద్దంలో చూసుకుంటే నాకు వయసు మీదపడినట్టు ఏమాత్రం అనిపించడం లేదు' అంటున్నాడాయన. ఇప్పటికీ ఆయన రోజుకు రెండు మైళ్ళు నడుస్తాడు. పుస్తకాలు రాస్తుంటాడు. ఈ మధ్యనే ఆయనకు వయసును గుర్తు చేసేందుకు ఓ వెయ్యి మంది స్నేహితులు ఒక పుట్టినరోజు విందు ఏర్పాటు చేశారు. "తొంభై ఏళ్ళు నిండాయనే విషయాన్ని చెప్పుకోవడం ఎందుకూ? చనిపోలేదని గుర్తిస్తే చాలు" అన్నాడాయన!.....

ఆంధ్రసచిత్రవారపత్రిక

# 1988 దీపావళి కథల పోటీ

## మొత్తం బహుమతులు రు. 7,200/-

**ముగింపు తేదీ : 10 సెప్టెంబరు, 1988**

ఎప్పటిలాగే ఈ ఏడాది కూడా దీపావళి కథల పోటీ నిర్వహిస్తున్నాము. గతంలో లాగే ఈ సంవత్సరం కూడా సంపాదకుని ఎన్నికలో ఉత్తమంగా వచ్చిన ఆరు కథలని అకారాది క్రమంలో ఆంధ్ర సచిత్ర వారపత్రిక దీపావళి సంచిక, ఆ తరువాతి సంచికల్లో ప్రచురిస్తాము. అనంతరం పాఠకుల బాలట్ నిర్వహిస్తాము.

పోటీలో సంపాదకుని ఎన్నికలో వచ్చిన ఆరుకథలకీ ఒక్కొక్క దానికి రు. 700/- చొప్పున బహుమతి లభిస్తుంది. ఆ తరువాత పాఠకుల బాలట్‌లో మొదటి స్థానంలో వచ్చిన కథకి రు. 750/- అదనపు బహుమతిగా అంద జేస్తాము. బాలట్‌లో రెండవ, మూడవ స్థానాలలో వచ్చిన కథలకి వరుసగా రు. 650/- ; రు. 550/- వంతున అదనపు బహుమతులుగ లభిస్తాయి. మిగిలిన మూడు కథలకీ ప్రత్యేక బహుమతిగా ఒక్కొక్క దానికీ రు. 350/- చొప్పున అందజేస్తాము.

పోటీలో సాధారణ ప్రచురణకి స్వీకరించిన కథలకి ఒక్కొక్క దానికీ రు. 150/- వంతున వాటి ప్రచురణ జరిగిన తర్వాత ఇస్తాము.

## నిబంధనలు

1. కథావస్తువు తెలుగువారి సామాజిక జీవితానికి సంబంధించినదై ఉండాలి.

2. కథ వ్రాతప్రతి పన్నెండు అరఠావు (ఎక్సర్‌సైజ్ నోట్ పుస్తకం పేజీకి రెట్టింపు) పేజీలకి మించి ఉండరాదు. కాగితానికి ఒక వైపే సిరాతో లేదా బాల్ పెన్‌తో రాయాలి. వ్రాత ప్రతిపై "1988 దీపావళి కథల పోటీకి" అని మొదటి పేజీ పై భాగంలో స్పష్టంగా రాయాలి.

3. అనువాదాలు, అనుసరణలు, కాపీ కథలు పంపరాదు. గతంలో ఇతర పత్రికలకి పరిశీలనకి పంపిన, ప్రచురింపబడిన, రేడియో, టి. వి. లలో ప్రసారం అయిన రచనలని పోటీకి పంప కూడదు. ఈ మేరకి రచయిత (త్రు)లు హామీ పత్రం రాసి వ్రాత ప్రతికి జతపరిచి పంపాలి. హామీ పత్రం లేని రచనలని పరిశీలించటం జరగదు. ఆంధ్ర పత్రిక సంస్థ ఉద్యోగులు, వారి బంధువులు ఈ పోటీలో పాల్గొనరాదు.

4. రచయిత (త్రు)లు కలం పేరుతో రాసినా, వారు తమ అసలు పేరు, పూర్తి చిరునామా వ్రాత ప్రతి మీద స్పష్టంగా రాయాలి.

5. సంపాదకుని ఎన్నికలో బహుమతి పొందిన ఆరు కథలనీ ఆయా రచయిత (త్రు)ల పేర్లు లేకుండా ప్రచురిస్తాము. తరువాత బాలట్ ఫలితాలతో పాటు వారి పరిచయాలని ఫోటోలతో సహా ప్రచురిస్తాము.

6. పోటీ లో బహుమతి పొందిన కథా రచయిత (త్రు)లు తమ జీవిత వివరాలని, ఫోటో లని పంపి, వాటి ప్రచురణకి అంగీకరించ వలసి ఉంటుంది.

7. రచనలపై వచ్చే ఎటువంటి పేచీలకైనా ఆయా రచయిత (త్రు)లే బాధ్యత వహించ వలసి ఉంటుంది.

8. పోటీకి పంపే కథలని 10 సెప్టెంబరు, 1988కి కానీ అలోగా కానీ మా కార్యాలయానికి అందేలా పంపాలి. ఆ తరువాత అందిన వాటిని పోటీకి పరిశీలించటం జరగదు.

9. పోటీకి పంపిన కథలని ఎట్టి పరిస్థితులలోనూ తిప్పి పంపటం జరగదు. కాబట్టి రచయిత (త్రు)లు తమ కథలతో పాటు తపాలా బిళ్ళలు అతికించిన, స్వంత చిరునామా కల కవర్లని జతపరచ వలసిన అవసరం లేదు.

10. పోటీలో బహుమతి పొందని కథలలో కొన్నిటిని సాధారణ ప్రచురణకి స్వీకరించి వాటిని వీలు వెంబడి ప్రచురిస్తాము. స్వీకరించిన కథల విషయం ఆయా రచయిత (త్రు)లకి తెలియ చేస్తాము. ప్రచురణకి స్వీకరించని కథల విషయంలో ఆయా రచయిత (త్రు)లకి తెలియ చెయ్యటం సాధ్యంకాదు. కాబట్టి వాటి విషయంలో ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలకీ అవకాశం లేదని గమనించ కోరుతున్నాము.

11. పోటీకి పంపే కథలని "సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక, గాంధీనగరం, విజయవాడ - 520003" అనే చిరునామాకి పంపాలి. వ్యక్తుల పేర పంపరాదు. కవరు పై భాగంలో "1988 దీపావళి కథల పోటీకి" అని స్పష్టంగా రాయాలి.

రచయిత (త్రు)లు అందరూ ఉత్సాహంగా ఈ పోటీలో పాల్గొని దీనిని జయప్రదం చేయగలరని ఆశిస్తున్నాము.

-సంపాదకుడు

# బైద్యనాధ్ ..............

## ఇద్దరికీ ఆరోగ్యము మరియు పెరుగుదల కొరకై

జీవితమంతా

మీరు భాగస్వాములు కనుక

మీరు శ్రద్ధవహిస్తారు కనుక

మీరు ఒకరికి మరియొకరు ఆనందముగా ఉండుటకు శ్రద్ధ తీసుకుంటారు.




మీకు శక్తిని, బలమును కలుగచేసి రోజు రోజుకు సంవత్సరముల తరబడి విటా-ఎక్స్ మిమ్ములను కాపాడును.

స్త్రీ పురుషులకు బలవర్ధకమైన ఔషధము.

## బైద్యనాధ్ విటా-ఎక్స్

## మొటిమలా?

మొటిమలు, మచ్చలు, ఉడుకు పొక్కులు మరియు చర్మరోగములకు ఆదర్శమైన నివారిణి మంచి రక్తశుద్ధికరము, చర్మమును పరిశుద్ధముగా ఉంచును,






## బైద్యనాధ్ సురక్తా స్ట్రాంగ్

రక్తమును శుద్ధి చేయును. చర్మమును నిర్మలముగా ఉంచును.



మామూలు పండ్లపొడే కాదు ఔషధము కూడా దంతక్షయము మరియు చిగుళ్ళ వ్యాధులకు అత్యవసరమైన నివారిణి ఆరోగ్యకరమైన దంతములు బలమైన చిగుళ్ళు ఆరోగ్యముగా చింతలు లేకుండా ఉంచును.

బైద్యనాధ్ ఎర్ర పండ్లపొడి మాత్రమే ఈ పనిచేయును

## బైద్యనాధ్ ఆయుర్వేద పండ్లపొడి

83P 97T



# దూరదర్శనం

లత

## శోభిల్లు సప్త స్వర

రవికిరణ్ శహానా రాగంలో గోటు వాద్యం- మురళీగారి స్వర రాగసుధ ఉన్నంత బాగా ఈ శోభిల్లు సప్త స్వర ఉండటం లేదు. అలా అన్నందుకు క్షమించాలి. మాండలిన్ శ్రీనివాస్ ప్రోగ్రాం తప్ప మిగతావన్నీ సో. సో.గా ఉన్నాయి. ఆఖరికి మురళీగారు గాలిలో కూర్చుని వాయించిన వయొలా మృదంగాలు కూడా ఆయన గాత్రం అంత హాయిగా లేవు. బహుశా ఇది నా అభిరుచి కావచ్చును. సంగీత ప్రియులకు బాగుండనివి- పండితులకు బాగుండ వచ్చును. లోకోభిన్నరుచిః

## తీస్రీ రాస్తేకి ముసాఫిర్

మంగళవారం కష్మాకష్‌లో నాటిక పేరు అది. ఏ రచయితదో స్క్రీన్ మీద చదవలేం- ఏ ఇంగ్లీషు పత్రికలోనో తెలుసుకోవాలి- ముగ్గురు ముస్లిం స్త్రీలు ఉంటారు. ఒక స్త్రీ కోడలుగా సూర్యుడినీ చంద్రుడినీ చూడకుండా జీవితం సాగిస్తుంది. మరో పిల్ల ప్రేమించి పెళ్ళి చేసుకుంటుంది. ఇంకో షహజాదీ జీవితపు రంగుల చిత్రాల్ని దర్శించాలని మూడో మార్గం తొక్కుతుంది. ఈ తీస్రీ రాస్తేకి ముసాఫిర్- తన కూతుర్ని ఆశీర్వదిస్తుంది. ఏమని? తనలాగా అమ్మ కావాలని.

## అమీర్ ఖుస్రూ

బుధవారం నాడు అమీర్ ఖుస్రూ నాటకం వస్తున్నది. మూడో భాగం వచ్చేసరికే విసుగ్గా ఉంది- ఇక ముందు దాన్ని సమీక్షించను. చివరికి సమింగప్ ఇవ్వచ్చును.

* * * * * *

గురువారం ఏ. ఐ. కలైజ్ఞాని చిత్రించిన అజ్ఞానం నాటిక, సమర్పణ అమృతాంజనం సంస్థ.

విక్రమ్, చక్రవర్తి సినీ నటులు. పిల్లలు గ్రూపులుగా విడిపోయి పోట్లాడుతూ పేడ కొడుతూ ఉండగా ఒక విలేఖరి అమ్మాయి చూసి- విక్రమ్‌ని చూపిస్తానని ఆ కుర్రాడిని స్టూడియోకి తీసి కెడితే సినిమా సెట్టింగు అనీ నిజంగా యుద్ధం చేసేప్పుడు ఎవరూ ఎదురుగా ఉండరనీ చెట్టుమీంచి దూకేప్పుడు మరొకరు దూకుతారనీ- తెలుసుకున్న ఆ కుర్రాడు తన స్నేహితులతో కలిసి నప్పుడు తప్పనిసరిగా చక్రవర్తికి జై కొడతాడు- మొత్తం మీద నాటకంలో కాస్త సందేశం కొంత సైకాలజీ ఉంది. గొప్పదేం కాదు గాని బాగానే ఉంది.

## జాషువా కవితా చర్చ

పాల్గొన్నవారు నాగభైరవ కోటేశ్వరరావు, ఆచార్య తిరుమల, పున్నయ్యా గార్లు. జాషువాగారి చివరి రోజుల్ని చూశాను నేను. తనకి పేదరికం సహనాన్ని నేర్పినదనీ తన అడుగువర్గపు జన్మ తనలో కరుణనే నింపిందనీ జాషువా అన్నారని అంటూ- ఆమె కన్నుల అనంతాంబరపు నీలినీడలు కలవు అనే భావ కవిత్వానికీ- మార్క్సిజం దృష్టిలో ఆకాశ మార్గంలో ఒంటరి ఒంటెలు అనే విప్లవ కవిత్వానికీ మధ్య మానవతా వాదపు కవిత్వం చెప్పారు జాషువా- లేజి విడువలేదు రాజసాన్ని- ఇచట ఏ లేత ఇల్లాలి నల్లపూసల పేరు మంట గలిసెనో లాటి పద్యాలు వినిపిస్తూ చక్కని సాహితీ విందు చేశారు పై ముగ్గురు రసపిపాసువులూ. బాగుంది కార్యక్రమం.

## అన్నమాచార్య

ఆదివారం నాడు అన్నమాచార్య- రూపకం ఉదయ ప్రసారంలో వచ్చింది. కమ్మని పాటలతో ఈ నాటిక బాగుంది.

## రామాయణ్

కాలనేమి చెప్పినట్లు స్నానానికి వెళ్ళిన హనుమని మొసలి పట్టుకుంటుంది. దాన్ని చంపుతాడు. అది స్త్రీ అయి కాలనేమి రాక్షసుడని చెపుతుంది- కాలనేమిని చంపి సంజీవి పర్వతం తెస్తుండగా భరతుడు బాణం విడుస్తాడు- అక్కడ భరతుడుకి రాముడికథ టూకీగా చెప్పి మళ్ళీ బయలు దేరతాడు. ఎట్టకేలకు లక్ష్మణుడు జీవిస్తాడు. ఏదో రామాయణంలో ఇలాటి కథలు కావలసినన్ని. ఈ చాలా స్లోగా ఉంది. ఆ స్లోతో రామాయణ అందం తగ్గిందని చెప్పాలి.

## కృష్ణ తులాభారం

నాటిక. రుక్మిణీదేవి వచ్చింది కరెంటు పోయింది- చల్లని నీళ్ళు లేవు. చల్లనిగాలిలేదు- చక్కని నాటకాలు చూసే యోగం లేదు- మహానాడుకి మాత్రం కోట్లకి కోట్లు తగలపెడతాడు అన్నగారు.

## కష్మాకష్

సీరీస్‌లో ఈరోజు వెయిటింగ్ రూమ్ నాటిక- వర్షం వలన ఢిల్లీ వెళ్ళే రైలు ఒక స్టేషనులో ఆగిపోయింది. ఇద్దరు మేం సాబ్‌లు విసుక్కుంటూ వెయిటింగ్ రూమ్‌లోకి వెడతారు అక్కడ శకుంతల అనే ఎటెండరు ఉంటుంది. మేంసాబ్‌లిద్దరూ భర్తలతో పడనివారే. శకుంతల మాత్రం భర్త ఖూనీ కేసులో ఇరుక్కుని పదునాలుగేళ్ళు జైలుశిక్ష అనుభవిస్తున్నా అతని కోసమే ఎదురుచూస్తుంది. రైలు రాకపోయినా గ్రామస్తులు ఒక ట్రక్ ఏర్పాటు చేస్తారు. శకుంతల వాళ్ళ దగ్గర శెలవు తీసుకుంటుంది. మేంసాబ్‌లు కూడా ఆ ట్రక్కులో ఎక్కుతారు. ఇందులో అంతరార్థం మొగుడిని నమ్ముకోవాలి. ఆ విషయం లాభకరం. □








**కోకా ప్రకాశ్‌గుప్తా, పర్లాకిమిడి**

ప్రః ఇంపైన సంగీతం, సొంపైన నటన ఉంది కూడా కొన్ని చిత్రాలు పరాజయం పొందడానికి కారణమేమిటంటారు, సుమలతగారూ?

**జః పులుసు, పచ్చడి బావుంటే చాలా? అన్నం కూడా సరిగా ఉడకాలి కదా!**

**కె. సీతారామశర్మ, బళ్ళారి**

ప్రః నేను టిక్కెట్ కొని హాలులోకి వెళ్ళి సినిమాలు చూడకుండా బయట షో కేసులలో ఉండే ఫొటో కార్డులను చూసి తృప్తి పొందుతుంటాను. ఇందువల్ల ఎంత డబ్బు ఆదా అవుతుందో తెలుసాండీ! ఆ డబ్బుతో ఏ హొటల్‌కైనా వెళ్ళి, నిక్షేపంగా తినొచ్చు కదా?

**జః ఆ హొటల్లో కూడా 'మెనూ' బోర్డులో ఉండే ఫలహారాల వివరాలు చదివి తృప్తి పొందితే, ఆ డబ్బు కూడా ఆదా అవుతుంది కదా!**

**కె. మనోహర్, ఖర్గపూర్**

ప్రః సుమగారూ! కష్టాలలో ఉన్నప్పుడు. మనకు అయినవారెవరో తెలుస్తుందా?

**జః కాని వారెవరో కూడా తెలుస్తుంది.**

**ఎం. అరుణ, సీతాఫల్‌మండి**

ప్రః సంసారమనే సాగరాన్ని ఈదడానికి చిన్న చిట్కా?

**జః సంతోషమనే 'లైఫ్ బెల్ట్'ను కట్టుకుని ఈదితే సులభం. విచారమనే బండరాతిని తగిలించుకొని ఈదితే మునగడం ఖాయం.**

**చిట్టి సౌజన్యరావు, రెంటచింతల**

ప్రః ఆశను విడనాడిన వ్యక్తి మహర్షి కాగలడంటారా?

**జః మహర్షికి కూడా మోక్షం పొందాలని ఆశ ఉంటుంది.**

**కె. దుర్గాదేవి, యలమంచిలి**

ప్రః నా అభిమాన తారగారూ! ప్రతి వారూ వారి మనసులోని మాటను ఏమాత్రం దాచకుండా బయటకు చెప్పేట్లుంటే, ఈ ప్రపంచం ఎలా ఉండేది?

**జః పిచ్చాసుపత్రిలాగా!**

**ఎన్. రుక్మిణీదేవి, మంచిర్యాల**

ప్ర : సుమగారూ! మీరు మెచ్చిన 'ప్రశ్నలు–జవాబులు' ఏవి?

జ : 'భగవద్గీత'లో అర్జునుని ప్రశ్నలకు శ్రీకృష్ణుని జవాబులు.

**ఎం. శ్రీమతి, అదిలాబాద్**

ప్ర : యువతులు ఎల్లప్పుడూ తలలు వొంచుకునే నడవాలంటారు పెద్దలు ఎంచేత?

జ : లేకపోతే షికారుకెళ్ళినపుడు షాపుల ముందు నగలు, చీరలు కళ్ళబడితే పర్సు ఖాళీ అవుతుందనేమో!

**గీతారాణి, పూనా**

ప్ర : సాధారణంగా కొందరు స్నానం చేసేటప్పుడు భగవంతుని ధ్యానిస్తూంటారు. ఈకాలం యువకులు కొందరు సినిమా తారలను ధ్యానించేలా సినిమా పాటలు పాడుతూంటారు. ఇది సబబేనా?

జ : ఎవరూ ప్రత్యక్షం కానప్పుడు ఏ పాటపాడితే ఏం?

**ఆర్. శాంతి, పెన్నాడ**

ప్ర : చిత్ర రచయిత్రిగా సినిమారంగంలో కాలు మోపవలెనని యున్నది. మీరేమందురు?

జ : రచయిత్రి కావాల్సిన వారు మెదుడు మోపాలే కాని, కాలు మోపినందువల్ల ప్రయోజనముండదు.

**ఉత్తూరి మల్లేశం, జగిత్యాల**

ప్ర : పిల్లలు చేసే తప్పులను పెద్దలు దండిస్తారు. విద్యార్థులు చేసే తప్పులను మేస్టార్లు దండిస్తారు. మరి పెద్దలు చేసేతప్పులను.....?

జ : కాలమే దండిస్తుంది.

**పసుపులేటి కొండలరావు, యలమంచిలి**

ప్ర : మిస్ సుమలతగారూ! 'అభినయం' ఎన్ని రకాలు?

జ : మూడు. 1. ఆంగికం– హస్తాలతో భావన చూపడం. 2. వాచికం – భావయుక్తంగా సంభాషణో ఉచ్చారణ లేక గానం. 3. సాత్వికం – హస్త ముద్రలు లేకుండా ముఖకవళికలతో, చూపులతో, పెదవులతో భావ ప్రదర్శన చేయడం.

**యర్రా విజయకుమార్, వుయ్యూరు**

ప్ర : నడిచే దారిలో అడ్డంగా ముళ్ళు వేసే వారిని ఏమనాలి?

జ : అనాల్సింది వారినికాదు; ఆ ముళ్ళను చూసి భయపడే వారిని పిరికివాళ్ళనాలి. ఆ ముళ్ళను దాటి వెళ్ళడమే జీవయాత్ర...... జైత్రయాత్ర.... కదా?

**కడార్ల శివకుమార్, అనకాపల్లి**

ప్ర : మీరు చాలా ఆంగ్ల నవలలు చదువుతుంటారట కదా? ఐతే, అందరి కన్నా ఎక్కువ పారితోషికం పుచ్చుకునే రచయిత ఎవరో మీకు తెలుసా?

జ : "కార్పెట్ బేగర్స్" లాంటి చక్కని నవలలు రాసిన హెరాల్డ్ రాబిన్సన్. ఒక పదానికి 300 రూపాయల చొప్పున ఆయన రేటు. ఈ జవాబు ఆయనే ఇచ్చి ఉంటే, 6,900 రూపాయలు పుచ్చుకునే వాడేమో?

**ఎం. హెచ్. ప్రియదర్శిని, అనకాపల్లి**

ప్ర : మనదేశంలో వరకట్న పిశాచం లేని ప్రాంతమేదీ లేదా?

జ : అస్సాంలో మాత్రం ఆది నుంచీ ఈ ఆచారం లేదు. మరో విషయం : 'ఎన్సైక్లోపీడియా ఆఫ్ బ్రిటానికా' ప్రకారం అస్సాంలోని స్త్రీలు మిక్కిలి అందకత్తెలు. □

---

కూపన్

## ఆంధ్ర సచిత్ర వారపత్రిక

# సుమలత సమాధానాలు

ప్రశ్న.......................................................................................

.................................................................................................

.................................................................................................

పంపినవారి పేరు.......................................................................

పూర్తి చిరునామా......................................................................

## నిత్య నూతన సీరియల్




(గత సంచిక తరువాయి

రంగమ్మకు కోపము వచ్చి నాగమ్మ మీద ఎరుచుకొనెను. నాగమ్మ మౌనమే అవలంబించెను. చివరకు రంగమ్మ వంట చేసికొని భోజనము చేసెను. బియ్యమెన్ని పోయవలయునో తెలియ లేదు. తన కాకలిగా నున్నది. అన్నమొక మూల బియ్యము. పచనమైన భాగము తనకే చాలలేదు. పిల్లలకు మిగులలేదు. మఱల పొయ్యి మీద బియ్యము పెట్టుటకు, నిప్పార్పి వేసెను. లోపల కోపము మండుచుండెను. రంగమ్మ వంట చేయుట మిషనరీ స్త్రీలతో మాట్లాడినంత తేలిక కాదను కొన్నది. అప్పటికి ప్రొద్దు తిరిగినది. గ్రామాంతరము పోయిన రంగయ్య తిరిగి వచ్చెను. అతడు భోజనము చేసియే వచ్చెను. ఇంటికి వచ్చుసరికి గణాచారి రాటము వడుకుచుండెను. తన భార్య నెత్తురు త్రావిన "ఆడ పులి"వలె రొజుచుండెను. పిల్లలిద్దరు నాటల మీద ఆకలి మఱచిపోయి వీధిలో ఆడుకొనుచుండిరి. అతడు వచ్చి భార్యను పరామర్శించెను. గంటసేపటికి సంగతి అంతయు తెలిసెను. అతడు గణాచారి ఎప్పుడు ఏమియు అనడు. "అమ్మా" అనియే పిలుచును. ఆమె వద్దకు పోయి "అమ్మా! నేడుపవాస మెందు" కనెను. నాగమ్మ తల యెత్తి, కనుఱెప్పలెత్తి మఱల కనుఱెప్పలు వంచి, తల దించి, రాటము వడుకుచుండెను. రంగయ్యే సమాధానము రాదని తెలిసికొని ఊరకుండెను. అతడు గ్రామములోనికి పోయెను. "ఆడు పులి" ప్రొద్దు కుంకువేళ చల్లని గాలి సాగి అడవుల వెంట బయలుదేఱెను. తిరిగి తిరిగి రెండు మూడు జంతువులను జంపి యింటికి చేరెను. రాతిరి ప్రొద్దు పోయినది. మఱల అన్నము వండుకొనవలయును. పిల్లలు వీపంటుకొనిన కడుపులతో నిద్రపోవుచుండిరి. వంట చేయుటకు రంగమ్మ పిడుకలు తేవలెనని దొడ్డిలోనికి పోయెను. పిడుకల గుడిసె దొడ్డిలో నైరృతి భాగమున ఉన్నది. లాంతరులున్నను నాగమ్మ మీద కోపము చేత చీకటిలోనే పోయెను. దొడ్డిలో నాగమ్మ పెట్టిన పాదులన్నియు పందిళ్ళ మీద ప్రాకి ద్రాక్ష తోట వలె రమ్యముగా ఉండెను. దొడ్డిలోనికి పోయిన రంగమ్మకు ప్రతిపదమున ఏదియో ప్రాకుచున్నట్లు భయమయ్యెను. తాను నడిచినచో నా ధ్వనియు తన వెంట నడిచి వచ్చుచుండెను. తానాగినచో ఆగుచుండెను. తొందరగానడుచుటకు రంగమ్మకు కాళ్ళు రాలేదు. మరల ఇంటిలోనికి పోయి దీపము తెత్తునా అనుకొనెను. దీపము తెచ్చులోపల పిడుకల గుడిసె వద్దకే పోవచ్చును. దీపము లేకుండ పిడుకుల గుండిసెలో చేయి పెట్టుట ఎందులకు? పోయి దీపము తెత్తునే అనుకొన్నది వెనుకకు తిరిగినది, తన వెంటనే మఱల ఆ కదలిక వచ్చుచుండెను. తొందరగా ఇంటిలోనికి వచ్చి దీపము తీసికొని బయలుదేరినది. భర్త యింటికి రాలేదు. పిల్లలు నిదుర పోవుచుడిరి. నాగమ్మను పిల్చుటకిష్టము లేదు. తోడు లేకుండ దొడ్డిలోనికి పోవుటకు భయమనిపించినది. "ఒకరు కను బట్టణ వీధుల వెంట పొద్దు పోవు పఱకు తిరిగి వచ్చుచుండుట లేదా, భయమెందు"కనుకొనెను. సాహసించి దొడ్డిలోనికి చొచ్చెను. తన కెడమ వైపున ఏదియో ప్రాకుచున్నట్లు తోచెను. లాంతరు పెద్దది చేసి చూచెను. ఏమియు కన్పించలేదు. మఱల నాలుగడుగులు వేసెను. ధ్వని ఈసారి కుడి వైపున వినిపించెను. కుడివైపున అన్నియు పాదులు. దీపము పెట్టి చూచెను. ఆకుపచ్చని ఆకులు, పసుపు పచ్చని పూవులుగాక మరియొకటి కన్పించలేదు. మఱల నాల్గడుగులు వేసెను. తనకన్న ముందు పామేదో నడుచుచున్నట్లు తోచెను. దీపమెత్తి వెలుతురు ముందొక రెండు గజముల దూరమున పడునట్లు చేసెను. మఱల ఏమియు కనిపించలేదు. ఆమె వెనుదిరిగి యింటిలోనికి పోదమనుకొన్నది. ప్రొద్దున కూడ అన్నము సయించలేదు. అన్నము "నమువాయిలత్తుక"గా ఉన్నది. ఒక సగము బియ్యమే. ఈ పూటనైన వండుకొని తినక బ్రతుకలేననుకొని మఱల బయలుదేరెను. పిడుకల గుడిసె వద్దకు పోవు వరకు ఏమియు ధ్వనిలేదు. లాంతరెత్తి గూడులో చూచి పది పిడుకలు తీసి పళ్ళెకలో వేసికొని, పళ్ళెక బుజమున నుంచుకొని, కుడిచేతితో లాంతరు పుచ్చుకొని బయలుదేరెను. ఆమెకన్న ముందేదో నడుచుచుండెను. ఆమె ఆగినది. ముందు నడచుచున్నట్లు ధ్వని లేదు. "దొడ్డి, యింత పెద్ద దొడ్డి యేమిటి? నాగమ్మ చాదస్తముగాకపోయిన దొడ్డినిండ ఇన్ని పాదులేమిటి? పాదులున్నచో పురుగు పుట్ర చేరును వెధవది– పేద పాఱపో కూరలు కొనవచ్చును: దానికోస దొడ్డియంతయు మహారణ్యమైపోయినది. అడు పెట్టుటకు వీలులేదు. ఆకాకు నడుమ పాముండవచ్చును." రంగమ్మ మరి రెండడగులు వేసెను. సాగుచున్న పాము కొంచెము వేగముగా సాగెను. రంగమ్మ "పోనిలే! వెనుక వచ్చు పామునకు భయపడవలయునుగాని తనకన్న ముందు పోవు పామునకు భయపడుట ఎందుల"కనుకొనెను. రంగమ్మ రెండడుగులు ముందుకు వేసెను. పాము రెండడగులు వెనుకకు వేసెను. ఆమె భయపడెను. "పిడుకల గుడిసె దొడ్డిలోనింత మూల కట్టుకొనుటేమిటి?" అనుకొనెను. ఎంత మూల గట్టుకొనిననేమి? ప్రొద్దుండగా పిడుకలు తెచ్చుకొనినచో? పిడుకలెవరు తేవలయును? వంట చేయువారు తేవలయును. తాను వంట చేయదుకదా! మరి ఱేపటి నుండి నాగమ్మ వంట చేయకపోయినచో వంట వానిని పెట్టు

జరిగిన కథ 53 : రంగారావుగారు దొరసానిని వివాహం చేసుకుంటారు. దేవదాసి ప్రతి రోజూ దేవాలయానికి పోయి స్వామిని సేవిస్తూ ఉంటుంది. గణాచారికి, పసిరికకు ఊరిలోని పరిస్థితులు అనుకూలంగా ఉండవు. ధర్మారావు పంకజమ్మగారి ఇంటిలో అప్పుడప్పుడూ సభలు చేస్తూ ఉంటాడు. అరుంధతి ఆరోగ్యం చెడిపోతుంది. మంగమ్మ ధర్మారావుకు నాటకం టిక్కెట్టు పంపుతుంది. నాటకం గురించి ధర్మారావు తీవ్రంగా అధిక్షేపించి, నాటక లక్షణాలను వివరిస్తాడు. వేసవిలో సుబ్బన్నపేట చాలావరకు తగులబడిపోతుంది. ధర్మారావు ఇల్లు కూడా తగులబడిపోతుంది. సుబ్బన్నపేటలో విద్యుద్దీపములు, కొళాయిలు పెట్టించడానికి తీర్మానాలు నెగ్గుతాయి. విద్యుద్దీపములు, కొళాయిలు రావడంతో సుబ్బన్నపేటలో క్రొత్త క్రొత్త ఉద్యోగులు నియమించబడ్డారు. ఒకనాడు ఒక క్రైస్తవ సన్యాసిని గణాచారిని చూచి దడుచుకుని మంచం పడుతుంది.

వలయును. అవుశపుడు సుఖముగా నుండును. అప్పుడొక యంతర్వాణియన్నది- నాగమ్మ మూలమున సంసారము గుంభనగా నున్నది; పచ్చపచ్చగా ఉన్నది వంటవాడు వచ్చెనా సంసారము గుల్లయైపోవును- రంగమ్మ నిలుచుండి ఆలోచించుచున్నది. ఇంక రెండు గజములలో ఇంటిలోనికి పోవును. వెంట వచ్చుచున్న పాము రెండు గజములలోపుగానే ఊదిపోవునేమో! ఒక్క గంతులో ఇంటిలో పడవలెననుకొన్నది. ఇక్కడ కాలు తీసి యింటిలో పెట్టవలయును. పామేమి చేయగలదు? చేతిలో మున్నది. పామెచటనున్నదో మాత్రము తెలియటలేదు. అనుకొన్నట్లే ఒక్క దూకు దూకి యింటిలో పడినదేకాని, తన ఒడలు తనకు

తెలియలేదు. అప్పుడే రంగయ్య ఇంటికి వచ్చెను. గణాచారి "భార్య యింటిలో విరుచుకొని పడిపోయినది. పోయి చూచుకొ"మ్మనెను. అతడు గాబరాపడి లోనికి పోయెను. రంగమ్మ నోట నురుసులు గ్రక్కుచుండెను. గణాచారి లోనికి వచ్చెను. రంగయ్య "అమ్మా" నీవున్నావనుకొన్నాను. ఇట్లు చేసితివే"మనెను. నాగమ్మ "నేనున్నాననుకొని పది యేండ్లయినది. ఉన్నాను కనుకనే యిన్నినాళ్లాగినది. భయములేదు, ఏమిటో దొడ్డిలోనికి పోయి చూచి ర"మ్మనెను. రంగయ్య



దీపము పుచ్చుకొని దొడ్డిలోనికి పోయెను. గడపలో కాలు పెట్టినంతనే దీపపు కాంతులు తేజోవిహీనములు కాగా, దొడ్డియంతయు వెలుగుగా ఉండెను. దూరమునుండి రెండు వత్తులు గల దీపపు ప్రమిద వలె మాణిక్య కాంతులు వెలుగు రెండు తలల తోడి మహాఫణము విప్పి ఒక పాము తోకపై నిలుచుండెను. రజత దీపస్తంభము,

రాజితమైన ప్రమిద, రాజితములైన ,వత్తులు, సువర్ణకాంతి- రంగయ్య కన్నులు మూతబడెను- నాగమ్మ నమస్కరించెను. రంగయ్య పరవశుడై పోయెను. కనిపించిన మహాజ్యోతి నేత్ర నిమీలనమే చేసెగాని, హృదయోన్మీలనము చేయలేదు. అయిదు నిముసములకు తన ఒడలు తనకు తెలిసిన రంగయ్య, భార్య చికిత్సా విషయము తలపోసెను గాని, సుబ్రహ్మణ్యేశ్వరస్వామి మీద ఊహ పోనీయ లేదు. గంటసేపటికి భార్య లేచి కూర్చున్నది. ఆమె మాటాడినది. వారును వీరును వచ్చి చూచిరి. ఆమె భయపడినదిగాని మరి యేమియు లేదనిరి. తెల్లవారు వరకు రంగమ్మ రెండు పాదములు ఈలావయ్యెను. ఆమె లేవలేక పోయెను. ఇరుగు పొరుగువారు వచ్చి చూచిరి. గణాచారి దొడ్డిలో నేమొ పాడుచు కూరలు త్రుంచుచుండెను. అందరును గణాచారివద్దకు పోయిరి. ఆమె "రెండు శిరసుల నాగు రివ్వు రివ్వున వచ్చి ఇంటి కోడలి పురుగూదింది దొడ్డిలో" అని పాడుచుండెను. నలుగురును వచ్చి రంగయ్యతో "పురుగూదుటయే గాని కఱవలేదు. గణాచారి పాడుచున్న"దనిరి; రంగయ్య పాము మంత్రగాండ్రను పిలువబోయెను. పామదృష్టము వచ్చెను. నలుగురును పోవద్దనిరి. అతడు మానెను. వారమురోజులు క్రమ క్రమముగా వాపు తగ్గుచు వచ్చెను. గణాచారి అన్నము వండి పెట్టుచుండెను. పామాదివారమున ఊదెను. మఱల ఆదివారమునాడు రంగమ్మ లేచి తిరిగెను. గణాచారి రంగయ్యతో అన్నది: అబ్బాయీ! సుమారు మూడు వందల యేండ్లు నేను నీ యింటిలో ఉన్నాను. ఇంటిలో నా ప్రభుత్వమే సాగినది కాని, మరియొకటి సాగలేదు. ఆ రోజులు వెనుక పడినవి. నాకు వేరే ఊరి బయట నీకున్న రెండెకరముల మెట్టలో ఒక పాక వేసిపెట్టుము. నేనందుండెదను. లేదా, స్వామి-యాలయమునందే ఉండెదను. ఈ యిల్లు నేనింక నిలువరాకున్నది" అనెను. రంగయ్య మాటాడలేదు.

గణాచారి యింటిలో నుండి వెడలిపోయెను. పోయి సుబ్రహ్మణ్యేశ్వరాలయము ముందు నిలుచుండి నిలుచుండి, ప్రొద్దుక్రుంకు వరకు నాగేశ్వరస్వామి ముఖ మంటపమునందు శయనించెను. గణాచారి మఱల రంగయ్య యింటికి రాలేదు. మూన్నాళ్ళయిన తరువాత మేనల్లుడు పోయి నాగమ్మను రమ్మనెను. ఆమె రాలేదు. ప్రాతఃకాలముననే ఆమె చెఱువునొద్దకు పోవును స్నానము చేయును, స్వామి ఆలయములో కూర్చుండును; రెండు జాములకు మఱల చెఱువు గట్టునకు పోవును; అచ్చట ఒక్క గంట ఉండును. మఱల ఆలయమునకు వచ్చును. తటాకము, దేవాలయము; ఈ రెండు సంతానములతో ఆమె గడుపుచుండెను. మూడవ సంతానము లేదు. నాల్గునాళ్ళు ఆమెకు తిండి లేదు. ఎవరు అడగరు. ఎవరికీ శ్రద్ధ లేదు! ఈ సంగతి ధర్మారావునకు తెలియదు. అతడొకనాడు నాగేశ్వరాలయమునకు పోయెను. అచ్చట గణాచారి అస్థిపంజరమువలె కనిపించెను. అతడింటికి పోయి అన్నము తెచ్చి తటాకము వద్దకు పోయెను. రెండుజాములైనది! ఆమె అచట భుజించెను. మరునాడు నాగమ్మ పెద్ద మేనల్లుని ధర్మారావు పిలిచి, "నీవు ప్రతి దినము మా యింటి నుండి అన్నము తీసికొని పోయి నాగమ్మ గారికి పెట్టుము; సరిగా రెండు జాములకు: మఱచిపోకు" అనెను. అతని పేరు చంద్రయ్య. చంద్రయ్యకు ధర్మారావనిన "మఱచిపోకు"మన్న మాట కొరడా పుచ్చుకొని కొట్టినట్లుండెను. రోజులు గడుచుచుండెను.

రంగమ్మ యింటనొక గొల్లవానిని వంటకు పెట్టెను. వాడు ప్రొద్దుననే లేచి మొగమైనను తోముకొనక వంట చేయును. వంట చేసి పెట్టిన తరువాత పోయి ముఖప్రక్షాళనము చేసికొనును. పది గంటలగు వఱకు నలుగురును అన్నమునకు రావలసినదే! లేకపోయినచో వేరే పెట్టుకొని తినవలయును. వాడును భోజనము చేసి ఎచ్చటికో పోవును, రాతిరి వచ్చును. అప్పుడు మరల వంట చేసి స్నానము చేయును. వాడు వీధి వెంట నడుచుచుండగా వంటవాడనుకొనుటకు వీలు లేదు; పట్టభద్రునివలెనుండును. పెందలకడ భోజనములతో రంగమ్మ మునుపటికన్న నునుపు దేరెను. దేహమునకు కాంతి వచ్చెను. మనుపు బక్కగా నల్లగా, ఆరోగ్యవతిగానున్న ఆమె లావుపారి, మెరుగెక్కి అనారోగ్యవతి అయ్యెను. కాని అద్దములో చూచి, మునుపటికన్న తాను సౌందర్యవతి నైతిననుకొనెను.

సుబ్బన్నపేటకు క్రొత్త డాక్టరు వచ్చెను. అతని భార్య బి.ఏ. పరీక్షయై అదివఱకే దేశమున ప్రఖ్యాతి పొందియుండెను. ఆమె వచ్చినంతనే పేటలోని స్త్రీజనము తమకు శుభోదయ దినములు వచ్చినట్లు సంతోషించిరి. ఆమె స్త్రీ సంఘ మొకటేర్పాటు చేసెను; రంగమ్మ సంఘమునకు అధ్యక్షురాలు. సీతారావమ్మ కార్యదర్శిని. పంకజమ్మ, శ్యామల, మంగమ్మ డాక్టరుగారి భార్య యిందిరాబాయి, యితరోద్యోగస్థుల భార్యలు- సమాజములో సభ్యురాండ్రు నలుబదిమందియైరి. పట్టణములో చందాలు వసూలు చేయబడెను. జమీందారుగారి దర్శనము చేసిరి. వారు సమాజమునకొక స్థలము, నందు భవనమ నేర్పాటు చేయించిరి. సుసానిచెన్నపురి వచ్చిన అచటనుండి రంగారావుగారు నాల్గయిదు రోజులలో తీసికొని వచ్చును. ఆమె కూడ వచ్చెనేని స్త్రీ సమాజము సంపూర్ణ వికాసము పొందును. సమాజ భవనము నబాడ్మింటను కోర్టు పెట్టిరి. ప్రతినాడు సాయం సమయమున విద్యాధికలైన స్త్రీలందరు నచటచేరి బాడ్మింట నాడుదురు. పింగ్‌పాంగ్, కేరమ్సు మొదలైన గృహ క్రీడా విశేషములు కూడ సమకూర్చబడెను. సభికురాండ్రందరును ప్రతి దినము సమావేశ మగుదురు. రంగమ్మ, మంగమ్మ, పంకజమ్మలు పేటలో నున్నవారిలో నింగ్లీషు బాగుగా వచ్చినవారు. వారికి ముఖ్యరకు అగ్రస్థానము తప్పినదికాదు. కొందరు నూత్న భావనలు, పతి విరహితలు కూడ సమాజములో చేరిరి. వారు చాటు చాటుగా వచ్చుచుందురు. బ్రాహ్మణస్త్రీలు, ముండిత శిరస్కలు వచ్చుటకు గొంకుచుందురు. వారొకరివద్ద నొకరు సెలవు తీసికొందురు. నమస్కారములు చేసికొందరు. సర్వము పురుషులవలె నటించుటకు ప్రయత్నింతురు. మనస్సులలో దొరసానులవలె నుండవలయునని ప్రయత్నము. డాక్టరుగారి భార్య పూర్వము పెద్ద పెద్ద పట్టణములలో నుండి వచ్చెను అచట బంతి యాడునపుడు, బంతి తప్పిపోయి నపుడు, తగిలినపుడు, తాను కొట్టబోగా మఱొకరు



కొట్టినపుడు కూయవలసిన కొన్ని కూతల భ్యాసము చేసి వచ్చినది. అవి యన్నియు శ్వేత స్త్రీలు కూయు కూతలు. ఆమెను చూచి తక్కిన స్త్రీలు కూడ నవి నేర్చుకొనిరి. అందులో రంగమ్మ ఘామేదా తేలినది.

ఒకనాడు సాయంకాల మాటలైన తరువాత సమాజ భవనమున స్త్రీలందరును కూర్చుండిరి. నానా దేశ వార్తలను గురించి ప్రసంగము బలిసెను. ఒకామెయన్నది: "ఇతరదేశ స్త్రీలు రక్షకభటులుగ, కూడ పని చేయుచుండిరట! మన దేశమున కంత నాగరికత ఎన్నటికిని రాదు". డాక్టరొకామె యన్నది : "ఇతర దేశములందు స్త్రీలు శాసన సభలలో కూడ నున్నారు. స్త్రీలకు వలసిన సౌకర్యములు స్త్రీలే ఎరుగుదురు. స్త్రీ జన ప్రతినిధులు శాసన సభలలో లేకున్న స్త్రీ జనమునకు సౌకర్యములు కుదురవు." మంగమ్మ అన్నది : 'పురుషులకు స్త్రీలు ప్రేమాస్పదురాండ్రు వీరికి గావలసిన సౌకర్యము లన్నియు పురుషులు చేయరా?"

రంగమ్మ : "గృహమునందలి సౌకర్యములు మాత్రమే పురుషులు సమకూర్తురు. స్త్రీ బయటికి-పోయి రాజ్యపాలనాది విషయముల జోక్యము కలిగించుకొనవలెనని పురుషున కుండదు. అందుచేత నతడు జోక్యము కలిగించుకొనడు."

సీతారావమ్మ : పురుషుడు స్త్రీ వలన చాలనాళ్ళుగా సుఖపడుచున్నాడు. వంట మనము చేయుటయు అతడు తినుటయు, మనమింక కులు కాల్చుకొనలేము."

ఇందిరాబాయి : "వంట పూర్వము పురుషులే చేసెడివారు. నలపాకము, భీమపాకమందురుగాని దమయంతీ పాకము, ద్రౌపదీ పాక మనరు. పురుషులు చేయు వంట పని పురుషు డెప్పుడో మనమీద త్రోసియుందురు."

పంకజమ్మ : "నా యుద్దేశ్యములో రాజ్యమేలినది, యుద్ధములు చేసినదియు మనమే. క్రమ క్రమముగా పురుషులు మన యా శక్తియు నపహరించిరి. ఈ సంగతి ప్రమీల కథ వలన తెలియుచున్నది."

శ్యామల : సత్యభామ యుద్ధము చేయలేదా?

ఇందిర : "రాజపుత్రస్థానములో నెంతమంది స్త్రీలు లేరు యుద్ధము చేసినవారు?"

మరొకతె : "మనము వ్యర్థ ప్రసంగము చేయుచున్నాము."

రంగమ్మ : పురుషులు తమ క్లబ్బులలో నింతకన్న వ్యర్థ ప్రసంగము చేయుదురు.

ఇందిర : ఒకసారి పురమందిరములో నదేయూరిలోననొక్క సభకు పోతిని! ఆ వెనుక క్లబ్బు. సభయైనంతసేపు లోననుండి పంది కూతలు, కేకలు, చప్పట్లు, సోడాబుడ్ల మ్రోతలు - పురుషున కౌచిత్యము తెలియదు. వినయమనునది పురుష గుణము కాదు. స్త్రీ గుణము.

మంగమ్మ : చెడిపోనంతవరకు.




రంగమ్మ : మనమేమి చెడిపోయినాము?

మంగ : చెడిపోయినది వినయము.

సీతారామమ్మ: వినయమేమియు చెడిపోలేదు.

మంగమ్మ : పెద్ద విషయములలో చెడిపోయినను ఫరవాలేదు. స్వల్ప విషయములలో చెరుపు రారాదు. స్వల్ప విషయములందు జాతి తత్త్వముండును. మన రాజ్యము శత్రువులు హరింతురు. కష్టము లేదు. మఱల నెప్పుడో వారిని మనము జయించవచ్చును. కాని మనలోనున్న స్వాతంత్రేచ్ఛ, శౌర్యము - నీ గుణములు చచ్చిపోవుననుము. జాతి చచ్చిపోయినట్లే.

రంగమ్మ సీతారామమ్మతో ప్రక్కగా నన్నది : "ఇదీ దీని కథ యెవరికి తెలియదు? ఊరకే వేదాంతములు చెప్పునేమి? తాను వినయవతి మన మవిన యవతులము!" ఆ మాటలు విన్న నలుగు రైదుగురు నవ్విరి. మంగమ్మ వారు నవ్వినది యెరుగును. తన్ను గురించి యెవ్వరేమనుకొనుచున్నారో యన్న విషయ మామెకు పట్టలేదు. కార్యదర్శియైన సీతారామమ్మ యెన్నిసారు లడిగినను మంగమ్మ చందా యీయలేదు. ఆమె రంగమ్మతో చెప్పినది. ఒకనాడు రంగమ్మ దారి వెంట పోవుచు మంగమ్మ యింటిలోనికి పోయెను. ఆమె గౌరవించెను. ప్రసంగ మారంభించిరి.

రంగమ్మ : భర్త భార్యను కొట్టి తిట్టి బాధించినచో ఆమె అతనిని వదలుకొనవచ్చును, విడాకులు పుచ్చుకొనవచ్చును. దేశములోనున్న స్త్రీ లందరును సభలుచేసి యిట్టి తీర్మానములు రాచరికము వారికి పంపినచో శాసనసభవారు చట్టము చేయవచ్చును. మన గ్రామములోని స్త్రీలందరును సభ చేయుట కాలోచించు చున్నాము.

మంగమ్మ : స్త్రీలే భర్త మాట వినక యతనికి బాధ కలిగించినచో నేమి చేయవలయును?

రంగమ్మ : పురుషు డట్టి స్త్రీని వదలివేయు చున్నాడు.

మంగ : యదార్థము చెప్పుదునా? సత్పురుషుడైన భర్తను స్త్రీ పరిత్యజించుచున్నది. పతివ్రతయైన భార్యను పురుషుడు పరాభవించు చున్నాడు. ప్రత్యేకముగా ఎవరిదీ దోషము లేదు. ఎవడో దుష్టుడు స్త్రీని బాధ పెట్టినను లోకమునందు బహు పురుషులు భార్యలను ప్రేమతోనే చూచుచున్నారు. స్త్రీయందు పురుషున కున్నంత ప్రేమ గౌరవములు పురుషునందు స్త్రీకి లేవు.

రంగమ్మ : మీరు స్త్రీ జనోద్యమమునకు వ్యతిరేకముగా మాటాడెదరు.

మంగ : పని పంచుకొని చేయుట చక్కని పద్ధతి. "ఈ పని నీవు చేయుము, నేనీ మిగిలినది చేసెదను" అన్నప్పుడు "నీవా పని చేయుటయేమి? నేనే యా పని చేసెద" ననుట పని సానుకూల పడకుండుటకు ప్రథమ సూత్రము. ఇది నేడు మనదేశమందు పూర్తిగా పట్టుచున్నది.

రంగమ్మ : మీరన్న మాట నా కర్థము కాలేదు.

మంగమ్మ : లోకమున నిదివఱకు జరుగుచున్న మార్గము చాల బాగుగా నున్నది. ఎక్కడనైన దోషములున్నచో ఆ దోషములు పరిహరింప వలయును గాని మూలచ్ఛేదము చేయరాదు.

రంగమ్మ : మీరన్న మాటలు చాల అప్రస్తుతముగా నున్నవి.

మంగమ్మ : నిజమే! మీకు వ్యతిరేకముగా జెప్పినాను. నేను విధవా వివాహములకు, విడాకుల చట్టమునకు చివరకు స్త్రీ సమాజములకు కూడ వ్యతిరేకురాలను.

రంగమ్మ : సమాజములు కూడ ఉండరాదా?

మంగమ్మ : మీ కిద్దరు కుమారులుకదా! అందులో ఒకడు పసివాడు కావచ్చును. సాయంకాలమున సందెకస వూడ్వవలయును. దీపములు వెలిగించుట, ప్రక్కలు వేయుట, పిల్లల కన్నము

పెట్టి నిదురపుచ్చుట, వంట చేయుట - యివన్నియు మీరు సమాజ భవనమునకు వచ్చినచో ఎవరు చేయుదురు?

రంగమ్మ : పరిచారకులు.

మంగమ్మ : పరిచారకులనినంతనే యర్థమెమో తెలియునా? ధనముకల స్త్రీలు మాత్రమే సమాజములో నుండవలయునన్నమాట. అనగా వారికి మాత్రమే సుఖము, సాయంవాహ్యాళి, లోకవార్తా శ్రవణము, నాగరికత! తక్కిన స్త్రీల మాట యేమి.

రంగమ్మ : తక్కిన స్త్రీల విషయము. మనమే యోచించుచున్నాము.

మంగమ్మ : ఏమని? విడాకుల చట్టము కావలయుననియా? రక్షక భటులము కావలయుననియా? వారినిపోయి కనుగొని వారికి గావలసినవి చేయుధము.

రంగమ్మ : వారందరును విద్యా విహీనలు. వారి కేమి కావలయునో మనకు తెలిసినంత వారికి తెలియదు.

మంగమ్మ : మనకేమి కావలయునో పురుషునకు తెలిసినంత మనకు తెలియదు. మన కిప్పు డీ స్వతంత్రత ఎందులకు?

రంగమ్మ : విద్యా విహీనులకు. విద్యావంతులకు జ్ఞానములో భేదముండునుగాని, విద్య వచ్చిన తరువాత స్త్రీ పురుషులలో నంత భేదముండదు.

మంగమ్మ : చదువు సమానముగా వచ్చినను జ్ఞానము కొందరి కెక్కువ, కొందరికి తక్కువ.

రంగమ్మ : పురుషులకన్న స్త్రీలకు వివేకము తక్కువనియా మీ వాదము?

మంగమ్మ : మొన్న బెర్నార్డుషా వ్రాసినాడు : "స్త్రీలకు స్వాతంత్రము వచ్చి వంద యేండ్లయినది. ఒక్క రాజకీయవేత్రిగాని, యొక మత విషయక పరిజ్ఞాత్రి కాని పుట్టలేదు" అని.

## ఆటలు – అద్భుతాలు




## వేయిపడగలు

రంగమ్మ : లక్షలాది సంవత్సరములు పురుషుడు రాజ్యము చేయుచున్నాడు, కనుక వారిలో ఇన్నాళ్ళ అనుభవమువలన, గొప్పవారు పుట్టవచ్చును. స్త్రీ కూడ స్వాతంత్ర్యమన్నాళ్ళనుభవించినచో వీరి యందును గొప్పవారు పుట్టవచ్చును.

మంగ : పుట్టవచ్చును. సరేకాని, స్త్రీలలో కూడ గొప్పవారు పుట్టవలయునని వేయేండ్లు రెండు వేలేండ్లు ప్రయత్నము చేసి స్త్రీలలో మహా వ్యక్తులను పుట్టించవలయునా? పుట్టి వారేమి చేయుదురు? గొప్ప రాజకీయవేత్తలైన పురుషులు చేసిన పనియేనా? కాక లోకమును తలక్రిందులు చేయుదురా? అంతియేయైనచో అదిపురుషులు చేయనే చేయుచున్నారుకదా! ఒక మహా కార్యము జరుగుట ప్రధానమా అది స్త్రీ చేసెనా, పురుషుడు చేసెనా అన్న విచారణ ప్రధానమా? స్త్రీలకు స్వాతంత్ర్యమిచ్చి వేయేండ్లు తత్ఫల నిరీక్షించుచు చూచుచుందుము. ఆ మహా ఫల నట్టుంచి యీ వేయేండ్లలో ఎన్ని దుష్ఫలమ లుత్పన్నములగునో? పూర్వమున్నట్లుండుట వలన కొన్ని సుగుణములున్నవి. అవి అన్నియు నశించి పోవునుగదా!

రంగమ్మ : నశించిపోవలయును. నాశనము నుండియే సృష్టి పుట్టును.

మంగమ్మ : కొన్ని మహా సూత్రములు ప్రత్యేల్ప విషయమునకును పుట్టవు. మీరన్న దొక వేదాంత సూత్రము. నాశనము మఱల సృజన కనుగుణ మైనదియైనచో మఱల సృజన కలుగును. చూడుడు - చెట్టుకొమ్మ విరుతుము. అది మఱల చివురు వేయవచ్చును. చెట్టు తగులబెట్టుము. చిగుర్చుట యెట్లు? కుఱ్ఱవానికి దుర్బుద్ధి పుట్టును. దానిని నాశనము చేయుదుము. అప్పుడు సద్బుద్ధి కలుగును. దుష్టమైన దానిని నాశనము చేయుదుము. అప్పుడు సద్బుద్ధి కలుగును. దుష్టమైన దానిని నాశనము చేసినచో మంచి పుట్టును. మంచిని నాశనము చేసినచో చెడ్డ పుట్టును. పుట్టినది మంచియో చెడ్డయో విచారించుకొనవలయును. ఏదో సృష్టి జరుగును జరుగునని యుబలాటపడిన ఫలితము లేదు. ఆ జరుగబోవు సృష్టి నిశ్చయముగా ఇప్పటిదానికన్న ఉత్తమమైనదైనచో ప్రశాంతమైన దానిని

మచిలీపట్నంలోని, స్త్రీ విద్యాభివర్ధనీ సంఘం వారు ఇటీవల బందరులో నిర్వహించిన "పిండి వంటల పోటీ"లో పాల్గొన్న మహిళలు, న్యాయ నిర్ణేతలు, బహుమతి గ్రహీతలు, వారు చేసి తెచ్చిన పిండి వంటలని చిత్రంలో చూడవచ్చు.



## స్కయి జంప్



మెట్టమొదటి వ్యవస్థీకృత స్కయిజంప్ పోటీలు 1866లో నార్వేలోని ఓస్లో దగ్గర వున్న ఐవెర్ స్లొక్కాలో జరిగాయి. మొట్ట మొదటి అంతర్జాతీయ ఛాంపియన్ షిప్‌లు 1924లో షామోనిక్స్ అనే చోట జరిగాయి.

## మృత్యుశిఖరంపై విజయం

ఎయిగర్‌ని ఉత్తర ముఖంగా ఎక్కిన తొమ్మిది మంది మృత్యువాత పడిన తర్వాత 1938లో దానిని నలుగురు జర్మనీ దేశీయులు అధిరోహించారు. తర్వాత 1947లో ఇద్దరు ఫ్రెంచి వారు ఆ శిఖరాన్ని ఎక్కారు.

నాశనము చేయుడు. మొగిలు నీరును నమ్మి చెరువుకట్ట త్రెంచుకొనువారు హైందవులకన్న ఇప్పటిలో మఱివ్వరును నాకు కనిపించలేదు.

రంగమ్మ : మీ మాటలవలన నాకు చాల విచారము ...చున్నది. స్త్రీ స్వాతంత్ర్యము లేకపోవుట జాతి సగము వికాస శూన్య మగుచున్నది. ...ఎంతమందియో స్త్రీ లంతమంది, సగము ...నిర్జీవముగానున్నది.

మంగ : ఇది యెవరో యన్న మాట. షా నవాజ్ ...గము మొన్న నీ మాటయే యన్నదికదా? మొన్న ...త్రికలలో వచ్చినది. సరేకాని, జాతి వికాసమనగా ...మి? అది చెప్పుడు. ఆ మాటకు మొదట నర్థ ...ర్ణయమైనచో సగము జాతి వికాస రహితముగా ఉన్నదని నేనొప్పుకొందును -

రంగమ్మ మరల మాటాడలేదు.

మంగ : పరుల మాటలు ముక్కున పెట్టుకొని చెప్పుట వలన వచ్చిన నష్ట మిది. ఎవరో ఒక మాటందురు. ఆ మాటలో నవయవార్థము తెలియదు. ఏదో తెలిసినట్లుండి మనము ...వెంట పరువెత్తుదము. బుద్ధిమంతులు ప్రతి ...మును మొట్ట మొదట నిర్ణయించుకొని ...మాటాడరు.

రంగ : మీ చందా యిచ్చెదరా?

మంగ : ఎంత?

రంగ : ఆరు నెలలనుండి మీ రీయలేదట. పన్నెండు రూపాయలు.

మంగమ్మ దబ్బిచ్చి, "ఇంత చందా యెందుకండీ? బంతులు, బ్యాటులు. పరదేశపు ఆటసామానులు. వీనివలన వ్యయ మెక్కువగుచున్నది. గృహ క్రీడలని పేరు. వానికి కావలసిన వస్తువులకు ధన వ్యయము. వామన గుంటలు. పచ్చీసు గృహ క్రీడలు లేకపోయినవా? వానికింత వ్యయములేదే? పురుషులు చూడుడు! టెన్నిసు ఆడెదరు! ఒక్కొక్క బ్యాటు పాతిక రూపాయ లేబది రూపాయలు. బంతులకు ఖర్చు, వలకు ఖర్చు, క్రింద కంకరకు ఖర్చు, నెలకు రెండు వందలకు తక్కువ కాదు. రెండు వందలతో పదునేను బీద సంసారములు బ్రతుకవచ్చును. మన సమాజమున కిప్పుడగుచున్న వ్యయముతో నెల కైదు వందల మంది బ్రతుకవచ్చును. జమీందారుగారు మనకు భవనము కట్టించి యిచ్చిరి. ఊరి బయట నొక పెద్ద సావడి వేయించినచో బిచ్చగాండ్రెందఱుండవచ్చును? మీరందరు నధికారుల భార్యలు, ధనవంతుల భార్యలు. అందుచేత ధనము మీ కిచ్చెను. కోటముందు బిచ్చము దొరకుచున్నదో లేదో! "ఎండిన యూళ్ళ గో డెరిగింప డెవ్వడు; పండిన యూళ్ళకు బ్రభువులందరు" అన్నట్లు లేనివాడు కలవానికే పెట్టును, కలవాడును కలవానికే పెట్టును. నీరు సమృద్ధిగా గల సుబ్బన్నపేటలో గొళాయిలు పెట్టిరి. గుంటూరులో పెట్టరాదా? నర్సారావుపేటలో పెట్టరాదా? కృష్ణాజిల్లా భూములకు బంగారపు కాలువలు త్రవ్వించిరి. మహోపకారము చేసిరి? పల్నాటి తాలూకా వారికి కాలువలేవి? దత్త మండలము వారికి నీటి సదుపాయమేది? వారు బ్రదుక నక్కఱలేదు కాబోలు? లోకమును సముద్ధరించుట యచ్చట నేమైనది?

రంగమ్మ : మీకు చందా యిచ్చుట కిష్టము లేనిచో తీసికొనుడు.

మంగమ్మ : ఏదో నోటి మాటలే కాని, నేను మాత్రము తక్కువ తిన్నానా? తీసికొని పొండు! రంగమ్మ వెడలిపోయెను.

తరువాత కొన్నాళ్ళ వఱకును మంగమ్మను తక్కిన స్త్రీలందరును సందేహ దృష్టులతో చూడసాగిరి. ఒకనాటి సాయంవేళ విధవా వివాహ ప్రస్తావన వచ్చెను. "పురుషులందరు భార్య పోయినంతనే వివాహములు చేసికొనుచుండిరి. స్త్రీల కేల మరల పెండ్లిండ్లు కారాదు? అని రంగమ్మ అనెను.

మంగమ్మ : పురుషులు చేసికొనుచుండి రందురు. పురుషు లెవరు చేసికొనిరి? రెండవ పెండ్లిండ్లు కాక లక్ష మంది యుండిరి. మొదట పెండ్లియే కాక యుండిరి. వివాహము లెవరికగుచున్నవి? ధనవంతుల కగుచున్నవి. తండ్రి కొమార్తె నెవరి కిచ్చుచున్నాడు? వాడు చచ్చినచో తన కూతున కన్నమునకు లోపము లేదని యెవని ననుకొనునో వాని కిచ్చుచున్నాడు. బీదవాని కిచ్చుచున్నాడా? తండ్రి కనుక, తిండి మాట విచారించుచున్నాడు. కాని స్త్రీ తనంత తానే వివాహ మాడినచో ననురూపవరుని వెదకికొనునని కొందఱందురు. అనురూపవరుడనగా నానురూప్యము దేనియందు? వయసునందా? కులమునందా? ధనమునందా? భావములందా? అన్నిటియందు నెచ్చటను లేదుకదా! కుల మక్కఱ లేదుకదా! మనోభావములు తాదృగ్వి వాహనములు చేసుకొనువారికి నిరంతర మను రూపమేకదా! మిగిలినవి ధనము, వయస్సు మాట అట్లుంచి, ధనము; అధికారము కూడ ధనము కిందనే లెక్క. ఒక అఱప బ్రాహ్మణుని

కూతురు మహమ్మదీయుడైన పోలీసు సర్కిల్ ఇనెస్పెక్టరును జేసికొన్నదట! ఆతడు నలుబది యేండ్లవాడు. ఈమె పదునాఱేండ్లది. నలుబది యేండ్లవాడు పదునాఱేండ్ల పిల్లను చేసికొన్నచో కాకి గోల పెట్టిదరు. ఇరువదినాలుగేండ్లేకదా వారడి. ఈమాత్రము కాలములో స్వర్గమునకు నిచ్చెనలు కట్టుదురు కాబోలు.

ఇందిరాబాయి : అట్లే విధవరాండ్రు కూడ ధనము కలిగియున్నచో మఱల పెండ్లిండ్లు చేసికొనవచ్చునుకదా. ధనముగల పురుషులు చేసికొనుచున్నారుకదా!

మంగ : స్త్రీ పునర్వివాహ సంఘము లున్నవికదా! పురుషునకు ధనమున్నచో స్త్రీకి సౌందర్యమున్నది. కొద్దిగా ధనము కూడ నున్నది. సంస్కర్తలు కూడ ధనమును స్త్రీ సౌందర్యమును గలవారిని చూచియే చేసికొనుచున్నారు. మా పినతల్లి కూతురున్నది; వట్టి దరిద్రురాలు, దానికన్న నీగ్రోలు నయము. ఆ సంస్కర్త యెవరో వచ్చి దానిని పునర్వివాహము చేసికొని సముద్ధరించుమనుడు! ప్రతి విషయములోను జగత్తు ధనము వెంట పరిగెత్తుచుండగా గుణము వెంట పరిగెత్తుచున్నదని ప్రతివాదము లెందుకు?

సీతారామమ్మ : అయినచో మీరు శారదా చట్టమునకు కూడ వ్యతిరేకమేనా?

మంగమ్మ : నా వ్యతిరేక మెంత?

ఇందిర : దానిని గురించి మీ ఉద్దేశ్యమేమి?

మంగమ్మ : వాదనలలో కొన్ని యథార్థ విషయములు చెప్పరాదు. అవి అసభ్యముగా నుండును. వానివలన యాథార్థ్యము గోచరించుచుండును. మనము పొదించుట యనిన తోడనే కొన్ని యథార్థ విషయములు వదలిపెట్టి వాదించవలసి వచ్చుచున్నది. ఎనిమిది తొమ్మిదేండ్లకే తెలివిగల పిల్లకు భర్త యన్న ఊహ కలుగుచున్నది. స్త్రీ పురుష సంయోగమును గురించిన భావములు లీలగా గోచరించుచున్నవి. ఈ సంగతి ఒప్పుకొనినచో వాదన తరువాత.

ఇందిర : ఒప్పుకొన్నాము. తరువాత చెప్పుడు :

రంగమ్మ : నే నొప్పుకొనలేదు. అప్పటికి పసిపిల్లలకేమియు తెలియదు.

సీతారామమ్మ : ఆమెను చెప్పనిండు.

శ్యామల : ఆ సంగతి యొప్పుకొనక పోయినచో ఆమె చెప్పదు.

మంగమ్మ : శ్యామలా! నీ కెన్నేండ్లు?

శ్యామల : ఇప్పుడు పదునేడేండ్లు.

మంగ : నీకు పురుషుడన్న ఊహ యెప్పటినుండి కలదు? "శ్యామల సిగ్గుపడినది.

మంగ : ఎవ్వరము చెప్పము కాని, మనస్సాక్షి ప్రతి వారికిని గలదుకదా! చాల చిన్నప్పుడే యట్టి ఊహ కలుగును. ఆ యూహ కలిగినప్పటినుండి, తదూహ యేక పురుష విషయముగా! చేయుటకు మన పూర్వులు "అష్ట వర్షాభ వేత్కన్యా" అని వివాహమప్పుడే చేయుమనిరి. పదుమూడేండ్లు వచ్చి రజస్వల యైనగాని కార్యము చేయుటలేదు. బాల్య వివాహములో తప్పేమి? ఈ పిల్ల కతడు భర్తయనుట తప్పా? లజపతిరాయిగా రొకచోట వ్రాసినారు : "బాల్య వివాహములనగా ఇంగ్లండులో నివారు - మన యెనిమిదేండ్ల కన్యలకే గర్భాధానములు చేయుదుమని యనుకొందురట! వారి దేశములో వివాహము, కార్యము నొకటియే కదా? ఇచ్చుట అట్లు కాదు - "బాల్య వివాహము దోషమన్న భావ మచటినుండి పెరిగినది. పదుమూడేండ్లకు కార్యము చేయుట తప్పినచో తరువాత పెండ్లి చేయుట తప్పగును. అమెరికాలో కళాశాలలో చదువు బాల బాలికల కథలు "జడ్జి లిండ్సే" వ్రాసినాడుకదా! మన దేశము నట్లే తయారు కాబోవుచున్నది. కామము, స్త్రీ కేక పురుషైక విషయముగా చెప్పుటలో భౌతిక సుఖముకన్న పారమార్థిక మెుక్కువ యున్నది. మనోనియమ మనునది కామధేనువు వంటిది. అది మోక్షమునకు సాధనము. సంఘములో గాని, మతములో గాని, మరొక దానిలో గాని మీ రెన్ని మార్పులైన దేవచ్చును. ఇంద్రియ నిగ్రహము, మనో నిగ్రహము, తద్వారా భక్తియో; జ్ఞానమో కలుగుటకు వీలుండెనని మీరు తెచ్చిన మార్పు శిరోగ్రాహ్యము.

(ఇంకా ఉంది



# ఎం.సి.సి. క్రికెట్ జట్టులో మహాత్మాగాంధీ!

మహాత్మాగాంధి క్రికెట్ అంటే అభిమానించే వారు. కాని 1933–34 మన దేశం పర్యటనకు వచ్చిన యం. సి. సి. (ఇంగ్లీషు) క్రికెట్ జట్టు సభ్యుడుగా ఆయన నమోదు అయారు అనేది చాలామందికి తెలియదు. నమ్మలేరు.

బొంబాయిలో సెంటాక్యులర్ క్రికెట్ పోటీలు జరిగేవి. వీటిని ప్రతిష్ఠాకరముగా పాల్గొన్న జట్టు భావించేవి. ప్రజలు కూడా అలాగే ఆలోచించేవారు. ఎందుకు కారణము యీ పోటీలలో పాల్గొన్న జట్టు కులాలని బట్టి వుండేవి. హిందువులు, ముస్లిం, పార్సీలు, యూరోపియన్ జట్టు ఆడేవి. ఆ రోజుల్లో క్రీడారంగములో కూడా మత బేధాలు బాగా కనిపించేవి, 1936–37 సమయంలో యీ విషయం చర్చించుటకు భారతీయ అగ్రగామి క్రికెట్ ఆటగాడు విజయ్ మర్చంట్ మరికొందరు బృందంగా ఏర్పడి వార్ధాలో ఆశ్రమంలో యున్న గాంధీ గారిని కలుసుకొని వారి అభిప్రాయం తెలుసుకొనుటకు వెళ్ళారు. మహాత్మా గాంధీ వారిని కలుసుకొని అన్ని విషయాలు తెలుసుకొన్నారు. మతాలవారీగా జట్టు ఏర్పడి ఆడటానికి వారు వ్యతిరేకించారు.

ప్రమీల థాకర్సీ యొక్క కరుణ కుటీరంలో యున్న గాంధీగారిని విజయ్ మర్చంట్ కలసి ఆటోగ్రాఫ్ అడుగగా, విజయ్ వద్ద యున్న ఆటోగ్రాఫ్ పుస్తకంలో 1933–34లో ఎం. సి. సి. జట్టు మనదేశం పర్యటనలో యిచ్చిన ఆటోగ్రాఫ్ పేజీలో 17వ స్థానములో మహాత్మాగాంధిగారు సంతకం చేసి ఆశ్చర్యపరిచారు.

MCC Touring Team
1933 34

1 [illegible]
2. [illegible]
3. B H Valentine
4 [illegible]
5 [illegible]
6 [illegible]
7. [illegible]
8 [illegible]
9 [illegible]
10. [illegible]
11 [illegible]
12 [illegible]
13. [illegible]
14. [illegible]
15. J. [illegible]
16 J.H. [illegible]
17 [illegible]

50 ఏళ్ళ క్రితం విజయ్‌మర్చంట్ ఆటోగ్రాఫ్ పుస్తకంలో మహాత్మా గాంధీ సంతకం– యం. సి. సి. జట్టు సభ్యునిగా 17వ పేరు గాంధీగారిది.

– ముకరమ్

## షేర్ మార్కెట్

( 54 వ పేజీ తరువాయి)

వేస్తున్నారు అని తెలపటం. కుడివైపున ఎడ్వయిజర్టు ది ఇస్యూ లపేరువుంది. ఇంక రెండవ పేజిలోకి వస్తే వారు కంట్రోలర్ ఆఫ్ కాపిటల్ ఇస్యూల నుంచి ఏ రోజున లైసెన్స్ పొందినది, దాని తాలుకా నంబర్ మొదలైనవి వుంటాయి.

దీనికి దిగువున మనకు కావలసిన విషయాలు వున్నాయి–

ఇస్యూ ప్రారంభం : బుధవారం 22 జూన్ 1988.

త్వరగా ముగింపు : శనివారం 25 జూన్ 1988.

చివరి ముగింపు రోజు : శనివారం 2 జూలై 1988.

సాధారణంగా మనం త్వరగా ముగింపుతేదీ లోపు మన అప్లికేషన్ వారికి గాని వారు నియమించిన బాంకర్‌కి కాని అందేటట్టు చెయ్యాలి. లేకుంటే మనం అవకాశం కోల్పోతాము. ఎందుకంటె టువంటి పేరు పొందిన కంపెనీలు అన్నీ కూడా త్వరగా ముగింపు తేదీ లోపే పూర్తిగా సబ్‌స్క్రయిబ్ అవుతాయి. ఒక వేళ ఎదైన కారణాల వల్ల పూర్తిగా కాకపోతే చివరి ముగింపు తేదీ అన్న తేదికి మించి పొడిగించటానికి అవకాశం లేదు.

నేను సీరియస్‌గా వ్రాసుకుంటుంటే మా దంబు పోస్టు పట్టుకొని, ఇదేమిటి బాస్ ఇన్నేసి పుత్తరాలు. నాకు తెలిసినంత వరకు ఒక్క సినిమా తారలకు మాత్రమే ఇలా వస్తాయి అని విన్నాను. మీకు కూడా ఇన్ని పుత్తరాలా అని ఆశ్చర్య పోయాడు. ఆశ్చర్యం నుంచి తేరుకుని, బాస్! ఇవి అన్ని నువ్వు చదువుతావా లేకుంటె నీదగ్గరలో వున్న చెత్తబుట్టలో వేస్తావా అన్నాడు.

చెత్త బుట్టలో వేయటానికి నేను ఏ పత్రికకు ఎడిటర్‌ను కాను. తప్పని సరిగా వచ్చిన ప్రతి పుత్తరాన్ని కూడా ఏరోజుకు ఆరోజు చదువుతాను కాని జవాబు ఇవ్వటంలో కొంత ఆలస్యం జరుగుతుంది అని చెప్పి, ఆరోజు పుత్తరాలు చదువు తున్నాను. ఇంతలో మా దంబూ కూడా చాలా ఆసక్తిగా విప్పి చదవటం మొదలెట్టి, ఇదిగో బాస్ హైదరాబాద్ నుంచి కె. ప్రసన్నరాణి గారు ఇలా వ్రాశారు. అయ్యా మీ ఆర్టికల్స్ చదువుతుంటే నాకు ఏమి అర్ధం గావటం లేదు. అవి అన్ని బాగా దబ్బున్న వారికి మాత్రమే అర్ధమయ్యేటట్టు వున్నాయి. చదువుతూ వుంటే ఏదో హరికథ, బుర్రకథ లాగా వుందికాని ఏమాత్రం అర్ధంగావటంలేదు" అని చదివి నా వైపు చూశాడు. ఏమిటి మీ సమాధానం అన్నట్టు.

చూడు దంబు ఈ హరికథ, బుర్రకథ అనేవి, ఏదైన ఒక ఇతిహాసాన్ని కాని, ఒక మంచి సంఘటనను గాని గ్రంధస్థంగా వున్న వాటిని పామరులకు కూడా అర్ధమయ్యే సరళిలో వివరించే ఒక ప్రక్రియ మాత్రమే. ఆవిడగారు అన్నట్టు ఇవి నిజంగా హరికథలు, బుర్రకథలుగా వుంటే నిజంగా నా ప్రయత్నం ఫలించినట్టే. ఎందుకంటే ఈ షేర్‌మార్కెట్ గూర్చి వివరించటం చాలా కష్టం. అందులో అన్ని వర్గాలవారిని ఆకట్టుకునే విధంగా వివరించటం, ఇంకా కష్టం. అంతేకాక ఇది చాలా డ్రై సబ్జక్ట్, దీన్ని సూటిగా వివరించాము అనుకోండి, అర్ధికశాస్త్రం మరియు రసాయన శాస్త్రం క్లాసలనుంచి స్టూడెంట్స్ ఎలా పారిపోతారో, అలాగా దీన్ని కూడా ఎవరూ చదవక పోతే మన పత్రిక వారు ఈపాటికి నిలిపి వేసేవారు. అలాగాకుండా, చేదుమందు కూడా తియ్యని కోటింగ్‌తో ప్రజలందరికి అందుబాటులో వుంచాలి అన్న రీతిలో చిన్నచిన్న పిట్ట కథలతో ఈ డ్రై సబ్జెక్ట్‌ని మీ ముందు వుంచుతున్నాను. ◘

Printed and Published for Nageswara Rao Estates Private Ltd., by S. Nageswara Rao, at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada - 520 003. Acting Editor : M. Madhava Rao, Chief Editor : S. Radhakrishna.
Phones : Business : 61247, 61248, 75569 Editorial : 75667

హైదరాబాద్ నోట్ బుక్

# రాళ్ళపల్లి వారి కృతుల ప్రచారం

గాన కళాప్రపూర్ణాద్యనేక బిరుదాంచితులు డాక్టర్ రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మ సంగీత సాహిత్యాలలో ఉద్దండులని ప్రతి తెలుగు వానికీ తెలుసు. ఆయన కవితలు, విమర్శనలతో పాటు మా



ప్రొఫెసర్ రాళ్ళపల్లి ఫణిశాయి

పెనుగొండ కొండ వంటి కొన్ని గేయాలు వ్రాశారని అందరికీ తెలుసు. ఆయన స్త్రీల పాటలు కూడ వ్రాశారని నాబోటి కొందరికే తెలుసు. శాస్త్రీయమైన సంస్కృత కృతులు, తెలుగు కన్నడ కృతులు రచించారని నాకు కూడ తెలియదు. ఇటీవల హిమాయత్ నగర్‌లోని సైంటిఫిక్ ఆఫీసర్ శ్రీ వి. ఎస్. నరసింహాచార్ గారి ఇంట్లో జరిగిన పాట కచ్చేరికి హాజరయ్యేంత వరకు డాక్టర్ రాళ్ళపల్లి వారి జ్యేష్ఠ పుత్రుడు ప్రొఫెసర్ ఫణిశాయి కూడ గొప్ప సంగీత విద్వాంసుడు. ఆయన బెంగుళూరులోని నేషనల్ కాలేజీ ప్రిన్సిపాల్ పదవి నిర్వహించి, విశ్రాంతులయిన వారు. ఆయన పాట కచ్చేరికి ముందు ప్రసంగిస్తూ, తమ తండ్రిగారు శ్రీ అనంతకృష్ణగారు స్వరపరచిన, తక్కిన అన్నమాచార్యుల కీర్తనలను, తండ్రిగారి కీర్తనలను ప్రచారం చేయడం శేష జీవితం లక్ష్యంగా పెట్టుకొన్నానని అన్నారు. పిదప రెండు మూడు గంటల పాటు సంగీత కచ్చేరీ జరిగింది. తర్వాత ఆతిథేయులు శ్రీ వి. ఎస్. నరసింహాచార్ గానామృతంతో తులతూగే విందు చేశారు.

## చెన్నపురిలో ప్రభాకర శత జయంతి

శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారి శత జయంత్యుత్సవం ఏప్రిల్ 26న చెన్నపురిలో చెన్నపురి ఆంధ్ర మహాసభ హాలులో వైభవోపేతంగా జరిగింది. సుప్రసిద్ధ పారిశ్రామికవేత్త చెన్నపురి ఆంధ్ర మహాసభ అధ్యక్షులు శ్రీ మణి స్వాగతం చెప్పారు. అధ్యక్షులు డాక్టర్ కోరాడ మహాదేవ శాస్త్రి ముఖ్య అతిథిగా విచ్చేసిన అశీతి వర్ష వృద్ధులు, మహా విద్వాంసులు శ్రీ బులుసు వెంకటరమణయ్య, మద్రాసు విశ్వ విద్యాలయం తెలుగు శాఖాధ్యక్షులు ప్రొఫెసర్ డాక్టర్ వి. రామచంద్ర, రీడరు డాక్టర్ కృష్ణమూర్తి, మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాల తెలుగు ప్రొఫెసర్ డాక్టర్ చిన్ని కృష్ణయ్య, శ్రీ వేదం వేంకటరాయశాస్త్రి, తిరుమల రామచంద్ర, శ్రీ వేపా, శ్రీ ప్రభాకరశాస్త్రి గారి చివరి కుమార్తె శ్రీమతి వినత మున్నగువారు ప్రభాకరశాస్త్రిగారి బహుముఖ ప్రజ్ఞను సౌజన్య సౌశీల్యాలను, ఔదార్యాన్ని వివరించారు. ఈ సందర్భంగా శ్రీ మణిగారు శ్రీ బులుసు వెంకట రమణయ్య గారిని, శ్రీమతి వినతను కాశ్మీర శాలువలతో సత్కరించారు.

## సతి దురాచారం— కామకోటి పీఠాధిపతుల ఖండన:—

కంచి కామకోటి పీఠాధిపతులు శ్రీ జయేంద్ర సరస్వతి మే 6న పత్రికా ప్రతినిధుల గోష్ఠిలో ముచ్చటిస్తూ, "సతి" శాస్త్రాలలో వున్నా నేటి కాలానికి అనుగుణ మైన హిందూ ధర్మం కాదని స్పష్టంగా చెప్పారు. ఇది ఉత్తర భారతంలోని ఒక వర్గంలోని వీర వంశాలలో ఆచారంగా వుండేది, క్రమంగా గుడ్డి మూఢాచారమైంది— అని ఆయన అన్నారు. ఎక్కడో జరిగిన 'సతి' సంఘటనను గోరంతలను కొండంతలు చేసి, రాజకీయంగా దుర్వినియోగం చేసుకుంటున్నారని ఆయన విచారం ప్రకటించారు. 'సతి' నేడు అనూహ్యం, నేడు స్త్రీ పురుషులు సమానులుగా పరిగణింపబడి, కార్యాలయాలలో కలసి పని చేస్తుండగా దానిని ఎలా ఊహిస్తాం? క్షత్రియులలో మూడు నాలుగు తరాల కొకమారు ఎవరో భక్త్యతిశయంతో సతి అయ్యేవారు. ఎక్కడో చెదురు మదురుగా జరిగితే, సంఘానికి కలిగే హాని ఏమీ లేదు. స్వచ్ఛందంగా జరిగే దానిని ఎవరూ ఆపలేరు. బాల్య వివాహాలనూ ప్రభుత్వం చట్టంతో నిషేధించినా, ఇంకా అసంఖ్యాకంగా జరుగుతూనే వున్నాయి. ప్రభుత్వం అలాటి చట్టవిరుద్ధమైన పనులను అరికట్టడానికి ఏమి చర్య తీసుకుంది?— అని ఆయన ప్రశ్నించారు. జన కల్యాణోద్యమం గడచిన అక్టోబర్ 2న కంచిలో ప్రారంభించినప్పటి నుంచి లక్షకు పైగా సభ్యులు చేరి స్థానిక సంఘాలుగా ఏర్పడ్డారని ఆయన తెలిపారు. ఈ సంఘాలు ఆంధ్రప్రదేశ్‌తో సహా వివిధ రాష్ట్రాలలో ఏర్పడ్డాయని, జనకల్యాణోద్యమం హిందూ ధర్మ రక్షణ విస్తరణ కోసమే గాని, రాజకీయాలతో సంబంధించింది కాదని ఆయన స్పష్టం చేశారు.

## మతం— సైన్స్:—

న్యూస్ టైమ్స్ సంపాదకవర్గ సభ్యులు, సుప్రసిద్ధ రచయిత శ్రీ వాకాటి పాండురంగారావు మే 8వ తేదీన తెలుగు గోష్ఠిలో మతం - సైన్సుల ధ్యేయం ఒక్కటేనని, అవి పరస్పర విరుద్ధాలు కావ[ని] ప్రసంగించారు. మతాన్ని అనుసరించే వారిని సం[ఘ] విద్రోహులుగాను, సైన్సును అభిమానించే వారి[ని] అభ్యుదయవాదులుగాను జనం భావిస్తున్నారని. హేతువాదులమని అనుకొనే వారికి సైన్సు తెలియదని, సైన్సు ఫలమైన టెక్నాలజీని చూచి, అదే సైన్సని భ్రాంతి పడుతున్నారని ఆయన అన్నారు. వేదాలు, ఉపనిషత్తులు చర్చించిన నేతి వాదం వంటి వివిధ వాదాలు నేటి సైన్సులోను ఉన్నాయని, సత్యాన్వేషణలో రెండిటి లక్ష్యం, పద్ధతి ఒక్కటేనని ఆయన వివరించారు. ప్రతి వ్యక్తి తమ పద్ధతిలో, పరస్పర నిందాదులు లేక సత్యాన్వేషణకు పూనుకుంటే, వ్యక్తుల సమూహమే సంఘం గనుక, అలాటి వారి వల్ల ఉత్తమ సంఘం రూపొందే అవకాశం వుందని శ్రీ పాండురంగారావు అన్నారు.

## ఉపశ్రుతి :—

ఒక అపరిచితుడు నా వద్దకు వచ్చాడు. ఎగాదిగా చూచాడు, చుట్టూ తిరిగి చూచాడు. నేన ఆశ్చర్యంగా చూస్తున్నాను. పిచ్చివాడేమోనని, నా పక్కన వున్న వ్యక్తి కొంచెం జాగ్రత్తపడ్డాడు. "ఇటీవల మీకేదో పట్టా వచ్చిందన్నారు. మీలో ఏదైనా మార్పు వచ్చిందేమోనని చూచా" అన్నాడు

అమ్మయ్య! బతికాం. మీ వాలకం చూచి భయపడ్డాం. ఏమి వచ్చినా ఆయన మారడు. ఆయనలోని వాడు అజో నిత్యః శాశ్వతో యం పురాణః కనుక మారడు – అని నా పక్కన వున్న వ్యక్తి గట్టిగా చెప్పాడు.

—తిరుమల రామచంద్ర

ఇటీవల హైదరాబాదులో ఆంధ్ర లలితా కళా సమితి నిర్వహించిన ఏకపాత్రాభినయ పోటీలలో కైకేయి పాత్రను అభినయించి ప్రథమ బహుమతి పొందిన కాశీనాధుని ఆనందప్రసాద్.






**శరీరం గురించిన ఆత్మవిశ్వాసం వినోద్ కైవసం - సింథాల్‌తో!**

# సినిమా విశేషాలు

_జి.వి.జి.

## బాలకృష్ణ సినిమాస్కోప్ చిత్రం "రక్తాభిషేకం"

"జూన్ 11 నుంచి నెలాఖరు వరకు జరిగే షెడ్యూల్ తర్వాత జూలైలో క్లయిమాక్స్ చిత్రీకరిస్తాం." అన్నారు ఎ. కోదండరామిరెడ్డి ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో కె. సుబ్బారెడ్డి సమర్పించే రాజీవ ప్రొడక్షన్స్ వారి పై చిత్రంలో బాలకృష్ణ, రాధ, జగ్గయ్య, సత్యనారాయణ, శరత్‌బాబు, జె. వి. సోమయాజులు, రంగనాథ్, వేలు, సంగీత, శ్రీలక్ష్మి, బేబీ సుజిత పాత్రధారులు. యండమూరి కథకు జంధ్యాల సంభాషణల రచయిత. వేటూరి గీతాలకు ఇళయరాజా స్వరకర్త. ఎన్. సుధాకరరెడ్డి ఛాయ. శ్రీనివాసరాజు శిల్పం, రఘురాం నృత్యాలు, విజయన్ సాహసాలు, సదాశివరావు సంయుక్త దర్శకత్వం, ఆనంద్ – నాగరాజు సహకార దర్శకత్వంతో కె. సి. రెడ్డి నిర్మాత.

## పరుచూరి సోదరుల దర్శకత్వంలో "నిరుద్యోగ భారతం"

"ఒక ప్రముఖ హీరో కథానాయకుడు, అన్నారు పరుచూరి సోదరులు వీరి కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, దర్శకత్వంలో "ఊర్వశి" శారద సమర్పించే రవికిరణ్ మూవీస్ వారి పై చిత్రంలో శారద, జీవిత, పరుచూరి గోపాలకృష్ణ ప్రభృత నటవర్గం. బి గోవిందరెడ్డి నిర్మాణ సారథ్యంలో ద్వారంపూడి నరసారెడ్డి, డి ఎ ఎ. రమణారెడ్డి నిర్మాతలు

## కాంతారావు సమర్పించే చిత్రంలో వాణిశ్రీ

"దాదాపు పదేళ్ళ తర్వాత వాణిశ్రీ నటించే చిత్రం. జూన్ 25న ప్రారంభోత్సవం జూలై, ఆగస్టు, సెప్టెంబర్‌లలో షూటింగ్ పూర్తవుతుంది" అన్నారు ప్రముఖ నటులు టి. ఎల్. కాంతారావు, ఈయన సమర్పణలో ఈయన పుత్రుడు టి. ప్రతాప్ నిర్మించే మయూరి పిక్చర్స్ వారి చిత్రంలో వాణిశ్రీ శరత్‌బాబు, సురేష్, సీత, గొల్లపూడి మారుతీరావు గిరిబాబు, వేలు, కాంతారావు పాత్రధారులు. సత్యానంద్ సంభాషణల కర్త ఇళయరాజా స్వరకల్పనతో వేటూరి, సీతారామశాస్త్రి గీతాలు రాశారు రంగా ఛాయ, తోట యాదు శిల్పం, మదనమోహనరావు సహకార దర్శకత్వం, కోటగిరి గోపాలరావు కూర్పు, ప్రతాప్ బ్రదర్స్ నిర్మాణతతో గతంలో "గుండెలు తీసిన మొనగాడు" చిత్రానికి ప్రతిభావంతంగా దర్శకత్వం నెరపిన శ్రీ చక్రవర్తి స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహిస్తున్నారు



"రక్తాభిషేకం"లో

రాధ, బాలకృష్ణ

# హాస్యనటుడు 'సుత్తి' వీరభద్రరావు మృతి



సుప్రసిద్ధ హాస్యనటుడు 'సుత్తి' వీరభద్రరావు జూన 30న గుండెపోటు వల్ల మద్రాసులో మరణించారు. ఆయన వయసు 42 సంవత్సరాలు. ఆయనకు భార్య, ముగ్గురు పిల్లలున్నారు.

చిన్నతనం నుండే ఆయన నటజీవితం ప్రారంభించారు. రంగస్థల నాటకాలతో నటనతో ప్రారంభించిన వీరభద్రరావు 1973లో విజయవాడ ఆకాశవాణి కేంద్రంలో నాటక నిర్వహణ శాఖలో చేరారు. 'బలిపీఠం' చిత్రంలో తొలిసారిగా వెండితెర కెక్కిన వీరభద్రరావు 'ఎర్రమల్లెలు'తో పూర్తిగా సినీరంగంలో స్థిరపడ్డారు. 'నాలుగు స్తంభాలాట' చిత్రంలోని పాత్ర ద్వారానే ఆయనకు 'సుత్తి' వీరభద్రరావు అనే పేరు వచ్చింది. మొత్తం మీద ఆయన వందకు పైగా చిత్రాల్లో నటించారు.

## శ్రీ కామాక్షి కమర్షియల్స్ చిత్రంలో కోదండరామిరెడ్డి, నాగార్జున

"నాగార్జున పక్కన రాధ తొలిసారి నాయికగా నటిస్తోంది. జూలై ఒకటిన ప్రారంభోత్సవం," అన్నారు ఎ. కోదండరామిరెడ్డి. ఈయన దర్శకత్వంలో శ్రీ కామాక్షి కమర్షియల్స్ అధినేత డి. శివప్రసాదరెడ్డి "శ్రావణ సంధ్య" అనంతరం నిర్మించే చిత్రంలో సత్యనారాయణ, గొల్లపూడి మారుతీరావు, వేలు ప్రభృతులతో పాటు మరో నాయిక ఉంటుంది. యండమూరి వీరేంద్రనాథ్ కథకు గణేశ్ పాత్రో సంభాషణలకర్త. సెప్టెంబర్ రెండవ వారం వరకు జరిగే మూడు షెడ్యూల్స్‌లో షూటింగ్ పూర్తవుతుంది.




## "బాలకృష్ణుడు"గా బాలకృష్ణ

"సెప్టెంబర్, అక్టోబర్, నవంబర్‌లలో ప్రతి నెలా 11–20 తేదీల మధ్య జరిగే షెడ్యూల్స్‌తో షూటింగ్ పూర్తవుతుంది," అన్నారు ఎస్. ఎస్. రవిచంద్ర. ఈయన దర్శకత్వంలో కోగంటి హరికృష్ణ నిర్మించే శ్రీ వెంకటేశ్వర ఫిలిమ్స్ వారి పై చిత్రంలో బాలకృష్ణ, భానుప్రియ, మోహన్‌బాబు, సత్యనారాయణ, గొల్లపూడి మారుతీరావు, నూతన్‌ప్రసాద్, తార, వై. విజయ ఆదిగాగల వారు పాల్గొంటారు. గొల్లపూడి కథకు సత్యానంద్ సంభాషణలకర్త. భరత్ సంయుక్త దర్శకత్వం, ఇళయరాజా సంగీతం, నందమూరి మోహనకృష్ణ ఛాయ, సారిక – ఉమాకాంత్ నిర్వహణ – కోటగిరి వెంకటేశ్వరరావు కూర్పు బాధ్యతలు వహిస్తారు. "జూలై 25 న పాటల రికార్డింగ్‌తో ప్రారంభోత్సవం," అన్నారు నిర్మాత.

## కృష్ణంరాజు, మధుసూదనరావులతో జయకృష్ణ చిత్రం

"జూలై 4 నుంచి 15, ఆగస్ట్ 1 నుంచి 15 వరకు హైదరాబాద్‌లోనే జరిగే షెడ్యూల్స్‌తో షూటింగ్ పూర్తవుతుంది," అన్నారు మిక్కిలినేని జగదీశ్ బాబు. ఈయన నిర్వహణలో జయకృష్ణ నిర్మించే జయకృష్ణా మూవీస్ మూడవ చిత్రంలో కృష్ణంరాజు సరసన సుహాసిని నాయిక. శరత్‌బాబు, గెస్ట్‌గా సత్యనారాయణ, ఒక బాల తార కూడా నటిస్తున్నారు. ఫాజిల్ కథకు జంధ్యాల సంభాషణలకర్త. వేటూరి గీతాలు, రాజ్‌కోటి సంగీతం, ఎ. ఎస్. ఆర్. స్వామి ఛాయ, భాస్కరరాజు శిల్పం, ఎం. కులశేఖరరెడ్డి సంయుక్త దర్శకత్వం, రామ్‌మోహన్– మురళి ప్రొడక్షన్, గౌతంరాజు కూర్పుతో స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించే వి. మధుసూదనరావు "సెప్టెంబర్‌లో పాచ్‌వర్క్ ముగిస్తాం," అన్నారు.

# దర్శకుడు కట్టా సుబ్బారావు మృతి

ప్రఖ్యాత చలనచిత్ర దర్శకుడు కట్టా సుబ్బారావు జూలై 3న మరణించారు. ఆయన వయసు 49 సంవత్సరాలు. 'వియ్యాలవారి కయ్యాలు' చిత్రంతో



దర్శకుడుగా రంగం మీదికి వచ్చిన సుబ్బారావు దాదాపు 10 సినిమాలకు దర్శకత్వం వహించారు. ఆయన దర్శకత్వంలో నిర్మాణమయిన 'సీత పుట్టిన దేశంలో', 'కాలరుద్రుడు' చిత్రాలు విడుదలకు సిద్ధంగా ఉన్నాయి. సుబ్బారావు బ్లడ్ కేన్సర్‌తో మరణించారు. తనకు బ్లడ్ కేన్సర్ ఉన్న విషయాన్ని ఆయన ఎవరికీ తెలియకుండా దాచారని తెలుస్తోంది. ఆయనకు ఐదుగురు కుమారులున్నారు.